# మధీమంజరి

వాఙ్మయ-యోగ-పరిశోధన పత్రిక

సంచిక : 1 సంపుటం : 1 ఫిబ్రవరి-1981

**జయంతి సంచిక**

*సంపాదకులు*

**వేటూరి ఆనందమూర్తి**

**వేటూరి ఆంజనేయులు**






**శ్రీ ప్రభాకర పరిశోధక మండలి**

'శ్రీనివాస్' – 6/2 ఆర్.టి. (న్యూ)

విజయనగర్ కాలనీ , హైదరాబాదు-500 457

ఆంధ్రప్రదేశ్

## స్వవిషయము

"రవికి దీపమున నర్చ లిచ్చు పగిదివోలె"

(నన్నిచోడని కుమారసంభవము 1–49)

శ్రీ ప్రభాకర పరిశోధక మండలి (హైదరాబాదు) వారు ప్రచురిస్తున్న ఈ షాణ్మాసిక 'మణిమంజరి' వాఙ్మయ యోగ పరిశోధన పత్రికగా రూపుదిద్దుకొంటున్నది. గురుదేవులు స్వర్గీయ శ్రీ ప్రభాకరశాస్త్రిగారి దివ్యస్మృతి కంకితమైన మా యీ 'మణిమంజరి' శ్రీవారి జయంతి-వర్ధంతి సందర్భాలను పురస్కరించుకొని ఏడాదికి రెండుసార్లు ఫిబ్రవరిలోను-ఆగస్టులోను వెలువడుతుంది. గురుదేవుల 93వ జయంతిని పురస్కరించుకొని "ప్రభాకర జయంతి సంచిక" ప్రస్తుతం మీ ముందున్నది.

విడిప్రతి వెల (స్వదేశంలో) రూ. 15/- (పోస్టేజి ఉచితము)
సంవత్సర చందా ,, రూ. 25/- ( ,, )
సంవత్సర చందా (విదేశాలకు) 8 డాలర్లు ( ,, )

కొద్ది ప్రతులు మాత్రమే అచ్చయినవి. వలసినవారు ముందుగానే సొమ్మును మనియార్డరు ద్వారాగాని, డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగాని క్రింది విలాసమునకు పంపి చందాదారులు కావచ్చును.

ముందు ముందు 'మణిమంజరి' కొత్త శీర్షికలను సంతరించుకొనబోతున్నది. గురుదేవుల మౌలిక రచనలెన్నో పరంపరగా ఇందు వెలువడ నున్నవి.

సంపాదకులు-మణిమంజరి
6/2 RT (New) విజయనగర్ కాలనీ
హైదరాబాద్-500 457
ఆంధ్రప్రదేశ్

---

"తెలుగు నేలలోని ప్రత్యణువునందును జీవము, శిల్పము, చరిత్ర కలదని ప్రభాకర శాస్త్రిగారు నిరూపించిరి ....

వేటూరివారు వెలువరించిన ప్రతి వాక్యమును సంపాదించి సంపుటీకరించుట మన కనిష్ఠ ధర్మము. తెలుగు సోదరులు కర్తవ్యపరాయణులయ్యెదరుగాక."

— తుమ్మల సీతారామ మూర్తి
(ఆంధ్రపత్రిక. 14-9-1950)

"శ్రీ ప్రభాకరశాస్త్రిగారు రచించిన, పరిష్కరించిన గ్రంథములు మొదలగునవి అచ్చులో నున్నవి. ప్రకటితములు కావలసినవి అనేకములు గలవు. వాటిని సమగ్రముగ ఆకళింపు చేసికొని మరొకప్పుడు లోకమునకు వెల్లడింపగలము. శ్రీవారు విడిచి వెళ్ళిన కార్యభార మెంతేని గలదు. ఏ తన్నిర్వాహమును త్వరలో సమగ్రము గావించుటకు తగిన ధైర్య స్థైర్యములను సాధనసంపత్తిని భగవంతు డనుగ్రహించునుగాక."

(సానుతాప సందేశాలకు ప్రభాకరశాస్త్రిగారి కుమారుల కృతజ్ఞత
ఆంధ్ర ప్రభ - 20-9-50)




विदेश मंत्री, भारत
Minister of External Affairs
INDIA

New Delhi
April 6, 1981

I am happy to know that Prabhakara Parishodhaka Mandali is now bringing out a Six-monthly journal under the title 'Mani Manjari'. I have admired the voluminous and valuable contribution of Late Shri Veturi Prabhakara Sastry and the variegated range of his writings. Any attempt to bring out this large mass of high quality literary meterial would, I think, be welcome not only from the general readers' point of view but also as a service to researchers. I would like to compliment Shri Ananda murthy and his colleagues for this very useful venture.

**(Sd.) P. V. Narasimha Rao**

**Avula Sambasiva Rao**
Vice-Chancellor, Andhra University
Waltair,
Visakhapatnam-530 003 (A.P.)
Dt. April 10, 1981.

It gives me pleasure to know that the Prabhakara Parisodhaka Mandali is going to bring out half-yearly literary journal captioned 'Mani Manjari', and its first issue will be released shortly. It is good news for us who are interested in Telugu Language and Literature.

Sri Veturi Prabhakara Sastry Garu was a good poet, philosopher, scholar and critic. I enjoy reading his poetry and articles written in simple language, but pregnant with rich ideas,

I commend the Parisodhaka Mandali for their efforts in bringing out the poetic works of Shri Sastry Garu in their journal, in series. I am sure that the journal 'Mani Manjari' will be acclaimed as good Literary journal. May the efforts of the Mandali meet with every success

(Sd) **Avula Sambasiva Rao**

దేవులపల్లి రామానుజరావు

ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్, హైదరాబాదు
తేదీ. 27-3-1981

స్వర్గీయులు మీ పితృపాదులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారి స్మృత్యర్థం, 'మణిమంజరి' అనే పత్రికను ఆరునెలల కొకసారి ప్రకంటిచవలెనని మీరు నిశ్చయించినట్లు, అందులో శాస్త్రి గారి అముద్రిత రచనలతోపాటు వారిని గూర్చి యితరులు చేసిన రచనలు ప్రకటితంకాగలవని తెలుసుకొని మిక్కిలి ఆనందించినాను. ఇది తప్పక చేయవలసినపని. కొంత ఆలస్యం అయి నప్పటికిని మీరు యిందుకు పూనుకోవడం సంతోషకరం.

ఆధునిక ఆంధ్ర వాఙ్మయంలో ప్రభాకరశాస్త్రి గారిది సమున్నతమైన స్థానం. వారు అద్వితీయులని చెప్పినా అతిశయోక్తికాదు. కవిత్వం, వాఙ్మయ పరిశోధన, భాషాపరిశోధన, చరిత్రపరిశోధన, సాహిత్యం అన్నిటిలోను వారు సిద్ధహస్తులు. అనేకరంగాలలో నూతన అంశా లను ఎన్నియో కనుగొని ప్రకటించి తెలుగు భాషకు నూతన వికాసాన్ని కలిగించినారు. ప్రభాకరశాస్త్రిగారు నైతిక విలువలను పాటించినయోగీశ్వరులు. వారి యోగవిద్య అనేకులకు బాధానివారణ కావించినది. ఈ విధమైన విశిష్ట వ్యక్తిత్వంకలవారు తెలుగువారిలో అరుదని చెప్పితే సత్యానికి భంగంవాటిల్లదు.

నేను స్వయంగా వారిని సందర్శించినాను. స్వర్గీయ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు ఆస్థానకవియైన సందర్భంలో విజయవాడలో జరిగిన మహాసభలలో నేను వారి ఉపన్యాసం విన్నాను; ప్రత్యక్షంగా కలిసి మాట్లాడినాను. ఆ సంభాషణ ఒక విజ్ఞానపు విందుగా ఉండినది. శాస్త్రిగారు తెలుగు వైతాళికులలో అగ్రశేణికి చెందినవారు. వారి అముద్రిత రచనలన్నీ ప్రకటి తంకావలెను. మనం వారిని మరచి పోవడం కృతఘ్నత కాగలదు.

'మణిమంజరి' వారి యశశ్చంద్రికలను తెలుగు నేలమీద శాశ్వతంగా వెదజల్లవలెను. ఈ పత్రికను నిర్విఘ్నంగా చిరకాలం నడిపేపద్ధతి ఆలోచించండి. నా సహకారం పూర్తిగా ఉంటుందని చెప్పవలసిన అవసరంలేదు కదా!

(సం) దేవులపల్లి రామానుజరావు

**ఆచార్య బి. రామరాజు**

డీన్, ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు
తేదీ. 29.4.1981

శ్రీ ప్రభాకర పరిశోధక మండలి పక్షమున మీరు మణిమంజరి అనే పత్రికను వెలువరిస్తున్నందుకు చాలా సంతోషము. తెలుగులో సాహిత్య పత్రికలు చాలా ఉన్నవి కాని ఉన్నత ప్రమాణాలు పాటించే పరిశోధన పత్రికల కొరత ఎంతైనా ఉన్నది. అప్పుడప్పుడు పరిశోధనకు అంకితమైన ఒకటి రెండు పత్రికలు వెలువడినా అవి బాలారిష్టములు గడవక ముందే ఆగిపోయినవి. కీ.శే. ప్రభాకర శాస్త్రి గారి పేరుతో వెలువడే ఈ మణిమంజరి ఉన్నత ప్రమాణాలు పాటిస్తూ కలకాలం మనగలదనీ దీని ద్వారా మీరు ప్రభాకరుల జ్ఞానదీధితులు లోకానికి అందిస్తారనీ ఆశిస్తున్నాను. శుభమస్తు

(సం) ఆచార్య బి. రామరాజు

# విషయసూచిక



వే. ప్రభాకరశాస్త్రి

జననం: 7-2-1888

నిర్యాణం: 29-8-1950

# మ న వి

శ్రీ ప్రభాకర పరిశోధక మండలి (హైదరాబాదు) పక్షమున మా యీ 'మణిమంజరి' వాఙ్మయ-యోగ-పరిశోధన పత్రికగా రూపు దిద్దుకొంటున్నది. కవిచూడామణి, విమర్శకాగ్రేసరులు, యోగిపుంగవులు అయిన గురుదేవులు కీ॥శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి దివ్య స్మృతి కంకితమైన ఈ షాణ్మాసిక ద్విభాషాపత్రికగా ఈ సంవత్సరం మొదలుకొని ఫిబ్రవరి ఆగస్టు మాసాలలో శ్రీవారి జయంతి-వర్ధంతి సందర్భాలను పురస్కరించుకొని వెలువడగలదు. మణిమంజరి తొలిసంచిక ప్రభాకరజయంతిసంచికగా ఇప్పుడు మీ ముందున్నది.

ఆంధ్ర-ఆంగ్ల భాషల్లో ప్రముఖుల వ్యాసాలతో పాటు గురుపాదుల ముద్రితాముద్రిత రచనలు అనేకములు- కవితలు; చాటువులు; విమర్శలు; వ్యాసములు; ఉపన్యాసములు; వ్యాఖ్యలు, టీకలు, టిప్పణులు; పీఠికలు, సమీక్షలు; లేఖలు; డైరీలు; సామెతలు, నానుళ్ళు, పలుకుబళ్ళు; కథలు, గాథలు; జీవితము, యోగము; అవీ యివీ మొదలైన అపూర్వ విషయములు పరంపరగా ఇందు వెలువడగలవు. కొన్ని శీర్షిక లిందున్నవి. తక్కినవి మలి సంచికలో ప్రారంభం కాగలవు.

శ్రీ ప్రభాకర పరిశోధక మండలి 1950లో స్థాపితమైనది మొదలుకొని నేటికి తమ గ్రంథమాలలో చిన్నవీ పెద్దవీ పునర్ముద్రణములూ అన్నీ వెరసి ఇరవై గ్రంథ కుసుమములకు పైగా విరియజేసినది. వచ్చినవి కూడా కొద్ది ప్రతులు మాత్రమే అచ్చయిన కారణముగా అవీ నేటికి చాలావరకు చెల్లిపోయినవి. ఈ విధంగా శ్రీవారి రచనలు ఇప్పటికి కొన్నే వచ్చినా ఎక్కువ భాగం ఇంకా వివిధ సంపుటములలో వెలుగులోనికి రావలసినవే ఉన్నవి. మౌలికములైన శ్రీవారి రచనల్లో బాహుళ్యము, విస్తృతి, వైవిధ్యము అధికము కావడము వల్లను, వాఙ్మయ పరిశీలకుల కా రచనలు పెన్నిధులు కావడంవల్లను, అవీ అన్నీ ఒకచోట లభ్యం కాకపోతుండడం వల్లను వాటిని త్వరలో ప్రకటించవలసిన అవసరమెంతైనా ఉన్నది. ఈ బృహత్కార్యము ప్రభుత్వవ్యవస్థల ప్రజాసంస్థల సహాయ సహకారములు లేనిదే నిర్వహించడం దుస్సాధ్యముగా నున్నది. సంకలనపరచిన రచన లున్నవి. వాటిని సరిగా ప్రకటించే విషయమై శ్రమించడానికి శ్రీ ప్రభాకర పరిశోధక మండలి సిద్ధముగా ఉన్నది. వలసినది అర్థబలమే. ఈనాడు గ్రంథ ప్రకటనమూ విక్రయమూ రెండూ కూడా వ్యయ ప్రయాసలతో కూడుకొన్న పనులుగా ఉన్నవి.

ఈ రచనలన్నీ చిల్లరమల్లరగా కాక ప్రణాళికా బద్ధంగా శ్రీవారి సంపూర్ణ గ్రంథావళిలో భాగాలుగా ఉండే విధంగా పది పదిహేను సంపుటాలుగా ప్రకటించాలంటే లక్షలతో కూడిన పనిగా ఉన్నది. అందుకే ఈ అభ్యర్థనమూ, మా యీ ప్రయత్నమూను. శ్రీ ప్రభాకర పరిశోధక మండలిని వ్యవస్థాబద్ధము చేసినాము. ప్రోత్సహిస్తున్న ఉదారులనుండి ప్రభుత్వ సంస్థల నుండి ప్రాతిపదికద్రవ్యనిధులను సమకూర్చి నేటి నుండి పూనుకొని మరి ఎనిమిదేండ్లలో అనగా 1988లో రానున్న ప్రభాకర శతజయంతి సందర్భానికి వాటిని సంపూర్ణంగా సంకలనపరిచి అనేక శీర్షికల క్రింద పలు సంపుటాలను ప్రకటించాలని ఆశిస్తున్నాము. అట్టి ప్రయత్నంలో శ్రీవారి రచన లన్నిటిని సేకరించి వర్గీకరించి జాగ్రత్తచేసి ఉంచినాము.

ఇంకా లభ్యంకావలసిన మరికొన్ని రచనలకోసం అన్వేషణ జరుపుతూ సేకరించే యత్నం చేస్తున్నాము. పెద్దలను, శ్రీవారి స్నేహితులను, సమకాలికులను సంప్రదించి ముఖాముఖీ చర్చించి అపూర్వమైన విషయాలను టేపురికార్డు చేసి ఉంచినాము. శ్రీ ప్రభాకర పరిశోధక మండలి ఇంతవరకు చేసిన కృషి స్వరూపమును సంగ్రహంగానైనా వెల్లడించడానికి అన్వేషింపగా మాకు గోచరించిన మార్గమే ఈ 'మణిమంజరి' పత్రిక.

ఈ పత్రికా ముఖానచేసే మా ప్రయత్నమంతా పై లక్ష్యసిద్ధిని దృష్టిలో ఉంచుకొనే జరుగుతున్నది. మా ఉద్దేశ్యము మణిమంజరి సంచికలలో శ్రీవారి రచనలన్నీ ముద్రించవలెననిగాని, ముద్రించగలమనిగాని కాదు. సంపూర్ణ గ్రంథావళి సంపుటాలుగా వెలువడే లోగా వాటి రూపురేఖల్ని వాచవిగానైనా ఇందు ప్రదర్శించడమే మా సంకల్పము. ఈ విషయంలో ఉదారులు, సహృదయులు ఇచ్చే చేయూత అన్ని విధాలా మాకు కొండంత బలాన్నిచ్చి మా భవిష్యత్కార్యక్రమానికి మార్గదర్శకం కాగలదని మనవి చేస్తున్నాము.

మణిమంజరి పత్రిక నిట్లా వెలువరించాలని మండలి నిశ్చయించుకొన్నప్పుడు మా సంకల్పాన్ని విని సంతోషించి చప్పున మెప్పులందించినవారూ ఉన్నారు. ఎప్పుడో ఈ పని చేసి ఉండవలసినదని చప్పరించినవారూ ఉన్నారు. తలకు మించిన భారం మీదవేసుకొంటున్నారేమోనని హెచ్చరిక లిచ్చినవారూ ఉన్నారు. అందరూ సదుద్దేశంతో అన్న మాటలే అవి. కాని సత్యం ఆ భావాల కన్నిటికీ మధ్యస్థంగానే ఉన్నది. అందరి అభిప్రాయాలను స్వీకరిస్తూ కర్తవ్య గ్రహణమే మమ్మీ పనికి ప్రేరేపిస్తున్న అంశమని మనవిచేస్తున్నాము.

ఈనాటి కీ తీరున ఇది ఇట్లా జరగడంవెనుకనున్న సంకల్పమూ, దాని నిర్వాహమూ రెండూ కూడా గురుదేవులవే అన్న విశ్వాసము మాకున్నది. కనుక ఇందు మేము నిమిత్త మాత్రులమే.

ఇంతకూ గురుదేవులు చివరిరోజులలో విశ్రాంతి తీసుకొని హైదరాబాదు చేరాలనీ, ఒక పత్రిక నిర్వహించాలనీ గాఢంగా భావించేవారు. "ఎవరైనా పత్రిక నిర్వహిస్తానంటే పాతికేళ్ళ పాటు అగకుండా ప్రకటించడానికి చాలినంత మేటరు ఈ బుర్రలో ఉందిరా. చాలా చెయ్యాలి." అని శిష్యవర్గం ముందు అంటూ ఉండడం మా ఎరుకలోనిదే. అదే వారుండగా జరిగి ఉంటే వాఙ్మయ యోగ విషయాలెన్నెన్నో వ్యక్తమై ఉండేవి.

నేటికైనా వారి యీ సంకల్పమే నిర్వాహము చెందుతున్న దన్నతృప్తి మాకున్నది.

మీకూ అట్టి తృప్తిని కలిగించడమే మా యొక్క లక్ష్యము.

ముందుగానే సంకల్పించినా పత్రికను ఆరంభించడానికి ఢిల్లీ కార్యస్థానం నుండి అనుమతి లభించడంలో జరిగిన జాప్యం కారణంగానూ, అనివార్యమైన ఇతర కారణాలవల్లనూ తొలిసంచిక వెలువడడంలో ఇంచుక ఆలస్యం జరిగింది. క్షంతవ్యులము. ఇకమీది సంచికలు వేళకు వెలువడగలవని మనవి చేస్తున్నాము.

సహృదయులందరి సహకారమును, సూచనలను అర్థిస్తున్నాము.

ఇట్లు
సంపాదకులు

# సంకలన గ్రంథ సంధాతలు: శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

డాక్టర్. పోచిరాజు శేషగిరిరావు.

"శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మూర్తీభవించిన పరిశోధన" అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారు చెప్పిన మాటలు అక్షరాలానిజం. గ్రంథ పరిష్కారమున-సాధు పాఠ నిర్ణయమున, శబ్దార్థ నిర్ణయమున- అపూర్వవిషయము లెత్తిచూపుటలో, అపూర్వ శిల్పాన్వేషణలో, అజ్ఞాత చారిత్రకపూర్వయుగ సమాధులను త్రవ్వించుటలో, మరుగున పడిన శాసనముల వెలికి తీయుటలో శ్రీ వేటూరి వారు చేసినది పరిశోధనే. ప్రాచ్య భాషా విద్వాంసులై శాస్త్రీయ పద్ధతిపై మౌలిక పరిశోధన గావించిన ప్రథమ భాషా పరిశోధకులు. ఇరువదియవ శతాబ్ది తొలిదశకములో కేవల శబ్దార్థ చర్చలు- కర్తృత్వ వివాదములతో భాషా విమర్శ నిండియున్నప్పుడు క్రొత్త కోణమున చూచి దానిని నూతన పథమునకు మళ్ళించిన ప్రగల్భులు. వైయక్తిక ప్రతిభ, స్వతంత్రాలోచన- మౌలిక ప్రజ్ఞ- కారణములు ఉద్బోధకములు కాగా, వారు పరిశోధన క్షేత్రమున ప్రవేశించి- క్రొత్త పంటలను పండించిరి. ఒక్క చేతిమీదుగా కొండంత పరిశోధన చేసినా భాషాసౌధనిర్మాణమున మట్టిముద్దలు మోసినవాడుగానే తమ్ము తాము చెప్పుకొన్న వినయశీలురు శ్రీ శాస్త్రిగారు.

కేవలము నూత్న పరిశోధనలు నిరంతరాయముగా చేయుట అటుండ, భాషా పరిశోధనలకై ఆధారగ్రంథములను (Source Books) ప్రకటింప జేయవలెనని సంకల్పించి, అందు అపూర్వ గ్రంథములు వెలువరించిరి. వారి ప్రజ్ఞ పరిశోధన ప్రవణమగుట హేతువుగా పలు గ్రంథములు వెలువడినవి. అవి అనంతరపరిశోధకులకు క్షేత్రములు పదునుచేసి యుంచినవి. ఆ పొలములే తర్వాత తర్వాత పుష్కలముగా పండినవి. ఆధారగ్రంథములు తాము ప్రకటించుటే కాక, విరివిగా అట్టి వెన్నో వెలువడవలెనను తీవ్రమైన ఆకాంక్ష వారిలో నిబిడమైయుండెను. శ్రీ శాస్త్రిగారికి ముందు తరములో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు-శ్రీ మానవల్లి రామకృష్ణ కవులు వేగుచుక్కలుకాగా శ్రీశాస్త్రిగా రారంగమున ప్రభాకరోదయము గావించి మూల మూలలకు వెలుగువెల్లువలు పారించిరి. ఎన్నో చీకటికోణములలో కాంతి కిరణములు ప్రసరింపజేసిరి.

ఆధారగ్రంథనిర్మాణము కావింపవలెనను శాస్త్రిగారి ఉపజ్ఞామహిత మైనసంకల్పము తామై సంకలనగ్రంథములు కూర్చుటలో- ప్రాచీన సంకలనములను ప్రచురించుటలో స్థిరపడినది. ఎన్నెన్ని సంకలనములు వెలయవలెననీ, వానివలన సాహిత్యాభ్యుదయము చేకూరునని

వారి నిశ్చయము. అందు వారికి కొండంత ఆశ. తొలుత వారి దృష్టి 'ప్రబంధరత్నావళి' అను ప్రాచీన పద్య సంకలనముపై పడినది.

ప్రాచీనములైన రచనములను **సమకాలిక** రచనములను జదివిన ప్రాచీనులే కొందఱు సహృదయు లాయా రచనములలోఁ దమకు నచ్చినవి, తాము మెచ్చినవి-యైనపద్యములను ప్రత్యేకముగా వ్రాసియుంచుకొనినారు. అట్లు వారు సంకలించియుంచుకొన్న పద్య సముచ్చయమునకే సంకలనకావ్యము లేక సంకలన గ్రంథమని పేరు. అన్యుల రచనములలోని రామణీయకమును గుర్తించి గౌరవించుట, మన సహృదయతాపరాకాష్ఠకు పట్టాభిషేకము తొలుదొలుత తెలుఁగు నాటనే జరుగుట వింత. హాల సాతవాహనచక్రవర్తి కమనీయ ప్రాకృత కవితలను పూర్వులవి-సమకాలికులవి యేర్చి 'గాథా సప్తశతి'గా కూర్చినాడు. ఇది రెండువేల యేండ్ల క్రిందటి మాట.

అటుపిమ్మట వేయియేండ్లకు సంస్కృతమున సంకలితమయిన ప్రథమకవితా కదంబము 'కవీంద్ర సముచ్చయము.' అటు పిమ్మట మల్లికార్జునుని సూక్తి సుధార్ణవము (12వ శతాబ్ది), జల్హణుని 'సూక్తి ముక్తావళి' (13వ శతాబ్ది), పట్టం పోతయార్యుని 'ప్రసంగ రత్నావళి' (క్రీ.శ. 1380), వల్లభదేవుని 'సుభాషితావళి' (15వ శతాబ్ది) మున్నగునవి యెన్నియో వెలసినవి.

తెలుఁగున వెలువడిన తొలిసంకలనగ్రంథము కీ॥శ॥ 14వ శతాబ్ది వాడైన మడికి సింగన కూర్చిన 'సకలనీతి సమ్మతము.' ఇది రాజనీతి దృష్టితో తనకు ముందు, తన కాలమునను గల నీతి శాస్త్రగ్రంథములలోని విషయములను సేకరించి సమకూర్చబడినది. అట్టిదే మఱియొక సంకలన కృతి 'ప్రబంధ మణిభూషణము'. శ్రీ ప్రభాకర శాస్త్రిగారి 'ప్రబంధ రత్నావళి'కి ముందు ప్రచురితమైన సంకలన గ్రంథ మిది యొక్కటియే. దానిని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు 1910లో ప్రచురించినారు.

**ప్రబంధరత్నావళి:—**

శ్రీ శాస్త్రిగారు, ఇర్వురు ప్రాచీన కవుల సంకలనములను సంధానించి ప్రబంధరత్నావళి అను పేర 1918లో ప్రచురించిరి. అందొకరు పెదపాటి జగన్నాథకవి, 'ప్రబంధ రత్నాకరము' అను పేర ఐదాశ్వాసములుగా సంధానించెను. అందు తొలిమూడాశ్వాసములు మాత్రమే తంజావూరులోని సరస్వతీ భాండాగారమునం దున్నవి. మిగిలిన రెండాశ్వాసముల గ్రంథము నేటివరకు లభ్యము కాలేదు. రెండవ సంధాతపేరు తెలియదు. సంకలనమునకును పేరు లేదు. దీనినే ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు 'ఉదాహరణ' పద్యములని పేర్కొనినారు. ఈ సంధాత లిర్వురును సమకాలికులు, 16వ శతాబ్దికి చెందినవారు.

ఈ సంకలన గ్రంథ ప్రచురణలో శ్రీ శాస్త్రిగారు ప్రత్యేక శ్రద్ధగై కొనిరి. ప్రసిద్ధములైన నన్నయాదుల పద్యము లిందు చేకొనలేదు. కారణము చర్విత చర్వణమగుటయే. భాషా

1. డా. వేటూరి ఆనందమూర్తిగా రిటీవల దానిని పునర్ముద్రించిరి. (1976)

కవిచరిత్రాద్యపేక్షకులకు సాహాయ్యకారి యగునట్లు చక్కఁ చర్చించి ఆకారాదిక్రమమున ప్రచురించిరి.

ప్రబంధరత్నావళి ప్రచురణ మూలమున భాషా పరిశోధనకు, కవిచరిత్ర పరిశోధనకు క్రొత్త కవాటములు తెరచినట్లయినది. వారి దూరదర్శిత కిది ఒక ఉదాహరణ. భావిభాషా పరిశోధకుల కీసంకలనప్రచురణ మంచి స్ఫూర్తిని కలిగించినది. దీనివలన పలు ప్రయోజనములు చేకూరినవి.

1. కందుకూరి వీరేశలింగంపంతులుగారి కవుల చరిత్ర ప్రథమ భాగమునఁజేరఁదగిన కవు లెందరో దీని మూలమున బయలుపడిరి.

2. కవి జనాశ్రయ మొక్కఁటే, అంతకు ముందు జైన ప్రసక్త గ్రంథముకాగా, ప్రబంధరత్నావళిమూలమున నాచిపురాణము, జినేంద్ర పురాణమునను మరి రెండు కృతులు క్రొత్తగా తెలియవచ్చినవి.

3. ఆధారగ్రంథ ప్రకటన మూలమున అనంతర పరిశోధనలకు దోహదము చేసినట్లయినది.

4. శ్రీ వేటూరి వారి ప్రబంధరత్నావళి ప్రచోదకము కాగా, ఆచార్య యస్వీజోగా రావుగారి ప్రేరణపై వారి శిష్యుడు శ్రీ రావూరి సత్యనారాయణగారు 'విస్మృతాంధ్ర కవిసీరాజనము' అను పేర ఆయా పూర్వాంధ్ర కవులను గురించి యొక వ్యాసపరంపర నేటి కిరువదియేండ్ల నాడు ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధమున వెలయించుట జరిగెను.

5. అధర్వణ భారతమందలి పద్యములు మరి కొన్ని దీని మూలమున లభింపగా, ఆ రచన మెంతవఱకు సాగినదో గుర్తింప ననువుపడెను

6. తాళ్ళపాక అన్నమయ్య వేంకటేశ్వరశతకమందలిపద్య మిందు దొరకినది. తాళ్ళపాకవారి సంకీర్తనపు రేకులతోపా టీశతక మిప్పుడు చేపడినది.

7. రావిపాటి త్రిపురాంతకుని అంబికాశతక, చంద్రతారావళులలోని పద్యము లిందు పేర్కొనబడినవి.

8. ప్రబంధరత్నావళి మూలమున తొలుత వెలుగు చూచిన నాసికేతూపాఖ్యానము పిమ్మట ముద్రణ భాగ్యమందినది (1922).

9. అపూర్వకృతుల యునికి దీని మూలమున తెలియనయ్యెను.

10. 'రంగనాథు'నివిగా పేర్కొనబడిన మూడు పద్యములు చారిత్రికముగా మిక్కిలి విలువగలవి లభించినవి. వీని ఆధారమున శ్రీ శాస్త్రిగారు 'రంగనాథుని శివ కవిత్వము' అను వ్యాసము వ్రాయుటకు వీలైనది.

11. పూర్వకవులచే ప్రశంసలందుకొన్న చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము నందలి కవితా వైశిష్ట్యము తొలుత లోకమున తెలుకపఱుచుటయ్యెను.

12. పలు ప్రాచీనకావ్యముల యునికి తెలియుటతో వాని ప్రచురణకు ప్రోత్సాహ కారకమైనది.

ప్రబంధ రత్నావళి ప్రచురణానంతరము సాగిన గొప్ప పరిశోధనమునకు నిందుదాహ రింపఁబడిన పద్యములే మూలకారణములనక తప్పదని డా॥ టి. కోదండరామయ్యగారు తెల్పినారు.[1] ఇట్లు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు అపూర్వ ప్రాచీనగ్రంథమును ప్రకటించి సాహిత్య పరిశోధనకు దోహదము చేసినవారైనారు.

**చాటుపద్య మణిమంజరి :–**

ప్రాచీన సంకలన కృతులను ప్రచురించుటొక యెత్తు. తామె చెదురుమదురుగా నున్న చాటుపద్యములను సంకలించి ప్రచురించు టింకొక యెత్తు. ఈ తీరగు కృతులలో చాటుపద్య మణిమంజరి మొట్ట మొదటిది. ఆటు తర్వాత దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు 'చాటుపద్యరత్నాకరము' వెలయింపఁజేసిరి. సంకలన ప్రచురణమున శాస్త్రిగారికి మక్కువ ఎక్కువ. ఎన్ని సంవత్సరములైనను దానికై శ్రమింతురు.

"వీనులకు విందై డెందమును దనుపార్చుఁ జాటు రచనము లొక్కొక్క యెడలఁ బ్రబంధ రచనములసయితము మీఱియుండుననుట భాషావేదుల కనుభవపునరుక్తము. పరంపరా గతములగుచుఁ గొన్ని పల్లెటూళ్ళలో ముదుసళ్ళనోళ్ళయందును,మఱికొన్ని పురువులకు భుక్తులు పెట్టు ప్రాచీన తాళపత్ర సంపుటములందును జీర్ణించుచున్నవి. ఇంపారు నిట్టి పద్యముల సంపాదించి గ్రంథరూపమున వెల్వరింపఁ దలంపుగొని యెఱిగిన వారినెల్ల నడిగియు, దొరికిన తాళపత్ర సంపుటముల నెల్ల పరిశీలించియు నానాటఁ గొన్ని చాటువులఁ గూర్చితిని" ఇవి చాటుపద్యమణిమంజరిపీఠికలో (1914) శాస్త్రిగారు వ్రాసిన వాక్యాలు.

శ్రీ శాస్త్రిగారు ప్రకటించే గ్రంథ మేదైనా, సమగ్ర దృష్టితో ఆకళింపు చేసికొని ప్రచురించెదరు. ఆయా చాటు ధారలకు జనశ్రుతిలోనున్న కథాసందర్భములు పొందుపరచుట యొకటి. జనుల నాలుకలే శరణ్యముగా నున్న పద్యములెన్నో సేకరించి ప్రకటించుట మూలమున అవి యుత్సన్నము కాకుండ నిల్చిపోయినవి. ఈ సంకలనము తెలుగువారి చరిత్ర, ఆచార్య వ్యవహారములు– సమస్యా పూరణములు, భాషాచమత్కారములు మున్నగునవి యెన్నియో వెల్లడించుచున్నది. అట్లేజనశ్రుతినుండి జారిపోవనున్న గాధ లెన్నింటినో అక్షర బద్ధ మొనర్చుట నిజమున కొక అనర్ఘమైనవాఙ్మయార్చన. జనశ్రుతికి దానివిలువ దానికున్నది.

మఱల శాస్త్రిగారే చాటుపద్యమణిమంజరి ద్వితీయ సంపుటము- ప్రథమ భాగము వెలువరించిరి. ఇందు దేవతా- కవిప్రశంసా- రాజప్రశంసా స్తబకము లున్నవి. ఇవి

---

1. పరిశోధన–ఫిబ్రవరి, మార్చి 1956-4

తెలుఁగుదేశచరిత్ర కుపకారకములైనవి. ఇందలి 'దామెర వారి వంశావళి' చెన్న పట్టణముతో ఆంధ్రులకు గల సంబంధమును దెలుపు ప్రామాణికరచన.

బిరుదావళులన్నియు నేకత్ర ఇందు కూర్చుటచే పరిశోధకుల కెంతేని యుపకారక ముగానున్నది. బెణ కవిచే చెప్పబడి రాతిబండపై క్రీ॥శ॥ 1621లో చెక్కబడిన పద్యముకూడ చారిత్రక ప్రాధాన్యము కలదే. ఇందేయున్న "దండయాత్రా ఘోషతమ్మట ధ్వనులచే గంతులు సేయించెఁ గప్పకొండ" అను చాటువు ప్రకటించినందులకు రెడ్డిరాజ్య చరిత్రలో శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కైవార మొసంగినారు. 1 ఇట్టి వింకను కలవని వారే యుగ్గడించినారు.

శృంగారరసపరిప్లుతమైన చాటు వొకటి చూడుడు. శ్రీకృష్ణదేవరాయలు ఒకనాడు సభలోని వచ్చిన 'విస్ఫురితఫణామణిద్యుతులఁ బొల్పగు నాగకుమారుఁ డోయనన్' అను సమస్యను ఆంధ్రకవితాపితామహుడు పెద్దనామత్యుఁ డిట్లు పూరించెనట!

వరుఁడు చెఱంగు పట్టినను వల్వ దొలంగిన లేమ సిగ్గు వ
ట్టురుతరరత్నముద్రికల నొప్పెడు డాపలికేల మూయఁగాఁ
గర మమరెం గరంబపుడు కామనిధానముఁ గాచియున్న వి
స్ఫురిత ఫణామణి దుత్యులఁ బొల్పగు నాగకుమారుఁ డోయన్.

(ద్వితీయ భాగము-ద్వితీయ సంపుటము)

శ్రీ శాస్త్రిగారు కూర్చిన యీ సంకలనము అముద్రితము. ఇందు ప్రసిద్ధమహా పురుష స్తబకము, శృంగార- నీతి-సంకీర్ణ స్తబకములే కాక, ఊళ్ళు-నాళ్ళు, గాలి కబుర్లు, సామెతలు- పలుకుబళ్ళు అను విభాగములు కూడ కలవు. అపూర్వశతకపద్యములు- పెక్కు సమస్యాపూరణములు కూడ నిందు చోటు చేసికొన్నవి. సమస్యాపూరణము లొండు రెండు మచ్చునకు.

ఔరా పువ్వారుబోణి కీ యందగత్తె
కేటికిటు సేయ వలసెనో మోటుపనులు?
వశి ప్రయోజకుఁడైన చొప్పడుని యిట్లు
వెధవ నాగన్న కాబోలు వెలఁది మగడు.
వటువైన మేను వహవా!
విటపుంగవ ! వాడి గోళ్ళవిచ్చుల విడిగా

1. Pandit V.Prabhakara Sastri,who has done yoemen service to the Telugu literature, has to be cangratulated for rescuing the valuable verse from oblivion. This verse, which seems to have been composed by Srinadha, narrates Allayya Vema's Conquests, some of which do not find mention anywhere else.— History of Reddi kingdom- page 138.

జిటుకన( బొడిచిన నాటవు
వటబీజములంతలేసి వనితకుచంబుల్.

తంజావూరుపై చెప్పిన చాటువు.

పురమున నుండే కవులే
చొరఁబడి తినఁ గూడ లేక చుంబించంగాఁ
బరకవు లేటికి వచ్చిరి
తర మెఱుగక యరికి విరికిఁ దంజాపురికిన్

చాటుపద్యమణిమంజరీసంకలనము కొంత వినోదము కల్గించుచున్నను, కొన్ని పట్టుల చారిత్రక ప్రాధాన్యము కలిగియున్నది.

**శ్రీవేంకటేశ్వర లఘుకృతులు:-**

శ్రీ వేంకటేశ్వరసంబంధి వాఙ్మయమును సుప్రకటితము చేయుటలో శ్రీప్రభాకరశాస్త్రి గారు వైచుకొన్న పథకము దొడ్డది. తాళ్ళపాకవారి కీర్తనపురేకులు తామై వింగడించి వేర్పరచి వెలికితీసి, అన్నమాచార్య కీర్తనలు 4,5 సంపుటములు పరిష్కరించిరి. అన్నమార్య చరిత్రను విపులపీఠికతో (1949) వెలయింపఁజేసిరి. అట్లే శ్రీవేంకటేశ్వరవచనములు (1945) సుపరిష్కృతముగా ప్రకటించినారు. సుభద్రా కల్యాణము-తాళపాక తిమ్మకరచనము ప్రచురించిరి. అన్నమాచార్యోత్సవ ప్రకల్పనమునకు 1945న వీరే ప్రధానకారకులు. తాళ్ళపాక తిరువేంగళాచార్యుని శృంగారామరుకము (1949)వెలయించిరి. తాళ్ళపాకవారివైష్ణవవాఙ్మయమును వెలువరించుటే కాక శ్రీవేంకటేశ్వరునిపై ఎందరోకవులు రచించిన స్తుత్యాత్మకపద్యములను శ్రీవేంకటేశ్వరలఘుకృతు లనుపేర (1949) ప్రకటించిరి. ఈసంకలన సంధాతలు శ్రీశాస్త్రిగారే. తాళ్ళపాక కవుల సాహిత్య పరిశోధన కిది త్రోవలు చూపినది.[1]

ఈసంకలనమునందలి రచనములలో పందొమ్మిది కృతులు ఇంతకుముం దెవ్వరును ప్రకటింపనివి, ఈసంకలనములోనివి కొన్నింటిని తంజావూరు సరస్వతీ భాండాగారమునుండి, తక్కినవి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునుండి సేకరించుట జరిగినది. గ్రంథ పాతములతో అందదుకులుగానున్న రచన లెన్నింటినో పరిష్కరించి ప్రచురించిరి. ఇందు పెక్కురచనములు ఈసంకలనము మూలముననే లోకము తొలుత తెలిసికొన్నది. విడివిడిగా ఎక్కడెక్కడో పడియున్న పద్యములను పాటలను నేకత్ర సంధానించిరి. సంకలనప్రకటన సమగ్రకృతుల యన్వేషణకు ప్రరోచనయైనది. ఇందు అజ్ఞాత కర్తృకములైన రచనలు 12 వఱకు గలవు. వాచవిగా ఒండు రెండు ఆస్వదింపుడు.

---

1. తాళ్ళపాక కవుల కృతులు—వివిధ సాహితీ ప్రక్రియలు—డా. వేటూరి ఆనందమూర్తి (1974)

నిద్దపు టాస్యరంగమున నిల్పి, ప్రబోధపు గాసె గట్టి, యే
ప్రొద్దును వెంటఁ దంబురను బూనిచి దాత్త్వికనాట్య శాస్త్రపున్
బుద్ధులు సెప్పి నా హృదయ పుత్రిక మీకును మేలు పొడఁగా
దిద్దితి వేంకటాచలపతీ ! కలశాంబుధి కన్యకాపతీ !

కమ్మని తమ్మిదో దుమిని గమ్ముక నమ్మకరాంకుఁ డెమ్మెమై
నిమ్మెయి నిమ్మెయిన్ గదిమియిమ్మెయిఁ గ్రుమ్మె నురమ్ము రమ్ము వే
రమ్ము కరమ్ము నెమ్మది తిరమ్ముగ నమ్మిన నన్ను పెంచి చి
త్తమ్మున నుంచి యేలు నిరతమ్మిక వేంకట శైల నాయకా !

లక్షణోద్ధారము :-

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 1948లో తలపెట్టిన చిట్ట చివరి బృహత్తర సంకలన గ్రంథము లక్షణోద్ధారము. ఇది అసమగ్రము. అముద్రితము. దాని ప్రణాళిక తీఱు తెన్ను లిట్టివి. వాని వివరములు గమనించునది.

1. లక్షణ గ్రంథముల పట్టిక

2. లక్షణ గ్రంథములలో నుదాహృతములైన లక్ష్య లక్షణగ్రంథముల పేళ్ళు. ఆయా గ్రంథముల సంఖ్యలు- 32 పట్టికలు.

3. అన్ని లక్షణ కృతులలో నుదాహృతములైన లక్షణగ్రంథములపట్టిక - పద్యముల సంఖ్య.

4. అన్ని లక్షణగ్రంథములలో ఉదాహృతములైన లక్ష్యగ్రంథములపేళ్ళపట్టిక- పద్య సంఖ్య.

5. లక్షణగ్రంథోదాహరణోద్ధారము.

6. లక్ష్యగ్రంథోదాహరణోద్ధారము.

ఇందీ విషయములు ప్రస్తావింపఁ దలచిరి. వైదిక- సంస్కృత- ప్రాకృత- దాక్షిణాత్య భాషల ఛందస్సు- ఔత్తరాహుల ఛందస్సు- తద్భేదములు-యతిప్రాసములు- దేశిరచనలు- భరతముని బృహద్దేశి- గణములు.

జనాశ్రయ-కర్ణాట ద్రవిడ ఛ్ఛందస్సులు- ద్రవిడయతి మైత్రి- ఆంధ్ర యతిమైత్రి కర్ణాటయతి-తెలుఁగున గల పాటలు, పదములు-యాప్పి రంగలమ్-కవిజనాశ్రయము- పాల్కురికి సోమనాథుఁడు చెప్పిన సూత్రములు.

ఇత్యాదిగా నున్న ప్రణాళికను సాకల్యముగ పరిశీలించినచో లక్ష్య లక్షణగ్రంథ సర్వస్వ మట్లుండుటయే గాక, ఛందశ్శాస్త్ర పరిధి ఏతదభ్యుదయము- వాని అనుశీలనము-

1. దీని వ్రాతప్రతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూటు (తిరుపతి) లో నున్నది. ఈ సంస్థ శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకొక విభాగముగా నున్నది.

సర్వ కవితారీతుల పరిశీలనము నిందు చెప్పఁదలఁచి నట్టున్నది. ఇది ఒక భగీరథకృతి. ఈ సంకలనము పూర్తియై యుండినచో నొక విస్తృతాధార గ్రంథమై పరిశోధకుల కెంతేని ఉపకరించి యుండెడిది. శ్రీ వేటూరి వారి మౌలిక ప్రతిభ కిది పతాక ప్రాయమైనది.

**శాసనసంకలనము:-**

క్రీ.శ. 4వతాబ్దినుండి క్రీ॥శ॥ 12వ శతాబ్దిపర్యంతము గల శాసనసముచ్చయమును సంధానింప నెంచి ఒక సమగ్రప్రతిని తిరుపతిలో నుండగా శ్రీ శాస్త్రిగారు సన్నద్ధము చేసినారు. ఇందు శ్రీతిరుమల రామచంద్రగారి సహకారముదొడ్డది. ఇదియు నముద్రితము. శాసనపరిశోధనలో వారి దీక్ష కిది సాక్షి.

**గాంధి రామాయణము :-**

శ్రీప్రభాకరశాస్త్రిగారు ఇద్దరు మహాపురుషుల వలన ప్రభావితులైనారు. అందు ప్రథములు వారి యోగ గురువులు మాస్టరు సి వి. వి. గారు. రెండవవారు మహాత్మాగాంధీ.

గాంధీ పూర్ణ పురుషావతారుఁడన్నంత ప్రత్యయబుద్ధి శ్రీ శాస్త్రిగారికి కలదు. గాంధీ కఠోరోపవాస దీక్ష 1924లో చేసినపుడు, 1925 మదరాసు వచ్చినపుడు ఇంకను పెక్కుసన్ని వేశములలో వారు మహాత్మునిపై రచనలుసాగించిరి. గాంధీచూపిన దారిలో, తిరుపతిలో హరిజన దేవాలయ ప్రవేశమునకు శ్రీశాస్త్రిగారు నాయకత్వము వహించిరి. బాపూజీ 1944 లో మరల ఉపవాసదీక్ష వహించినపుడు వారుతపించిపోవుట మాయెఱుకలోనిది. 1947లోభారత దేశ విభజన సమయమున నవకాళి, త్రిపుర జిల్లాలలోను పంజాబులోను జరిగిన దారుణ మారణ సంఘటనలు వారిని సమూలము కదిలించి వైచినవి. బాపూజీ మరణించిన పదవరోజున మదరాసు ఆకాశవాణినుండి యిట్లు ప్రసంగించిరి "గాంధీగారి అగ్ని సంస్కారసమయంలో జరిగిన మీటింగులో మాట్లాడబోతే నోరాడలేదు. నాలోనే చితి మండుతూంది. ఇప్పుడే మామాఅజ్ఞానాథ శములన్నీ మంటగలసి పోవునుగాక అని మొత్తుకొన్నాను. ఈశ్లోకం జ్ఞాపకం వచ్చింది.

**'అంతర్నిరింధన సమింధన మేధమానే**
**కస్మింశ్చి దద్భుత మరీచి వికాసభాసే**
**మోహాంధకార పరిపంథిని సంవిదగ్నౌ**
**విశ్వం జుహోమి వసుధాది శివావసానమ్'**

ప్రపంచంలోని మానవులందరూ గంధిగారి శరీరంలోని అణువులు. ప్రపంచములోని దేశాలన్నీ వారి శరీరంలోని అవయవాలు,"

ఈప్రసంగము చేసిన రెండేండ్లకు 1950లో గాంధిరామాయణము సంధానింపవలెనని సంకల్ప మొదవి, ఒక కరపత్రమును విడుదలచేసిరి. అందిట్లుకలదు. "గాంధిమృతివార్త వినునప్పటి కెవరెవ రేమియేమి చేయుచుండిరో, తమ చుట్టుపట్టు లెట్లయ్యెనో – నాటితలపులు లోపలనాటి నేటిదాక నేమి నెఱపు చున్నవో యవి యెల్ల వెల్లడి చేయవలెనని వేడుచున్నాము .... ఇదితర్థాపేక్షారహితమైన యాడిగము"

1. 8-2-1948లో మద్రాసు ఆకాశవాణినుండి చేసిన ప్రసంగము.

**శేషగిరిరావు : సంకలన గ్రంథ సంధాతలు**

ఈ ప్రకటన వెలువడిన పిమ్మట తెలుగునేల నాలుగుచెఱగుల నుండి వారి వారి యనుభూతులు, తామై వ్రాసినవి కోకొల్లలుగా రాసాగినవి. ఈ సేకరణము జరుగుచున్న సంవత్సరములోనే శ్రీ శాస్త్రిగారు పరమపదించుటతో సంకలనము లోకము వెలుగు చూడలేదు. కావుననే యీ విషయము లోకమునకుఁ దెలియఁ దగినంతగా తెలియరాలేదు.

ఒక మహాపురుషుని నిర్యాణముపై జనవాహినిలోని స్పందనలు 'రికార్డు' చేయవలెనను తలపుగాని–యత్నము చేసినవారు గాని తెలుఁగు దేశమున లేరనియే చెప్ప వచ్చును. సంస్మరణ సంచికలు ప్రచురించు నాచారమున్నదిగాని, ఈదృశగ్రంథ సంకలన కృషి–అందును ప్రత్యేకించి అనుభవ విశేషములు యథాతథముగా వెల్లడించుట యనునది జరుగలేదు: ఇదం ప్రథమముగా వారు చేపట్టిన వినూత్నపథకమిది.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వాఙ్మయ పరిశోధనకై శ్రమించుటయే కాదు, పరిశోధకులకు ఆకరములైన ఆధార గ్రంథములు వెలువరించుటలో ఎంతో చొరవ చూపిరి. అనంతర పరిశోధకుల కివి యెంతగనో ఉపకరించు చున్నవనుట ఎల్లరఅనుభవములోనిది. సంకలన గ్రంథ సంధాతగా- ప్రాచీన సంకలన ప్రకటన కర్తగా వారు చేసిన వరివస్య స్తుతిపాత్రమైనది. శ్రీ శాస్త్రిగారిది స్వయంభువమైన ప్రజ్ఞ.



క. సంపదలు జలతరంగము
లింపలరఁగ వచ్చుఁబోవు నిమ్మహిలో మేల్
సంపాదింపఁగ వలెరా
పెంపలరఁగ మహిమలూరి పెమ్మయసింగా!

–చాటు పద్యము.

# కళింగ దేశము-ప్రాచీన గ్రంథములు

-వేటూరి ప్రభాకరశాస్త్రి

[వ్రాతప్రతులుగానే మిగిలిపోయిన గురుదేవుల అముద్రిత రచనల్లో ఈవ్యాసమొకటి. తాళపత్రగ్రంథసముపార్జనకై దేశాటనం సల్పినపుడు వారికెదురైన సంఘటనలన్నీ ఇందు పూసగ్రుచ్చినట్లున్నవి. వ్యాసరచనాకాలం స్పష్టంగా తెలియరాదు. కానిసందర్భాలనుబట్టి వారు కళింగ మండలంలో పర్యటించిన 1918సం॥ ప్రాంతాల్లో ఈవ్యాసాన్ని ఆరంభించి, మరి పదిహేనేండ్ల తరువాత అంటే 1938 ప్రాంతాల్లో తిరిగి కొనసాగించి కొంతవరకు వ్రాసి విడిచినట్లు తోస్తుంది.

కాలగర్భంలో ఇంకా ఎన్నెన్నిచోట్ల ఎన్నెన్ని సంస్థానాల్లో అపూర్వగ్రంథాలిట్లా కానరాక పోయినవో-పోతున్నవో — పోనున్నవో కదా!—సం॥]

కళింగదేశ మనబడు విశాఖపట్టణము, గంజాము మండలములందు దొరతనమువారి యాజ్ఞచొప్పున నేను ప్రాచీన గ్రంథ సంపాదనార్థము పర్యటనము జరిపితిని. అక్కడి విశేషములను సంగ్రహముగా నిందు దెలుపుదును. ఏఁబదియేండ్లకుముందే ప్రాచీనగ్రంథ సంపాదనమున విశాఖపట్టణ మండలము మేలుకొన్నది. మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులయ్యవార్లంగారు మహోద్యమమున ననేకాపూర్వగ్రంథముల నార్జించి "ఆర్షపుస్తక"శాలను నెలకొల్పిరి. ముప్పది యేండ్లకుముందు విజయనగరమునను- తర్వాత విశాఖపట్టణమున బ్రహ్మశ్రీ నిడదవోలు సుందరం పంతులుగారు అనేకప్రాచీనాంధ్ర గ్రంథములను సంపాదించి యొక లైబ్రరీని నెలకొల్పిరి. ఈఇర్వుర జాగ్రత్త దేశమున కత్యంతోపకారకములైనవి. ఆర్షపుస్తకశాల విశాఖపట్టణమున నిపుడును సురక్షితముగా కలదు.

సుందరం పంతులుగారి పుస్తకములలో ముఖ్యమైన వానిని నేను పరిశీలించితిని. వానిని దొరతనము వారు కొనిరి. సుందరంపంతులుగారు వ్యయప్రయాసములకు పాల్పడి సంపాదించిన గ్రంథములు పెక్కులు, అన్యత్ర ముద్రితము లగుచుండుటచేతను, శిథిలము లగుచుండుటచేతను, వారి పరిశ్రమార్జన ప్రయోజనమును గుర్తించి యాదరించు వారు లేకపోవుట చేతను, వానిని విక్రయించుటే కర్తవ్య మయ్యెను. ఆయా గ్రంథములు దొరతనము వారి ట్రైనియల్ కేటలాగులలో వర్ణితములై వెల్లడి యయినవి. గంజాం విశాఖపట్టణమండలములు పెక్కు రాజ్యస్థానములుగలవగుటచేతను, ఎండ లంతతీవ్రతరములు కాకపోవుట చేతను, నక్కడ ప్రాచీనగ్రంథముల నిలువర మెక్కువగానే కలదు. విశాఖపట్టణమున అంకితం జగ్గారాయలవారు కొన్నివేలువెచ్చించి మంత్రశాస్త్రమున దుర్లభములైన గ్రంథముల నెన్నింటినో సేకరించిరి. వారి యనంతర మవియెల్ల నేమయ్యెనో యెఱుగరాదు. వానిలో కాళిదాసుని చిద్గగనచంద్రిక, శుభాగమపంచకములోనిదగు సనత్కుమారసంహిత మొదలగు దుర్లభ గ్రంథములు కలవు. సౌందర్యలహరీ వ్యాఖ్యలో లొల్లలక్ష్మీధరపండితుఁడు శాక్తుల వామాచారమును గర్హిం

చుచు దక్షిణాచారప్రతిపాదకములైన తంత్రము లయిదు గల వనియు వానికి శుభాగమపంచక మని పేరనియుఁ బేర్కొనెను. సనత్కుమారసంహిత యందొక్కటి. ఈ సంహితను బరంపురములో శ్రీపాదవారి యింటఁ గూడ నేఁజూచితిని. ఇంతవఱకీ గ్రంథము ప్రసిద్ధగ్రంథాలయములకుఁ జేరలేదు. విశాఖపట్టణమున గోదేవారిపుస్తకశాలలోగూడ విలువగల వ్రాతగ్రంథములు, ముద్రితగ్రంథములు గలవు. వ్రాతగ్రంథములలోఁ గొన్నియపూర్వగ్రంథ ములకు ప్రాచ్య లిఖితపుస్తకశాలవారు ప్రత్యంతర ములఁ గైకొనిరి. ఎలమంచిలికిఁ జేరువగానున్న పంచ ధార లనుపుణ్యక్షేత్రము దర్శనీయము అక్కడ పూర్వము చాళుక్య విశ్వేశ్వరభూపాలుడు రాజ్యమేలి ధర్మేశ్వరస్వామికి కల్యాణ మంటపాదులఁ గట్టిం చెను. కావ్యాలంకారచూడామణికృతిపతి ఈతఁడే. విన్నకోట పెద్దన కవి ఈతని ఆస్థానమున నున్న వాడు. కొందరీ విశ్వేశ్వరుని, పెద్దన్నను, తిక్కన్న కంటెఁ బూర్వులనుగాఁ దలఁతురు. ఎఱ్ఱాప్రెగ్గడ కంటెఁ బూర్వులని యెల్లరును దలఁచు చున్నారు. చూడామణిలోని 'చతురుపాయే'త్యాది పద్యముల వల్లను పంచధారలలో గల శాసనముల వలనను వారు క్రీస్తు. 1410 ప్రాంతముల నున్నవారుగా నెఱుఁగ వత్తురు.

శ్లో. శాకాబ్దేనవబాహురామశశిసం
ఖ్యాతే శుచౌభాసితే
సప్తమ్యాం మినవారభాజి మహిత
స్సంస్థాపితో మణ్డపః
కల్యాణోత్సవ సిద్ధ యే సవిభవ
శ్శ్రీపంచధారాపురీ
ధర్మేశాయ చళుక్య విశ్వ ధరణీ
భర్త్రావిచి త్రాస్పదమ్
—పంచధారా శాసనము.

ఆగ్రామమునఁ గొన్ని ప్రాచీన గ్రంథములుకలవు. అపూర్వము లంతగా లేవు. ఉన్నవానిని గూడ నాయింటివారు ఇయ్య నొల్లరైరి. ఎలమంచిలిలో వైఖా నసులయొద్ద నమూల్యములైన వైఖానసాగమ, వైఖానస శ్రౌత గృహ్య సూత్రాదుల మీది గ్రంథ ములు గలవు. వారి బంధువులు విశాఖపట్టణమునఁ గూడఁ గలరు. వారి యొద్దఁ గూడ ననేక గ్రంథములు గలవు. విశాఖపట్టణమునఁ గల గ్రంథములు ప్రాచ్య లిఖితపుస్తకశాలకుఁ జేరినవి గాని, ఎలమంచిలి గ్రంథములు అపరిశీలితము లయి, అక్కడనే యున్నవి. విజయనగరమున నెన్నో యపూర్వ గ్రంథములు పలువురయొద్ద దొరకినవి.ఇంకఁ గొందఱ యొద్దఁ గొన్ని గ్రంథములు గలవు. అవి దుర్లభము లయ్యెను. మహారాజాస్థానమున నసాధారణ గ్రంథము లంతగా లేవు. ఉన్నవి ప్రాచ్య లిఖిత పుస్తకాలయము వారు ప్రతులు వ్రాయించుకొనిరి.

విజయనగరమునకు దగ్గర బూరడపేటలో పిడ పర్తివారి యింట ననేకగ్రంథము లున్నవి. బొబ్బిలి సంస్థానమునను తత్సంస్థాన విద్వాంసులగు కొటికల పూఁడివారియిండ్లలోను విలువగలగ్రంథములు పెక్కులు గలవు. కొటికలపూఁడివా రాంధ్రదేశమున కెల్ల సత్కీర్తి నించిన ఘన విద్వాంసులు. కవిత్వము నను, జ్యోతిషమునను వారు సునిపుణులు. కోదండ రామ సిద్ధాంతిగారు సూర్యసిద్ధాంతమునకును, ఆర్య భట సిద్ధాంతమునకును తెలుగు వివరణోదాహరణము లతో విపులమైనవ్యాఖ్యల రచించిరి. మఱియుసంస్కృ తాంధ్రములం దనేకగ్రంథముల రచించిరి. మనుస్మృ తిని, యాజ్ఞవల్క్యస్మృతిని, విజ్ఞానేశ్వరీయమును తెలుగు పద్య కృతులఁగా రచియించిరి. ఇంకనెన్నో యుత్కృష్ట గ్రంథముల రచించిరి.' వానికెల్ల ప్రాచ్య లిఖిత పుస్తకశాల వారిచే ప్రత్యంతరములు గొనఁబడి నవి. బొబ్బిలి సంస్థానమునఁ గల యపూర్వగ్రంథ ముల కెల్లనుఁ గూడ ప్రత్యంతరములను ప్రాచ్య లిఖిత

పుస్తకశాలవారు గొనిరి. బొబ్బిలిసంస్థానవిద్వాంసులై మండపాక పార్వతీశ్వర కవిగారు సుప్రఖ్యాతి వహించిరి. వారి పూర్వులును కొన్నిగ్రంథముల రచించిరటగాని వారి గ్రంథ మొక్కటికూడ బొబ్బిలి మహారాజుగారి లైబ్రిరీలో లేదు. పార్వతీశ్వర కవిగారి మనుమలగు నభినవపార్వతీశ్వరకవిగారి యొద్ద వారి ప్రాచీనగ్రంథములెల్ల సురక్షితములై గలవట. వారి నొకతూరి బొబ్బిలిలో దర్శించితిని. వారి గ్రంథములు బయల్పడవలెను. బొబ్బిలి చుట్టుపట్టులగల యగ్రహారములలో పెక్కు గ్రంథము లున్నవి. పూర్వముసోమసుందరముపంతులుగారక్కడి గ్రంథముల కొన్నింటిని సేకరించిరి. ఇంకను పెక్కులుండ వచ్చును. నందబలగ యనుగ్రామమున గొన్ని గ్రంథములు దొరకెను. ఆ గ్రామముననే యింకను కొందఱిండ్లలోఁ బెక్కుగ్రంథము లుండెను కాని వారు వానినొసగ నొల్లరయిరి. నందబలగకు మిక్కిలి చేరువనే కుసుమూ రనుగ్రామము కలదు. అక్కడ గ్రంథము లున్నవేమో యని కనుఁగొనఁ బోయితిమి. దొరకలేదు. మధ్యాహ్నము 1 గంటకు అటనుండి తిరిగి నందబలగకు వచ్చుచుండఁగా ఆకస్మికముగా కారు క్రమ్మి, జడివాన, కుంభవృష్టి, నిమ్మపండ్లంతటి వడగండ్లతో కొట్టి కొట్టి కురిసెను. మేము ప్రాణ సంశయ స్థితికి వచ్చితిమి. వడగండ్ల దెబ్బలకు నిబ్బరించుకోజాల మైతిమి. గొడుగులు చెడెను. తల గుడ్డలు కోట్లు నాడు మమ్ము రక్షించెను. ఒక్క గంటలో వాన వెలిసెను. బ్రతికి బయటపడితిమి సాలూరులోఁ గొన్ని గ్రంథములు గలవు. అవి మాకు దొరకలేదు.

అక్కడ మేము పరిశీలించి విలువగల వానినిగా గుర్తించిన గ్రంథములను (కవిరాయని వీరభద్రకవి కృతములు ఆయన సేకరములు అని స్మరించుచున్నాను) బరంపురము కాలేజీలో పండితులుగా నున్న నేమాన నరసింహశాస్త్రిగారు ప్రత్యంతరములు వ్రాసికొనుట కీయ నంగీకరింపనీయక తాము కొంపోయిరి. వారు వానిని సురక్షిత పఱిచి యుందురు. పాచి పెంట యను గ్రామమున రాజాగారి దగ్గర 'శశిబిందు చరిత్ర' యను గ్రంథము గలదని విని వెళ్ళి ఎంతో శ్రమతో నక్కడి వారి దర్శించి విచారించితిని. అప్పుడా రాజుగారు, గంజాము మండలమున గల "చీకటి" సంస్థానమునసుండిరనియు, నా గ్రంథములు వారి యొద్దనేగలవనియు నక్కడి తద్బంధువులు చెప్పిరి.

"శశిబిందుచరిత్ర" ప్రాచీనము. లక్షణ గ్రంథములం దుదాహృతము. ప్రయోగరత్నాకరోదాహృతులను బట్టి, తత్కర్త చఱిగొండ నృసింహ కవియని తెలియనగును. అప్పకవీయమున "వెలగకు వెల్గ యంచు సరవిం జఱిగొండ నృసింహుఁడాడఁగా— మొలకకు మొల్కయంచుఁ గవి ముఖ్యుఁడు భద్రయ పల్క దోసమా" ఇత్యాది పద్యమున జఱిగొండ నృసింహుఁడు పేర్కొనఁబడెను. నిజముగా నా గ్రంథమక్కడ కలదేమో! బయల్పడుట బాగు. పార్వతీపురమున రసికకవిరత్నమగు ఆచంట సాంఖ్యాయన శర్మగారితో సరససల్లాప సౌభాగ్యము మాకు లభించెను. అక్కడ పంతుల బ్రహ్మదేవకవి కృతులు మాకు దొరకెను. అక్కడికిఁ జేరువనేకల సంగమవలస సంస్థానము ఖండాంతరములందుఁ గూడ వైదుష్య ప్రఖ్యాతి గడించినది. పూర్వము బొబ్బిలి మహారాజుగారు ఇంగ్లండుకుఁ బోయి విక్టోరియా మహారాజ్ఞిని దర్శించినప్పుడు సంగమవలససంస్థాన ప్రభువగు మృత్యుంజయ నిశ్శంకబహద్దరుగారి ప్రశంస జరిగెనట. బొబ్బిలికంటె మిక్కిలి చిన్న సంస్థానమైనను తత్సంస్థానాధిపతులగు మృత్యుంజయ నిశ్శంక బహద్దరుగారు శ్రీ పరవస్తు రంగాచార్యుల వారి యొద్ద విద్య నభ్యసించి కాళిదాస నాటకములకు వ్యాఖ్యల రచించిరి. అవి కొన్ని ముద్రితములయ్యెను. వాని కీర్తి ఖండాంతరములకు వ్యాపించెను.

మాక్సు ముల్లరు మొదలగు వారి మూలమున నది విక్టోరియారాజ్ఞి యెఱుక కెక్కెను.[1] "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్" అన్న సూక్తి యుక్తమేకదా! [ఇంతవరకు 15ఏండ్లక్రింద వ్రాసినది. ఇకమీది దిప్పుడు వ్రాసినది - వే. ప్ర.]

మాడుగులలో రాజాస్థానమప్పుడుకోర్టాఫ్ వార్డ్సువారి స్వాధీనమం దుండెను. అక్కడ వేయింటికిఁ బయిగా తాటియాకుపుస్తకములను ఆకారమాత్రము జూచితిమి అప్పుడు తదధినేత్రి రాణి గారి పర్మిషను లేక వానిఁ జూడఁ గుదురదయ్యెను. ఇటీవల నా సంస్థానము శ్రీ జయపురం మహారాజావారి వశ మయినది. శ్రీ విక్రమదేవవర్మ మహారాజా వారి నిటీవల దర్శించి తెలిసికొనగా నక్కడ గ్రంథము లేవియు నిప్పుడు లేవనియు, నప్పటి వేమయ్యెనో యెఱుఁగరా దనియు చెప్పిరి. విజయనగరము సంస్కృత కళాశాలలో సాహిత్యాచార్యులుగా నున్న శ్రీ పరవస్తు గోవిందాచార్యులుగారు తమ యగ్రహారమగు దేవాడలో చాలా గ్రంథము లున్నవని చెప్పగావారితో నక్కడి కరిగితిని. నేనక్కడికి సకుంటుంబముగా చేరి బసచేసిన యింటి కెదురింట మేము వంటచేసికొని భోజనముచేసి బయటకి వచ్చునంతలో కలరా వల్ల నొకరు చనిపోయిరి. మరికొన్ని గంటలలో మరొకరు చనిపోయిరి. ఈ అలజడి వల్ల ఊరిలోని గ్రంథము లెల్ల చూడ గుదురలేదు. శ్రీ గోవిందాచార్యులు గారి యింట మంచి గ్రంథములు పెక్కులు దొరకినవి. ఆరాత్రి 10 గంటలకే అక్కడినుండి సకుటుంబముగా బయలు దేరి సర్వావస్థలు పడి మర్నాడు పదకొండు గంటలకు లక్కవరంకోట చేరితిమి. కలరాగ్రామమునుండి వచ్చుట చేతను గాబోలును మా కాయూర నిలువ నీడ దొరకలేదు........

1 ఇట్టిగ్రంథాలలో మృత్యుంజయ నిశ్శంకబహద్దరువారు ప్రకటించిన విక్రమోర్వశీయవ్యాఖ్య ఒకటి.

మృత్యుంజయ భూపాలీయమున ముఖపత్ర మిట్లున్నది.

శ్రీరస్తు

శ్రీమత్కవికుల చూడామణినా శ్రీకాళిదాస మహాకవినా విరచితం

విక్రమోర్వశీయ నామకం నాటకమ్

అతిసఙ్కుచిత ప్రాచీన వ్యాఖ్యాన సంక్లేశిత మానసానాం

సంస్కృత భాషాభిలాషుక జనానామత్యన్తోపయోగాయ

నిఖిలజగజ్జేగీయమానసకల విద్యానవద్య పణ్డిత జనాదరణ శీలేన

చన్నపురీ రాజ్య స్థితాలోచన పరిషత్సభాస్తారేణ సర్వవిద్యా ప్రవీణ శ్రీమదానరేబిల్

డేవిడ్ ఫ్రిమాంటిల్ కార్న్మికి లభిధాన విరాజమానాధికార్యగ్రగణ్యే నానుజ్ఞాత

వైశాఖపట్టణ మణ్డల మణ్డనా యమాన సఙ్గమ వలస రాజధాన్యధినాథ

శ్రీమత్

మృత్యుఞ్జయ నిశ్శఙ్కభూపాల విరచితయా

విద్వచ్ఛిరోమణిభిరాత్మీయ విద్యాగురుభిశ్శ్రీమత్పరవస్తు

వేంకటరఙ్గాచార్యవరేణ్యైః, స్వాస్థాన పణ్డితాగ్రగణ్యాన్ధ్ర గీర్వాణవైయాకరణ

శ్రీమదాకెళ్ల వేంకటశాస్త్రిణాచ, సమ్యక్పరిశీలితా మోదితయా

మృత్యుఞ్జయ భూపాలీయ ద్వితీయాభిధాన

విశిష్టరత్నదీపికాఖ్య ప్రతిపదవ్యాఖ్యయాసమం సంయోజ్య

చన్నపురీస్థిత- వర్తమానతరఙ్గిణీముద్రాక్షరశాలాయామ్

సమ్ముద్రితం సదాచన్ద్రతారార్కం విజేజీయతామ్

శాలివాహన శకే గతాబ్దాః-1806

శ్రీమత్స్వభాను నామసంవత్సర మార్గశిర శు॥ద్వితీయా

# నేను మా చిన్నన్నయ్య

డా. వేటూరి చంద్రశేఖరశాస్త్రి

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు మా రెండవ అన్నగారు. ఆయనను, మేము-అనగా ఆయన తరువాత పుట్టిన సోదరులము-చిన్నన్నయ్య అని పిలుస్తూ ఉండేవాళ్లం. మా చిన్నన్నయ్యను గూర్చిన నా ఎఱుక ఎప్పటి నుండో నేనిప్పుడు స్పష్టంగా చెప్పలేను. పసితనం నుండి ఆయనను పరిపాటిగా చూస్తూ ఉండడమే దానికి కారణం. మా అమ్మను నాన్నను గూర్చి నా ఎఱుక ఎప్పటి నుండి ప్రారంభమో నేనిప్పుడు స్పష్టంగా చెప్పలేనట్లే ఆయననుగూర్చికూడ చెప్పలేనన్నమాట.

ఆయన బందరులో శ్రీ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రి గారి దగ్గర చదువుకొనేరోజులు నాకు కొద్దిగా జ్ఞాపకం. ఆయన ఆ రోజులలో మా స్వగ్రామం పెదకళ్ళేపల్లికి బందరునుండి వస్తూ మా నాయనగారి యెడల భయ భక్తులతో మెలగుతూ సాధ్యమైనంత వరకు ఆయన ఎదుటపడకుండా ఇంటిలో మెలగుతూ వుండేవాడు.

చిన్నప్పటినుండి మా అన్నగారిది జాలిగుండె. బిచ్చగాండ్రెవరైనా వాకిటి ముందుకు వస్తే వాళ్ళ పేదరికాన్ని చూచి పెరపెరలాడేవాడు—వాళ్ళను ఆపి ఎంత పని మీద ఉన్నాసరే మా అమ్మనో అక్కయ్యనో వేధించి అంతో ఇంతో ఇంటిలో మిగిలిన తినుబండారమును వాళ్ల ఒడిలో వేయించేవాడు-దీనులను, రోగంతో బాధపడే వాళ్లను చూచిఆయన చాల బాధపడేవాడు. ఒకనాడు మా దొడ్డిలో ఆవు ప్రసవ వేదన పడుతూఉండగా చూడలేక ఊరిలో నున్న గోపాలస్వామి గుడికి పోయి అక్కడ కాలక్షేపంచేసి ఈనినట్లు విన్నతరువాత రావడం నాకు జ్ఞాపకం. మా యూరికి సమీపమందున్న విశ్వనాథపల్లి గ్రామంలో ప్రతి సంవత్సరం నాంచారమ్మ గుడి ముందు జంతుబలి జరుగుతూ ఉండేది. ఆయూరి మార్గమైన మా వీధిలో నుండి బలి ఇవ్వడానికి పశువులను బలవంతంగా తీసికొని పోతూ ఉండడం కంట బడ్డప్పుడల్లా ఆయనఒడలు కంపించి జలదరించేది-బాధపడేవాడు.

వెంకటశాస్త్రిగారి వద్ద విద్యాభ్యాసం ముగించిన తరువాత అప్పుడు మద్రాసులో నున్న మా బావగారి సలహా మీద మాచిన్నన్నగారు మద్రాసు చేరడం, ట్రిప్లికేన్‌లో నున్న అప్పటి వెస్లెయన్ మిషన్ హైస్కూలులో ఆంధ్రాధ్యాపకుడుగా కొంతకాలం పనిచేయడం నాకు జ్ఞాపకమే. అది 1910, 11 ప్రాంతాలలో అనుకొంటాను. ఒకటి రెండు సంవత్సరాల తరువాత ఆ పాఠశాలలో ఉద్యోగం చాలించి ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో ఉద్యోగానికి ప్రవేశించే ముందు ఆ స్కూలు విద్యార్థులు వీడ్కోలుసభచేసి ఆయన కొక ఫౌన్‌టెన్ కలమును బహూకరించడం జరిగింది. ఆసంగతి ఆయన ఇంటికి జాబువ్రాయడం, ఆ జాబును చదివి మా తలిదండ్రులు కుటుంబము ఆనందించడం ఇప్పుడు నా కండ్లకు కట్టినట్లున్నది.

ఆ రోజులలో నేను, మా తమ్ముడు శంకరం మా యూరిలో ప్రైమరీ స్కూలులో చదువు పూర్తి చేసికొని కొన్నాళ్ళు ఇంటి వద్దనే ఉండడం జరిగింది. దాదాపు ఒక సంవత్సరం అట్లు గడచిన తరువాత పూజ్యులు మా పెద్దన్నగారు శ్రీ వెంకట శివశాస్త్రిగారు

మా యూరికి ఆరుమైళ్ల దూరమందున్న అవనిగడ్డలో పోష్టుమాస్టరుగా నియమితులైరి. దాదాపు రెండు సంవత్సరములు మేమాయన వద్ద నుండి కొంత సంస్కృతము ఇంగ్లీషు ఆయన యొద్ద అభ్యసించినాము. మా పెద్దన్నగారు సంస్కృతంలో మంచి పండితులు. ఇంగ్లీషులో కూడ ఆయనకు గొప్ప ప్రవేశం ఉండేది. ఆసాధారణ బోధనా కౌశలం ఉండేది. ఆయన యొద్ద మేము అమరకోశం, శబ్దమంజరి, రఘువంశంలోను కుమారసంభవంలోను కొన్ని సర్గలు భోజచంపువులోను భర్తృహరిలోను కొన్ని భాగాలు, ఏనుగు లక్ష్మణకవి తెలుగు పద్యాలు శ్రద్ధతో అభ్యసించినాము. అప్పుడప్పుడు కొన్ని సంస్కృత చాటువులు కూడ మాకు వినిపిస్తూ మాలో సాహిత్యాభిలాషనుపురిగొల్పేవారు. అప్పుడాయన మాలో వేసినసుస్థిరమైన పునాదులు తరువాత మా భాషాజ్ఞానం వృద్ధిచేసికొనుటలోఎంతగానో ఉపకరించినవి.

మేము ప్రైమరీ స్కూలు చదువు పూర్తి చేసుకొని మా గ్రామంలో తల్లి దండ్రుల వద్ద ఉన్నరోజులలో మాచిన్నన్న గారు మద్రాసు నుండి మా చదువును గూర్చి ఆందోళన వెలిబుచ్చుచూ జాబులు వ్రాస్తూఉండేవారు. తరువాత కొన్నినాళ్లకు మా చిన్నవదినగారు కాపురానికి రావడం ఆమెను మాఅన్నగారు మద్రాసు కాపురానికి తీసుకొని వెళ్లేటప్పుడు ఆమెతో నన్ను మాతమ్ముడు శంకరాన్ని చదువు కొరకు తీసుకొని వెళ్ళడం జరిగింది. అది 1914 ప్రాంతం అనుకొంటాను— అప్పుడు మాబావగారు కాజవెంకట శేషయ్యగారు అక్కగారు ట్రిప్లికేన్‌లో హనుమంతలాలా వీధిలో 16వ నెంబరు ఇంటిలో ఉండేవారు. ఆయింటిలోనే ఒక భాగంలో మేముకూడ ఉండే వాళ్ళం- నన్ను మా అన్నగారు లోగడ తాను అధ్యాపకుడుగా పని చేసిన కెల్లెట్ హైస్కూలులోనే ప్రవేశ పెట్టినారు ఆయన పరిచయాన్ని బట్టి అప్పుడాస్కూలుకు ప్రిన్సిపాలుగా ఉన్న రెవరెండు డి జియమ్ లీత్‌దొర నావద్ద సగం జీతమే పుచ్చుకొనుటకు అంగీకరించినాడు. ఆ స్కూలులో నేను చివరవరకు చదివి 1920లో స్కూలు ఫైనలు పరీక్ష ప్యాసైనాను. మా పెద్దన్నగారి వల్ల కలిగినభాషాప్రవేశంవల్ల ఇంగ్లీషు తెలుగు సంస్కృతం మొదలగు వానిలో నాకు బాగా మార్కులు వచ్చేవి. కొన్ని బహుమతులు కూడ సంపాదించకలిగినాను. స్కూలులో నాఅభివృద్ధిని గూర్చి ఉపాధ్యాయులవల్ల తెలిసికొని మాఅన్నగారు ఎంతో సంతోషాన్ని తృప్తిని వెలిబుచ్చేవారు.

తరువాత కొంత కాలానికి ట్రిప్లికేనులోనే సాతాని వీధిలో (తులసింగ పెరుమాళ్ కోవెలవీధి) మరియెక ఇంటికి మారితిమి. ఆయింటిలో ఇంకొక భాగంలో చింతగుంట రాఘవ రావుగారు (అప్పుడు లా కాలేజి విద్యార్థి) కూడ ఉండేవారు. గురజాడ అప్పారావుగారు మద్రాసుకు అప్పుడప్పుడు వస్తూ మౌంటు రోడ్డులో టాకర్ అండ్ సన్సులో మకాంపెడుతూ అప్పుడప్పుడు మాఅన్నగారి కొరకు మాఇంటికి వస్తూ ఉండేవారు. మాఅన్నగారు కూడ ఆయన మద్రాసులో ఉండే రోజులలో తరచుగాఆయనను కలిసికోడానకి వెడుతూ ఉండేవారు. ఇద్దరు కలిసి అప్పుడప్పుడు మౌంటు రోడ్డులో ఉండిన గెయిటీథియేటరుకు (అప్పుడు సైలెంటు పిక్చర్స్) వెళ్ళికొన్ని పరిశోధక చిత్రాలను చూస్తూ ఉండేవారు. రెంటాల వెంకటసుబ్బారావుగారు, మద్రాసు వచ్చినప్పుడు కొమర్రాజు లక్ష్మణరావుగారు అప్పుడప్పుడు వస్తూఉండడం మాఅన్నగారు వారి దగ్గరకు పోతూ ఉండడం జరుగుతూ ఉండేది. అప్పుడా వీధిలోనే నివసిస్తూ ఉండిన వేపా రామేశం పంతులుగారింటికి మా అన్న గారు తరచుగా వెళ్ళుతూ ఉండేవారు.

ఆ రోజులలోనే చాటు పద్య మణిమంజరి, కనకాభిషేకం, కామధేనువుకథ, భాస నాటకాల తెనుగు అనువాదం మొదలగు గ్రంథాలు ప్రకటించడం జరిగింది. అప్పుడు చాటుపద్యమణిమంజరికి మంచి సేలు ఉం

డేది. రోజుకి సామాన్యంగా 10, 15 ఆర్డర్లు వచ్చేవి. మా తమ్ముడు, నేను, తీరిక చిక్కినప్పుడు మా వదిన గారు ఆ పుస్తకాలను పాక్ చేసే వాళ్లం. వాటి మీద నేను అడ్రసులు వ్రాసి వి. పి. మనియార్డరు ఫారాలను నింపే వాడను. నేనో మా తమ్ముడో స్కూలుకు పోయే త్రోవలో ప్రక్కగా నున్న బిగ్ స్ట్రీటులో పార్థసారధికోయిల్ పోష్టాఫీసులో ఆ పాకెట్లు మీద చీట్లంటించి పోస్టాఫీసులో ఇచ్చేవాళ్లం. వి.పి.మనియార్డర్ల సొమ్మును నేను తీసికొని లెఖ వ్రాసి ఆ సొమ్మును మా వదినగారికి ఇస్తూఉండే వాడను.

ఇప్పటి రోజులనుపట్టి చూస్తే అప్పటి మాఅన్నగారి వేతనం చాల స్వల్పం అయినా ఏ లోపం లేకుండా జీవనం సుఖంగాను తృప్తిగాను గడిచేది. నాగేశ్వర రావుగారి 'ఆంధ్ర పత్రిక' పంతులుగారు జీవించి యున్నంత కాలం ప్రతిరోజు సాయంకాలానికి ఉచితంగా ఇంటికి చందా చెల్లించనక్కర లేకుండా వచ్చేది. పత్రికరాగానే ఏ పది పదిహేను నిమిషాలో తప్పకుండా ఆ పత్రికను ప్రతిరోజు చదివేవార్లు. మొదటి ప్రపంచ యుద్ధపురోజులవి-యుద్ధవార్తలను జాగ్రతగా తెలిసికొంటూ జరుగుతున్న మారణహోమాన్ని గూర్చి వ్యధ చెందుతూ ఉండడం జరుగుతూ ఉండేది. మేము తులసింగ పెరుమాళ్ళవీథిలో ఉన్నరోజులలోనే ఎండెన్ జలాంతర్గామి మద్రాసుమీద బాంబులువేసినది.

మా వదినగారు వయస్సులో నాకంటె ఒకటి రెండు సంవత్సరాలు పెద్ద– ఆమె గొప్ప విధానం ఓర్మి గల ఇల్లాలు–చిరునవ్వు ఆమె ముఖాన చిందులాడుతూ ఉండేది. గృహ నిర్వహణలో ఆమెది అందె వేసిన చేయి. ఎట్టి పరిస్థితులలోనైనా ఆమె చికాకుగాని తొట్రుపాటుగాని లేకనే చేసినట్లు కనబడకుండా ఆమె ఇంటి పనులను సక్రమంగా సమర్థతతో సర్దుకు పోయేది. మా కంటె వయస్సులో ఎక్కువ పెద్ద కాకపోయినా ఆమె మా తమ్ముని నన్ను తన బిడ్డలనో తమ్ములనో చూచినట్లు ఆదరముతోనువాత్సల్యముతోను కనిపెట్టేది. మేము మా విద్యార్థిదశను 10,12 సంవత్సరాలు మద్రాసులో మాచిన్నన్నగారి వద్దనే గడిపినాము. ఆ సుదీర్ఘకాలంలో మా చిన్నతనపు చిలిపిచేష్టలను సాధ్యమైనంతవరకు సహించి మితిమీరినప్పుడెప్పుడైనా తగినట్లు మా అన్నగారికి చెప్పి మందలించి మా ప్రవర్తనను సరిదిద్ద చూచేదేగాని అపకారబుద్ధితో ఎన్నడు కొండెములు చెప్పి ఎరుగదు. ఆమె అత్తమామలవల్లను భర్తవల్లను అతిథ్యభ్యాగతులవల్లను ఎన్నికగన్న మహాసాధ్వి. ఆమె స్మృతికి నా భక్తి భరితమగుకేల్మోడ్పులు.

నేను మా తమ్ముడు శంకరశాస్త్రి వివాహాలు అయిన తరువాత కూడ భార్యలతో కొంతకాలం మా అన్నగారివద్దనే ఉండి విద్యాభ్యాసం చేసినాము. ఆ రోజులలో ఆ పుణ్యదంపతులు మా యెడల చూపిన ఆదరాభిమానాలు వాత్సల్యము మరపురానివి. మేమా ఆదర్శదంపతుల కెంతగానో ఋణపడి యున్నాము.

మా అన్నగారు సునిశితమేధాసంపన్నుడు. ఆవలిస్తే పేగులు లెఖపెట్టగల సూక్ష్మదృష్టి ఆయనది. వ్యక్తుల ముఖకవళికలనుబట్టి వారి కోరికలను కనిపెట్టేవాడు. సామాన్య దృష్టికందని కొన్ని వస్తువుల సౌందర్యవిశేషములను గుర్తించి చూపి వానిప్రాశస్త్యమును వర్ణించుటలో ఆయన మేటి. రకరకముల పూలు, పండ్లు, కాయలు, ఆకులు గురించి ఆయనకు తెలిసినంతగాసామాన్యులకు తెలియదు. పిండివంటలు, ఆకు కూరలు, కాయగూరలు వాటి రుచులలోని సూక్ష్మ భేదములు వాని ప్రభావము గుర్తించి చెప్పుటలో ఆయన నేర్పు గొప్పది. ఈ సామర్థ్యమే ఆయనను ఒక గొప్ప వాఙ్మయ పరిశోధకునిగాను చరిత్రపరిశోధకునిగాను తీర్చిదిద్దినది.

ఆయన జేబులో పదునుపెట్టిన ప్రశస్తమైన చాకొకటి ఉండేది. మంచి జాతి మామిడి పండ్లు దొర

పండిన తెల్లజానకాయలు లంకదోసపండ్లు అంటె ఆయనకు ఎక్కువ మక్కువ వాడిగలతన చాకుతో వాటి చెక్కుతెగకుండా పల్చగా కూసమువలె తీయడమాయన ముచ్చట. ఆ కాయలను ముక్కలుగా కోసి తాను తింటూ ప్రక్కనున్న వారికి రుచిచూపుతూ వాటి సువాసనలను రుచులను గూర్చి ముచ్చటించడం ఆయనకు మోజు. ఆయన ఎఱుకలేకుండా ఆయన చాకును ఎవరైనా వాడితే తరువాత ఆచాకును చూచి ఎవరో వాడినట్లు గుర్తించి అడిగేవాడు.

ఆయనకు చింతచిగురు, మామిడికాయ, దోసకాయ పప్పు కూరలు ఇష్టం. పులుసులో ముక్కలు మునగ కాయలు గోగుకూర చుక్కకూర లంకవంకాయలు అంటే ఎంతో ప్రీతి.

'పయరకూర తెచ్చి పచ్చి మిరపపండ్ల
నుక్కళించి పోసి ఊరనిచ్చి
కొంత కొంత పొదిపి కొను గోగు పచ్చడి
చవికి ఇంక నోరు చివికితీరు'
'ఎన్నడు తిందునో ఇంకొక్క మాటేను
వాయూర లంక వంకాయ కూర.'
'అరబండిన జహంగీరు మామిడి పండ
నాసపండును లంకదోస పండు'

మొదలైన ఆయన రచనలను బట్టి అయన అభిరుచులను కొంత వరకు తెలిసికోవచ్చును.

ఆయన భోజనప్రియుడు. మితంగా భుజించేవాడు. అయితే భోజనం రుచిగాను శుచిగాను ఉండవలెను. అట్లులేనినాడు వెంటనే తీవ్రమైన అసంతృప్తిని వెలిబుచ్చేవాడు. సరిగానున్నప్పుడు భోజనమైన వెంటనే "పది సంవత్సరముల ఈనడుమ ఇటువంటి భోజనం ఎరుగ"నని ఎప్పటికప్పుడు సంతృప్తిని ప్రకటించడం అనేక సార్లు నేను విన్నాను. ఆయన అభిరుచులను కనిపెట్టి మా వదిన గారు ఆయనకు కావలసిన పదార్థములను దగినట్లు అమర్చేది. ఆయనకొకప్పుడు పాలు ఒకప్పుడుమజ్జిగ ఒకప్పుడుచన్నీరు ఒకప్పుడు వేడినీరు కావలసి వచ్చేవి. అడిగినప్పుడు వెంటనే ఇవ్వవలెను. ఎప్పుడేది కావలెనో ఎవరికీ తెలియదు. ఆయనకు ఉపచరించడం ఒక అసిధారావ్రతం వంటిది. మా వదిన గారావ్రతమును జయప్రదంగా నిర్వహించి ఆయన మన్ననను పొంది కృతకృత్యురాలైనది.

నేను మద్రాసులో 1916వ సంవత్సరంలో కాబోలు కెల్లెట్ హైస్కూలులో ఫోర్తు ఫారంచదువుతూ ఉండగా మాఅన్నగారు ప్రాచ్యలిఖితపుస్తకశాల పంపున తాళపత్రగ్రంథ సేకరణకై సకుటుంబముగా దేశ పర్యటన చేస్తూ అప్పుడప్పుడు మద్రాసువచ్చి నాయోగ క్షేమములను విచారిస్తూ ఉండేవారు. అరోజులలో నేను మద్రాసులో జనార్దన్ హోటలులో భోజనం చేస్తూ ఉండవలసి వచ్చెను. నాకుటైఫాయిడ్ జ్వరంవచ్చింది. అప్పుడాయన మద్రాసువచ్చి నాఆరోగ్యమును గూర్చి ఎంత బాధపడ్డారో నేను చెప్పలేను. 11గంటలకు నన్ను విడిచి, ఆఫీసుకు విధిలేకపోయి, ఏరెండుగంటలకో పర్మిషన్ తీసికొని ఇంటికి వచ్చేవాడు. క్రొత్త ఈనిన అవు గొడ్లకాపరి తోలుకుపోవుటచేత విధిలేక మందతో మేతకు పోయి సరిగా మేయక హడలుతూ మధ్యాహ్ననికే దూడ కొరకు తప్పించుకొని ఇంటికి పరుగెత్తుకొని వచ్చినట్లు వీధిలో నుండియే ఎట్లున్నదని ఎదురైన వారిని ఆతురతతో అడుగుతూ లోపలికి వచ్చి, ఎట్లున్నదని నన్నడుగుతూ, నానుదురు కడుపు కాళ్ళు చేతులు తడవి చూచి కొంత స్థిమితపడేవాడు. అప్పుడు ట్రిప్లికేనులోప్రాక్టీసుచేస్తూఉండిన నారాయణస్వామి మొదలియార్ దాదాపు నెలరోజులు మందిచ్చినా జ్వరం తగ్గక 104° వరకు వస్తూ ఉండెను. తరువాత మైలాపూరునుండి డాక్టర్ ఎం.సి. నంజుండరావును తీసికొని వచ్చి మాఅన్నగారు నన్ను చూపిరి. ఆయన మందివ్వడం మొదలు పెట్టిన వారంరోజులకు జ్వరం నార్మల్‌కి వచ్చెను.

అప్పటికే మా అన్నగారు కుంభకోణంలో మాస్టర్ సి.వి.వి.ని దర్శించి వారి యుపదేశమువల్ల ఆరో

గ్యము పొంది యుండడంచేత నేను జ్వరంతో బాధ పడునప్పుడు ఆరోగ్యము ప్రసాదించవలెనని అర్థిస్తూ కుంభకోణములో నున్న మాస్టర్ C.V.V.కి తంతి పంపిరి.అది చేరగానే మాస్టర్ సి.వి.వి.గారు చూలైలో ఉన్న మీడియం సి.ఆర్ కృష్ణస్వామి అయ్యరు గారికి వ్రాసితి మని ఆయనను కలిసి కోమని జవాబిచ్చిరి. అందుమీద కృష్ణస్వామి అయ్యరు గారిని మాఅన్నగారు పోయి కలిసికోగా అయన వచ్చి test (ప్రయోగ దృష్టితో శరీరాంతర్భాగములను వాని వ్యాపారము లను పరిశీలించు విధానము) తీసికొని గోచరించిన వివరములనువ్రాసి మాస్టరుగారికి పంపిరి. నా కారోజు లలో శరీరములోని ఎడమభాగము బలహీనముగా నున్నట్లు తోచెడిది. నన్నడుగకనే వారా విషయమును యోగ దృష్టితో కనిపెట్టి టెస్టురిపోర్టులో ఉదహరించిరి. వారప్పుడు నాకు అరోగ్యము గలుగుటకు యోగ సంకల్పముతో చికిత్సకూడ చేసిరి. ఆ సంవత్సరం చదువు మానితిని. ఆ సంవత్సరమే అనగా 1918 డిసెంబరు నెలలో జనరల్‌కాలు సందర్భమున మా అన్నగారు కుంభకోణం వెడుతూ నన్ను కూడ తీసికొని పోయి 31వతేదీన భృక్తరహితతారకరాజయోగ మార్గమున మాస్టర్ సి.వి.వి. గారి ఆదేశం చొప్పున ప్రవేశం ప్రసాదించిరి.

తరువాత మా అన్నగారు సరస్వతిమహల్ లైబ్రరీలో (తంజావూరు) అముద్రిత గ్రంథపరిశీలనకు నియమింపబడగా ఆయన సకుటుంబముగా కొంత కాలం తంజావూరులో ఉండవలసివచ్చెను. ఆ సంవత్స రం చదువుమానడం చేత నేను కూడ వారితో తంజా వూరు వెళ్లి నాల్గైదు మాసము లచటనుంటిని- అక్క డికి కుంభకోణం సమీపంలో ఉన్నందున అవకాశం చిక్కినప్పుడల్లా తరచుగా మా అన్నగారు అక్కడకు వెడుతూ ఉండేవారు. తంజావూరులో ఎన్. త్యాగ రాజయ్యరు అనే మీడియం ఒకరు ఉండేవారు. ప్రతి రోజు సాయంకాలం 6గంటలకు తంజావూరిలో ఉన్న మీడియములందరు ఆయన ఇంట సమావేశమై ప్రాక్టీసు చేసికోవడం జరుగుతూ ఉండేది. ఆ సమావేశాలలో ప్రాక్టీసు అయిన తరువాత కొంత సేపు యోగవిషయా లను గూర్చి ముచ్చటించుకోడం జరుగుతూ ఉండేది. ఆ రోజులలో ఉదయం 6 గంటల నుండి 8 గంటల వరకు ప్రతిదినం ప్లానెటరీ రెగ్యులేషన్‌ను ప్రాక్టీసు చేసి కొంటూ ఉండేవాళ్లం.

మాఅన్నగారు అనేకవిధములగు శారీరక మానసిక వ్యధలకులోనై చివరకుభృక్తరహితతారక రాజయోగ మార్గమున ప్రవేశించి ఆరోగ్యమునేగాక అపూర్వమగు ధైర్యోత్సాహములనుఆత్మవిశ్వాసమును పొంది అమృ తత్వ సిద్ధికి యోగమార్గమే తరణోపాయమని విశ్వ సించి, దానివల్ల తాను పొందిన, పొందనున్న పరమ ప్రయోజనము అందరు తనతోపాటు పొందవలెనన్న ఉబలాటముతో తన బంధువులకు స్నేహితులకు ఈ యోగ ప్రభావమును గూర్చి నచ్చ చెప్పి, కుంభకోణం తీసికొని పోయి వారికందరికి ఈ యోగోపదేశమిప్పిం చిరి. అట్లు కుంభకోణంలో మాస్టర్ సి. వి. వి. గారి సన్నిధిని ఉపదేశం పొందిన వారనేకులున్నారు. వారిలో నాకు జ్ఞాపకమున్నంత వరకు మా జ్యేష్ఠ సోద రులు శ్రీ వెంకట శివశాస్త్రిగారు, మా బావగార్లు శ్రీ కాజ వెంకటశేషయ్య గారు, కాశీబొట్ల వెంకట సుబ్ర హ్మణ్యం గారు, అప్తుడు సుసర్ల కుమారస్వామి శాస్త్రి గారు, కొందరు మా తోబుట్టువులు, మామగారు పోలే పెద్ది వెంకటరామయ్యగారు మొదలైనవారు కలరు. వృద్ధాప్యంవల్ల కుంభకోణం పోజాలక స్వస్థానమందే యుండి యోగ సాధనము చేసికొనుటకు మాస్టర్ C.V.V. గారి అనుమతి పొందిన వారిలో మా తల్లి దండ్రులు, మా అన్నగారి మామగారు, మామేన మామ గారు, బ్రహ్మణ్యులు శ్రీ అద్దేపల్లి సోమనాథ శాస్త్రిగారు ఇంకను నాకు తెలియనివా రనేకులు కలరు.

మా అన్నగారు యోగ మంత్రోపదేశ మైనప్పటి నుండి ఎక్కడున్నా ఉదయం 6 గంటలకు సాయం

కాలం 6 గంటలకు విధిగా ప్రాక్టీసు చేసేవారు- ఒంటరిగా ఎప్పుడు ప్రాక్టీసు చేయలేదని చెప్పవచ్చు. ప్రతి సంవత్సరం మే నెల చివరి వారంలోను, డిసెంబరు చివరి వారంలోను కుంభకోణంలో మాస్టర్ సి. వి వి. గారి సమక్షంలో జనరల్ కాల్సు అనే సమావేశాలు జరుగుతూ ఉండేవి. వివిధ ప్రదేశాలనుండి మీడియము లనేకమంది ఆ సమావేశాలకు వచ్చేవారు. మీడియములైన కొందరు మతాంతరులు కూడ వచ్చేవారు. ఆ సమావేశాలలో మాస్టరు యోగమును గూర్చి అనేక అపూర్వ విషయాలను బోధిస్తూ ఉండేవారు. ఆ విషయాలన్నీ అందరికి అర్థమయేవి కావు- కొందరికి మాత్రం వారి వారి సంస్కారమును బట్టి కొంత వరకే అర్థమయేవి. కొందరు వారు చెప్పిన విషయములను సాధ్యమైనంత వరకు నోట్సు వ్రాసికొనేవారు. అట్లు వ్రాసికొన్న నోట్సు ఇప్పటికీ అనేక మంది మీడియమ్సు వద్ద నున్నవి

మా అన్నగారితో నే ననేకసార్లు జనరల్ కాల్సుకు వెళ్లడం జరిగింది. అక్కడ సమావేశమైనవారు యోగ విషయాలను గూర్చి వారి వారి అనుభవాలను గూర్చి ధారాళముగా ముచ్చటించు కొనుటకు అవకాశం కలిగేది- ఆ సందర్భాలు ఉత్తేజకరములు గాను విజ్ఞాన దాయకములుగాను ఉండేవి-

ముఖ్య విషయములు బోధించదలచినప్పుడు మాస్టరు గారు యోగ పాఠశాలలో పడమర గోడమీద నమర్చబడిన నల్లని సిమెంటు ఫలకం మీద సీమ సున్నంతో చిత్రములు (figures) వ్రాసి వాని సహాయంతో దుర్గ్రాహ్యమైన విషయాలను బోధించేవారు. బోధించే సమయాలలో ఆ గోడ నానుకొని గోడ పొడవునా క్రింది భాగమున నిర్మింపబడియున్న అరుగు మీద వారాసీనులై యుండేవారు- ఇతర సమయాలలో పడక కుర్చీ మీద సుఖా సీనులై యోగపాఠశాలలో దర్శన మిచ్చేవారు- తరచు యోగ పాఠశాలకు ఎదురుగానున్న తమ నివాస గృహపు విశాలమైన వసారా అరుగుమీద కూర్చొని శిష్య బృంద పరివేష్టితులై అనేక విషయాలను చర్చిస్తూ వారి వారి సందేహాలను నివృత్తి చేస్తూ ఉండేవారు. జనరల్ కాల్ సమావేశాలలో ఈగోష్ఠి కార్యక్రమం ప్రార్థనానంతరం ఉదయం 11 గంటల వరకు, సాయంకాలం భోజన సమయం వరకు, తిరిగి భోజనానంతరం రాత్రి ఒకప్పుడు ప్రొద్దుపోయే వరకు జరుగుతూ ఉండేది. యోగ పాఠశాలలో ఒక జాగంట ఉండేది. ఆ గంట మ్రోగగానే మీడియము లందరు ప్రాక్టీసుకు సిద్ధమయేవారు. అది ఒక్కొక్కప్పుడు అర్థరాత్రి తెల్లవారు జామున కూడ మ్రోగేది- ప్లానెటరీ రెగ్యులేషన్‌ల కాలమది- డిసెంబరు నెలాఖరురోజులలో తెల్లవారుజామున చలిలో ప్రక్కనే యున్న భగవ ద్ఘట్టమున కావేరీ స్నానం చేసివచ్చి ప్రాక్టీసు చేసిన రోజులు నాకు జ్ఞాపకం- పలుతావులనుండి వచ్చి కుల మత వివక్షణ లేక ఏకాశయంతో ఏక కుటుంబంగా తమ తమ ఈతి బాధలను విస్మరించి గురుదేవుల సన్నిధిలో గడిపే ఆ మూడు దినములు ఎన్నటికి మరపురానివి. ఆ సమావేశ దినముల తరువాత వీడ్కోలు సమయంలో ఒక్కొక్కరే శ్రీవారికి సాష్టాంగ నమస్కారముచేసి సెలవుపుచ్చుకొనే దృశ్యంహృదయాన్ని కదిలించేది. ఆయెడబాటు యెదలో ముల్లుగా బాధించేది. పండుగరోజులవంటి ఆ మూడుదినముల మధుర స్మృతులు ఎన్నటికి చెరగని ముద్రలుగా నా హృదయంలో హత్తుకొని యున్నవి.

మాస్టర్ సి. వి. వి. గారి విగ్రహం సువర్ణ చ్ఛాయతో ప్రకాశవంతంగాను ఆకర్షణీయంగాను ఉండేది- సుకుమారము సున్నితము అయిన కంఠ ధ్వని, కొంచెము మెల్లచూపు- వారి మాటలు దగ్గరగా ఉండి శ్రద్ధగా వింటేగాని వినబడేవి కావు. ఆ శరీర వర్ణము సౌకుమార్యము ప్రత్యక్షంగా చూడవలసినవే గాని ఫొటోలో కనబడునవి కావు. వారి నిజస్వరూపము ప్రత్యక్షంగా చూడనివారికి ఫొటోలో వారి విగ్రహం కొంత మోటుగా నున్నట్లు కనబడును. ఫొటోలో కాన

నసు వారి స్వరూపాన్ని గూర్చి జరిగిన ఒక సంభాషణను ఇక్కడ ఉదహరించడం అప్రస్తుతంకాదను కొంటాను- ముక్త్యాలలో కీర్తి శేషులు రాజాశ్రీ చంద్ర మౌళేశ్వర ప్రసాదు గారు జరిపిన ఒక పండితగోష్ఠికి ఆంధ్రదేశపునలుమూలలనుండి విద్వాంసులు వచ్చిరి. శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, పిశుపాటి చిదంబరశాస్త్రిగారు, మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారు,హరి నాగభూషణంగారువచ్చిన వారిలో నుండిరి. ఆ సందర్భంలో వారంతా అక్కడ మా సోదరుడు శంకరశాస్త్రి ఇంట బసచేసియున్నప్పుడు అక్కడ ప్రముఖ స్థానంలో అలంకరింపబడియున్న సి. వి. వి. గారి ఫొటోను చూచి హరి నాగభూషణం గారు 'వీరెవర'ని ప్రశ్నించిరి. కుంభకోణంలో ఉన్న మాస్టర్ సి. వి. వి. అనే యోగిపుంగవు లని ప్రక్కనున్న ఒక మిత్రుడు చెప్పగా విని నాగభూషణంగారు 'ఈ స్వరూపంలో యోగవర్చస్సు నా కేమి కానరాలేదే' అనిరి. అందు మీద అక్కడే ఉన్న వెంకట శాస్త్రిగా రిదివిని 'వజ్రాన్ని ఫొటో తీస్తే దాని వర్చస్సు అందులో ఏమి కననగును. తెలా వెలా పోతూ ఒక మృత్పిండము వలె నుండదా?' అని సమయ స్ఫూర్తితో సమాధానమివ్వగా నాగభూషణంగారు మిన్నకుండిరి.

మాస్టర్ గారికి నస్యం అలవాటు. పట్టువస్త్రమును గూడకట్టుగా కట్టకొని ఒక రంగుచేతి గుడ్డ మొలలో దోపు కొనేవారు. చేతికి ఒక మంచి రిస్టువాచి,బంగారపు రిస్ట్‌లెటు ఉండేవి. పాదములకు తేలికగా ఉండే పల్చని పావుకోళ్ళు ఉండేవి. ఆయన నడచునప్పుడు గాలిలో ముందుకు తేలిపోతున్న ట్లుండేది- సమావేశదినములలో వారు ఒక్కొకప్పుడు మీడియములతోపాటు లాడ్జిలో భోజనానికి వచ్చేవారు- మీడియముల పంక్తిలో మధ్య ఒక పెద్ద పీట మీద ఆసీనులై వెండికంచంలో కొద్దిగా భుజించేవారు, వారికి కాఫీ తరచుగా పుచ్చు కోడం అలవాటు.

శ్రీవారు మీడియముల నందరిని సమదృష్టితో సమాదరించేవారు- మీడియములకు గాని వారి ఆప్తులకుగాని అనారోగ్యం కలిగినప్పుడు మాస్టర్ సి. వి. వి ని స్మరించి, వారికి తంతి నంపితే adjusted అని బదులు వచ్చేది – ఆరోగ్యం కలిగేది. మాఅన్నగారి విషయంలో చాలాసార్లిట్లు జరిగినది. ఆయన యీ యోగాభ్యాసము ప్రారంభించిన తరువాత మందు ఎన్నడును పుచ్చుకోలేదు. వ్యవహార విషయములలో మీడియముల కేమైనా సంకటపరిస్థితు లేర్పడ్డప్పుడు వారి స్మరణ వల్ల మనశ్శాంతి చేకూరి సంకటము తొలగేది.

యోగపాఠశాలలో మాస్టరుగారి సమక్షంలో వారి ఆదేశం చొప్పున కార్యకలాపములను నిర్వహించే మీడియములు కొందరుండేవారు – వారిలో ముందు పేర్కొనదగిన ముఖ్యులు శ్రీ వి. రాధాకృష్ణ పిళ్లెగారు. ఆయన కుదిమట్టమైన విగ్రహంతో బంగారుపిచ్చుక వలె ప్రసన్నులై వచ్చిన మీడియములకు సలహాలిస్తూ ఉండేవారు. వీరు సరళస్వభావభాసితులు- ఇంకొకరు శ్రీ డి. మహాదేవయ్యగారు. వీరు ప్రశాంతచిత్తులు. వినయ మూర్తులు- ఇంకొకరు శ్రీవారి పెద్ద కుమారులు శ్రీ C.V. వెంకటరావు గారు- శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతిస్వామి యను ఒక యతీంద్రు లుండేవారు– ఇంకా అనేకులు ఉండేవారు. వీరంతా కుంభకోణ వాసులే-

ఆంధ్రులలో మొట్టమొదటి మీడియం శ్రీ పోతరాజు నరసింహంగారు. ఆయన మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజి లోను కుంభకోణంకాలేజిలోను చాలకాలం ఫిలాసఫీ ప్రొఫెసరుగా పనిచేసినారు. ఆయన ఉద్యోగకాలంలో సాధ్యమైనంత ఎక్కువకాలం కుంభకోణంకాలేజిలోనే పని కల్పించికొని మాస్టరు గారి సన్నిధిలో ఉండేవారు- తరువాత నరసింహం పంతులుగారిద్వారా మా అన్న గారు, క్రమంగా ప్రయాగ రాఘవయ్య, భాగవతుల సోమయాజులు, జి.లక్ష్మయ్య, డాక్టర్ టి.జానకిరాం, ప్రొఫెసర్ ఎ. నరసింగరావు, ప్రత్తిపాటి శోభనా

చలం, ఆయన సోదరుడు సత్యనారాయణరావు, డాక్టర్ వెంకటరంగంనాయుడు, పి. చెంచెయ్య, వావిలికొలను వెంకటరమణరావు, వేపారామేశం, వల్లూరి సూర్యనారాయణరావు, గూడూరు లక్ష్మణరావు మొదలగువారనేకులు చేరిరి. ఈ మీడియముల సంఖ్య షుమారు 750 దాకా పెరిగింది- వీరిలో ఇప్పుడు చాలమంది కీర్తిశేషులైనారు. ప్రస్తుతం వేళ్లమీద లెక్కింపదగినవారు మాత్రం మిగిలియున్నారు-

1910లో హాలిస్ కామెట్టు వచ్చినప్పుడు ప్రారంభమైన భృక్తరహితతారక రాజయోగ కలాపము 1922 వరకు 12 సంవత్సరములు కాలము నిర్వర్తించి మాస్టరు సి. వి. వి. గారు పరమపదించిరి తరువాత మీడియములలో కొంత నిరుత్సాహము తాత్కాలికంగా కలిగింది. కాని N. R. B. V. అనే ఒక మీడియము తన వద్దనున్న కాకానాడి (కాకభుజండర్ ప్రణీతం) అను గ్రంథంలో భృక్తరహితతారక రాజయోగమును గూర్చి మాస్టరు సి. వి. వి. ని గూర్చి కొన్ని పాటలను చదువుతూ తద్వారా గుహ్యమైన కొన్ని యోగ విషయములను అవగాహన చేసికొని శ్రీవారి జాతకమును కొందరు మీడియములజాతకములను చదువుతూ శ్రీవారు బోధించిన అనేక విషయములను పునశ్చరణ చేస్తూ యోగ సిద్ధిని గూర్చిన అద్భుతవిషయములను వెలువరించి మీడియములలో నూతనోత్సాహమును పూరించినాడు. అట్లే ప్రభాకరశాస్త్రిగారు, మైనంపాటి నరసింహం పంతులుగారు, ఉన్నవ లక్ష్మినారాయణ పంతులుగారు ఈ యోగ సిద్ధి యందు స్థిర విశ్వాసముతో దానిని అభ్యసిస్తూ మాస్టర్ సి. వి. వి. ప్రేరేపణవల్ల కలిగిన అంతరపబోధములవల్ల వేర్వేరు విధానములతో క్రొత్తవారి ననసంఖ్యాకులను ఉత్తేజపరచి భృక్తరహితతారకరాజయోగావలంబకులుగా చేసినారు. ఈ మార్గావలంబకులు అసంఖ్యాకులు ఇప్పుడు ఆంధ్ర దేశంలో ముఖ్యంగా గుంటూరు కృష్ణా మండలములలో నున్నారు.

**ఈ యోగ సిద్ధాంతము- ఆశయము:-**

సృష్టి ఇప్పుడు పరిణామదశలోనున్నది. ఈ పరిణామ పరమావధి అమృతత్వము. అదే మోక్షము- Indepedence, perfection ఇవన్నీ ఒకేస్థితిని తెలిపే పర్యాయపదాలు. ఈ స్థితి ఇంతవరకు ఆశయంగానే ఉన్నదిగాని ఎవ్వరును పొందియుండలేదు- దీనిని ఒకరు పొందగలిగితే అది వారితో లినిచి పోయేది కాదు-అది ఈ భృక్తరహితతారకరాజయోగం ద్వారానే సాధ్యమౌతుంది. జీవకోటిలో ఉత్తమస్థాయి నందుకొన్న మానవునకు అమృతత్వసిద్ధి కాగలదు. అది ఎప్పుడో ఎక్కడో కాదు. ఇక్కడే ఈ భూతలంమీద జన్మించిన మానవునకే. మోక్ష మనగా జనన మరణాల విషవలయం నుండి విమోచనం. దానిని కోరేది జన్మించియున్న సజీవుడైన మానవుడే గనుక అతడికి మరణరాహిత్యమేగాని కావలసినది మరణానంతరం జన్మరాహిత్యం కాదు-అమృతత్వం కోరేది జన్మించి యున్న మానవుడు కాని చనిపోయిన ఎవరో కాదుగద! జీవాత్మ అనే ప్రాణశక్తి శరీరమనే భౌతికస్వరూపానికి మొదలు లేక origin ఒకటే. పరిణామ దశలో రెండైనవి. ఇక జరుగనున్న పరిణామంలో ఈ రెంటికి అవినాభావసంబంధ మేర్పడి, ఈ వీకమై పృథ్వి మీద నెలకొనడమే అమృతత్వం ఈ స్థితి మానవునకు సిద్ధించినపుడు అతడు స్వయంప్రకాశుడై ప్రజ్ఞానఘనుడై వెలయగలడు. ఇది జరుగుటకు ముందు భూగోళాకారములోను దాని స్థితిగతులలోను ఖగోళ మండలి ఇతరగ్రహములలోను కొంత మార్పు రాగలదు. మానవుడు సంపూర్ణుడై స్వతంత్రుడై నెలకొనడమే సృష్టి పరమార్థం. అట్లుకానిచో ఈసృష్టి పరిణామప్రగతి జరుగుతున్న సర్వతోముఖభౌతిక వికాసానికి అర్థముండదు. సమస్త ప్రాణికోటి తమలో పాదుకొని యున్న గాఢ జీవిత వాంఛతో అపాయ నివారణోపాయాన్వేషణలో నిమగ్నమై యున్నది. మానవజాతి సర్వ స్వతంత్రమై సర్వశక్తమై సర్వ

సమృద్ధమై మెలగుటే దీని పరమార్థం. అదే మోక్షం. దానికే మానవుడు పరితపిస్తూ అనేక విధముల అంతర్బహిశ్చ అఙ్జులు సాచుతూ నిరీక్షిస్తున్నాడు. అతడి సర్వవ్యాపారాలు ఈ ప్రయత్నపువివిధరూపాలే.

ఈ ఆశయం కేవలం మానవ ప్రయత్నంవల్ల సిద్ధించునది కాదు. ఈశ్వరాదేశం (origin No.1) వల్ల మాస్టర్ సి.వి.వి. (origin No.2)భూతలం మీద ఈ యాశయసిద్ధికి చేసే విశ్వప్రయత్నమే భృక్తరహిత తారక రాజయోగం.మానవుని ఉనికికి మనుగడకు ఆధారభూతమైన 'కుండలిని' అనుnucleus వంటి ప్రధానసూక్ష్మాంశ అతనిలో నిహితమై యున్నది. అది చైతన్యానికి ఊటపట్టు. అందుండియే మానవుని వ్యక్తిత్వం వ్యక్తమగును. దానిలో జన్మ జన్మార్జిత సంస్కారం గూడుకట్టికొని యున్నది. ఆ కుండలిని ఇంతవరకు మూడు పరిణామదశలు దాటి నాల్గవదశలో నున్నది. ఎన్నో జన్మల సంస్కారం అందు నిహితమై యున్నను ప్రస్తుతం ఈ జన్మలో అవసరమైనంతవరకే తన చైతన్య ప్రభావమును వెలువరించుచున్నది. ఈ కుండలిని యొక్క ప్రచ్ఛన్న గుణవిశేషమే'భృక్తం'.ఈశ్వరా దేశంవల్ల(Master's bidding) ఈ 'భృక్తం' అనగా ఆచ్ఛాదన, ఆవరణ లేక రహస్యగుణం తొలగినప్పుడు కుండలిని భృక్తరహితం కాగలదు. అట్లు భృక్తరహిత మైనప్పుడు కుండలిని తన పూర్ణ ప్రభావాన్ని వెలువరించగలదు. అట్లు వెలువడిన కుండలినీశక్తి మూలాధారం నుండి వెడలి షట్చక్రములను సుషుమ్నలో లీనంచేసి తద్వారా సూటిగా సహస్రారం వరకు వ్యాపించకలదు. అప్పుడు మానవశరీరంస్థూలసూక్ష్మాద్యంతరముల నధిగమించి అప్రాకృతమగు దివ్య విగ్రహంగా మారగలదు. అట్టి వ్యక్తి ఏవిధమైన విస్మృతిగాని మాంద్యంగాని లేక చైతన్యమూర్తియై సర్వస్వతంత్రుడై జీవన్ముక్తుడుగా స్వస్వరూపంతో వెలయగలడు. అప్పుడే మానవజాతికిఅచ్ఛమగు స్వాతంత్ర్యం, అనేకత్వంలో ఏకత్వం, నిజమగు సామరస్యం (integration) ఏర్పడగలదు. ఇదంతయు ఈశ్వరాదేశం వల్ల మాస్టర్ సీ. వీ. వీ చేసిన ఉపదేశం (instruction) ద్వారా క్రమంగా సిద్ధించగలదు.

ఈ విధానమును గూర్చి గుహ్యములు దుర్గ్రాహ్యములు అగు అనేకవిషయములు గలవు. అవి అనుభవైకవేద్యములే. మాస్టర్ సి.వి.వి ఈవిషయములనన్నిటిని మీడియములకు వివరించి నారు. అవన్నియు విన్నవారికి అప్పుడు పూర్తిగా తెలియక పోయినా బీజరూపమున వారిస్మృతిపథంలో నాటికొని యుండి సకాలంలో అంకురించి ఫలించగలవు. ఇది మీడియముల విశ్వాసము

ఈ యోగ సిద్ధాంతమందు, దాని నిర్వాహమందు మా అన్నగారికి ప్రభాకరశాస్త్రిగారికి హిమాలయ సదృశమగు అచంచల విశ్వాసము ఏర్పడ్డది. దీని వల్ల ఆత్మవిశ్వాసం కలిగి ఉత్తేజితుడైనాడు. సహజంగా ఆయన ఆర్ద్రహృదయుడు కావడంచేత ఆధి వ్యాధులతో బాధపడేవారిని చూచినప్పుడు సానుభూతితో వారి బాధలను పంచుకొంటున్నాడా అన్నంతగా ఆయన చలించేవాడు. అమృతత్వసిద్ధికి నిరామయజీవితం ప్రథమ సోపానమని నమ్మి వ్యాధినివారణకు యోగాభ్యాసం ముఖ్యసాధనమని అందుకు పూనుకొన్నాడు. ఆయన యోగాభ్యాసం తనతోపాటు ఇతరులను కొందరిని ఆరోగ్యవంతులుగాను, ఉత్సాహవంతులుగాను చేయుటకు చాల వరకు ఉపకరించింది. ఈ యోగాభ్యాసమందు, నిరంతర చికిత్సా కలాపమందు నిమగ్నుడై యుండడంచేత అంతకుపూర్వం ఆయన కున్న సాహిత్యాభినివేశం సన్నగిల్లి యోగానుభవాల ముందు సాహిత్యవ్యాసంగం'ఉప్పన చప్పనగా' దోచినది అట్లు కాకుండినచో సారస్వత చరిత్ర పరిశోధన రంగాలలో ఆయన కీర్తిమూర్తి ఇప్పటికంటె ఎన్నో రెట్లు ఉజ్జ్వలంగ ప్రకాశించేది.

ఆయన మద్రాసునివాసపు చివరి రోజులు ట్రిప్లికేనులోనివెంకటరంగం పిళ్లై వీధి 4వనెంబరుఇంటిలో గడచినవి ఆ యింటిలో ప్రవేశించడానికి పూర్వమే యోగ చికిత్స ప్రారంభమైనది కాని అక్కడ ఉండగా చికిత్సా కార్యకలాపం ముమ్మరంగా సాగింది. రోగ బాధలతో వచ్చిన వారు ఉదయసాయంకాలములందు ఆయన ప్రాక్టీసు చేసికొనే సమయాలలో అక్కడ సమావేశమైనవారితో పాటు ఆయన ఎదుట కూర్చొని మాస్టర్ సి. వి. వి. పేరు తలచుకొని నమస్కరించి కండ్లు మూసికొని ప్రశాంతంగా శరీరంలో ఏమి జరుగుతుందో గమనించేవారు- ఏదో శక్తి తమలో ప్రవేశించినట్లు,దాని ప్రభావంవల్ల ఏవోమార్పులు కొన్ని శరీరంలో జరుగుతున్నట్లు, తమ బుద్ధికి ఏవేవో తలపులు తోచినట్లు అయి వారివారి అనుభవాలను ప్రార్థనానంతరం శాస్త్రిగారికి వివరిస్తూ ఉండేవారు. ప్రార్థన ముగియునప్పుడు కొంతమందికి తమ రెండు చేతులు అప్రయత్నంగా తమంతతామె లేచి కలిసి నమస్కారం చేయడం జరిగేది. వారి కథనములను విని, వారి మనః ప్రవృత్తులను గ్రహించి వారు నడచుకోవలసిన తీరును గూర్చి శాస్త్రిగారు కొన్ని సలహాలను ఇచ్చేవారు- ఈ తీరుగా కొద్ది రోజులు గడచిన తరువాత వారికి కొంత ఉత్సాహం కలగడం క్రమంగా ఆరోగ్యం చక్కబడడం జరుగుతూ ఉండేది. ఇట్లు మద్రాసులో ఉండగాను తరువాత తిరుపతిలోను అనేకులు శారీరక మానసిక వ్యాధులతో ఆయన వద్దకు వచ్చి ఆరోగ్యవంతులై వెళ్లినారు-

ఆయన వెంకటరంగం పిళ్లై వీధిలో నివసించే రోజులలో విస్సా అప్పారావుగారు ప్రెసిడెన్సీ కాలేజిలో ఫిజిక్సు ప్రొఫెసర్‌గా ఉండి నల్లతంబి వీధిలో కాపురముండేవారు. తన భార్య ఆరోగ్యం సరిగా లేకపోవడం చేత ఆయన యోగచికిత్సకొరకు మా అన్నగారి వద్దకు రావడం జరిగింది. అప్పుడే ఇరువురికి మైత్రి ఏర్పడ్డది. అప్పారావుగారు తీరికసమయాలు మా అన్నగారి వద్దనే గడుపుతూ ఉదయ సాయంకాలములలో అందరితోపాటు ప్రాక్టీసు చేస్తూ యోగాన్నిగూర్చి చికిత్సను గూర్చి ముచ్చటిస్తూ ఉండేవారు- ఈ పరిచయమే క్రమంగా వృద్ధిచెంది బాంధవ్యానికి దారి తీసింది- అప్పారావుగారికి మా అన్నగారి యెడల గొప్ప భక్తి విశ్వాసములు చనవు ఉండేవి- విజయవాడలో 1938లో అప్పారావుగారి కుమారుడు డాక్టర్ రామచంద్రరావుకి శాస్త్రిగారి కుమార్తె చి. సౌ. లలితకు జరిగిన వివాహ సందర్భంలో శాస్త్రిగారు ఏర్పాటు చేసిన విందు సమయమున అప్పారావుగారు భారతంలోని ఈ క్రింది పద్యమును తగు మార్పులతో ఇట్లగానం చేసిరి-

మ. జలజాత ప్రభావాదులన్ మనములో<br>
చర్చించి భాషావశిన్<br>
పలుకన్‌లేని ప్రభాకరాహ్వాయ పర<br>
బ్రహ్మంబు మాయింటిలో<br>
చెలియై మేనమరంది యై సచివుడై<br>
చిత్రప్రియుండై మహా<br>
ఫలసంధాయకుడై చరించుటది మా<br>
భాగ్యమ్ము విప్రోత్తమా.

దీనివలన అప్పారావుగారికి ప్రభాకరశాస్త్రిగారి యెడల ఎట్టి భావముండేదో తెలియగలదు- అప్పారావుగారు రిటైరు అయిన తరువాత కూడ అవకాశము చిక్కినప్పుడల్లా ప్రభాకరశాస్త్రిగారి సన్నిధిలోనే కాలం గడిపేవారు- తిరుపతిలో శాస్త్రిగారి అవసాన కాలమందు కూడ అప్పారావుగారు ఆయన సమక్షమందే యుండిరి.

యోగచికిత్సకొరకు అయనవద్దకు వచ్చి ఆరోగ్యమును పొందినవారనేకులున్నారు- వారందరు ఆయనకు ఆప్తమిత్రులైనారు- అందులో ముఖ్యులు కొత్త రామకోటయ్యగారొకరు-ఈయన శాస్త్రిగారికి సన్నిహితులై ఆయనను అర్థం చేసికొన్న కొద్దిమందిలో ఒకరు. శాస్త్రిగారి జీవితకాలంలో వలెనే ఇప్పటికిని ఇరువురి సంబంధము కొనసాగుచున్నదనటానికి రామకోటయ్యగారు

ప్రస్తుత 'నాటి శాస్త్రిగారు-నేటి శాస్త్రిగారు'అనే గ్రంథమే వ్రాస్తున్నారు. ఇప్పటికీ శాస్త్రిగారు తనకు 'కెలకులనున్న రంగేటి ఉన్నా' అని రామకోటయ్యగారు భావిస్తూ ఉంటారు. కంభంపాటి సత్యనారాయణశ్రేష్ఠిగారి కొకరు వీరుకూడ శాస్త్రిగారి యెడల గాఢభక్తి విశ్వాసములు గల వారు. వీరుకూడ అనారోగ్య బాధతో శాస్త్రిగారి యొద్దకు ఋషికేశులో ఉండగా వచ్చి ఆరోగ్యవంతులై శాస్త్రిగారి సన్నిహితమిత్రకోటిలో చేరి యోగాభ్యాసం చేస్తూ ఉండేవారు. ఇట్టే ఉనికిలి వెంకటరాజుగారు, కొత్త వెంకటేశ్వరరావుగారు, సత్య నారాయణరాజుగారు పిసపాటి కొండుభొట్లుగారు, మల్లెల సీతారామశాస్త్రిగారు, డాక్టర్ వేమూరి దుర్గా నాగేశ్వర రావుగారును శాస్త్రిగారి సన్నిహితమిత్రులలో తమిళ దేశపు మిత్రులు అనేకులున్నారు — ప్రణతార్తిహర అయ్యంగారు, నారాయణయ్యరు, శంకరయ్యరు రఘు నాథయ్యరు పద్మనాభ మొదలియారు, శ్రీ రామచంద్రన్ మొదలైనవారనేకులున్నారు-

ఆయన మద్రాసునుండి తిరుపతి చేరిన తరువాత కూడ యోగచికిత్సాకార్యకలాపము ముమ్మరంగానే సాగినది-ఉద్యోగవశమున ఆఫీసుకి పోయినప్పుడు తప్ప ఎల్లవేళలందు చికిత్సకు వచ్చినవారు యోగ మిత్రులు సాధారణముగా ఆయనను పరివేష్టించి ఉండే వారు. ఎడనెడ తత్సంబధీకులు వచ్చినప్పుడు సాహిత్య గోష్ఠికూడ జరుగుతూ ఉండేది. ఆయన ఇంట ఉదయ సాయం సమయములందు ఆయనతో ప్రార్థనచేయుటకు షుమారు 20 మందిదాకా మిత్రులు సమావేశమయే వారు-ప్రార్థనానంతరం యోగ మిత్రుల అనుభవా లను గూర్చి ఇతర యోగవిషయములగూర్చి శాస్త్రి గారు కొంత ప్రసంగించేవారు. ఈ సమావేశములకు వచ్చే వారిలో శ్రీ పరమాత్మని రాధాపతిగారు, వెన్నెల కంటి మునికృష్ణయ్యగారు, తంబయ్యశెట్టిగారు ,కొచ్చి వెంకటేశ్వరరావుగారు, సింగరాజు సచ్చిదానందంగారు తిమ్మావఝుల కోదండరామయ్యగారు, ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారు, అప్పుడప్పుడు రామచంద్రా చార్యులుగారు మొదలగు వారు వస్తూ ఉండేవారు. ఇతర స్థలముల నుండి చికిత్స కొరకు వచ్చినవారుస్త్రీలు పురుషులుకూడ కొందరు ఉండేవారు.

ఆయన యోగ చికిత్స ఎట్లు సాగేదో తత్ఫలితాలు ఎట్లు ఉత్సాహజనకములుగా ఉండేవో చూపుటకు 1933లో జరిగిన ఒక సంఘటన నేను ప్రత్యక్షంగా ఎరిగినది వివరిస్తాను. మా మాతృశ్రీగారికి జీర్ణకో శంలో కాన్సర్ వ్యాధి పుట్టి మా అన్నగారివద్ద యోగ చికిత్స పొందుతున్న రోజులవి- ఒకనాడు నేను మా అమ్మగారిని చూచుటకు మద్రాసు ప్రయాణమై పోతూ విజయవాడ స్టేషన్‌లో మా బంధువు మిత్రుడు అయిన ఒక బందరుఅడ్వకేట్‌ను చూచాను-అతడు మిక్కిలి బక్క చిక్కి చాల బలహీన స్థితిలో నిరుత్సాహంగా కనబడ్డాడు. ఇట్లున్నావేమి ఎక్కడికి పోతున్నావని నేనడిగినాను- పరిణామ శూలతో బాధపడుతున్నట్లు బందరులో డాక్టర్లంతా చూచి మందులతో లాభం లేదు మద్రాసు పోయి ఆపరేషన్ చేయించుకోమని చెప్పినారని అందుచేత మద్రాసు పోయి జెనరల్ హాస్పిటల్‌లో ఆపరేషన్ కొరకు పోతున్నానని చెప్పి నాడు. ఆనాడు రాత్రి మెయిలులో నేనెక్కిన రైలు పెట్టెలోనే అతడుకూడ ఎక్కినాడు. మరునాడు ఉద యం ట్రైయిను మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో ఆగ గానే నాతోకూడ ఆయన రైలుదిగి ఎక్కడికో పోవలె నని ఉద్యుక్తుడౌతూ ఉండగా 'ఇంత బలహీన స్థితిలో ఎక్కడికీ నీవు పోవద్దు నాతో మా అన్నగారి ఇంటికి నీవు రావలసింది. ఒక్కరోజు నీ వక్కడ విశ్రమించి నీ ఇష్టం వచ్చిన చోటికి నీవు పోవచ్చు'నని నేను కోరగా 'సరే'నని అతడు నాతో వెంకటరంగం పిళ్ళై వీధిలో నున్న మా అన్నగారిఇంటికి వచ్చినాడు.

మేమక్కడకు చేరు నప్పటికి సుమారు ఉదయం 7గంటలు కావచ్చినది చికిత్సకొరకు వచ్చిన వారు కొం దరు, ప్రార్థనచేసికొనుటకు వచ్చిన యోగ మిత్రులు

కొందరు ఆసమయానికి అక్కడ చేరి యుండిరి. మేము కూడ శీఘ్రంగా స్నానములు ముగించికొని అక్కడ సమావేశమై యున్న మిత్రులతోపాటు ప్రార్థనచేసి కొంటిమి ప్రార్థనానంతరం కొంత సేపటికి మా అన్న గారు బందరు నుండి వచ్చిన మిత్రుని యోగ క్షేమ ములు విచారించగా అతడు తన అనారోగ్య విషయ మంతా వివరించి ఆపరేషన్ కొరకు మద్రాసు వచ్చి నట్లు చెప్పెను. ఆ కథన మంతావిని 'రెండు రోజు లిక్కడ విశ్రమించి తరువాత మీరు హాస్పిటల్‌కు పోయి అవసరమనుకొన్న ఆపరేషన్ చేయించుకో వచ్చును'అనిచెప్పిరి. ఆమిత్రుడందుకు అంగీకరించి మా అతిధిగానేఉండి ఆరోజు సాయంకాలంకూడ ప్రాక్టీసుకు వచ్చిన మిత్రులతోపాటు ప్రార్థన చేసికొనెను. ప్రార్థ నానంతరం తన జీర్ణకోశంలో ఏదో కొంత గడబిడ జరిగినట్లున్నదని చిత్రమైన మార్పులేవో తన శరీరంలో జరిగినట్లున్నదని చెప్పి ఆకలిగా ఉన్నదని ఆపూట మా అందరితోపాటు సుష్టుగా భోజనం చేసినాడు. ఆ రాత్రి మాతోనే నిద్రించి మరునాడు ఉదయం కాల కృత్యములు తీర్చుకొని అందరితోపాటు కాఫీ టిఫిన్‌లు ఆరగించి తిరిగి మిత్రులతోపాటు ప్రాక్టీసు చేసికొని తన అనారోగ్యం తొలగిపోయిన ట్లున్నదని ఆకలి బాగా పుట్టినదని ఏ బాధలేదని అంతకుముందు కొంత కాలం నుండి లేని నిద్ర గడచిన రాత్రి పట్టిందని ఇక హాస్పిటల్‌కు పోదలచలేదని చెప్పి 15 దినములక్కడే మాతో సంతోషంగా గడిపి సంపూర్ణారోగ్యవంతుడై ఉత్సాహంతో స్వస్థలానికి చేరికొన్నాడు. ఇట్టి సంఘ టనలు అనేకములు జరిగినవి. అవన్నీ ఇక్కడ వివ రిస్తే గ్రంథం పెరుగుతుంది.

కాని నాస్వానుభవం ఇంకొక్కటిమాత్రం ఈసంద ర్భంలో వివరించడం అప్రస్తుతం కాదను కొంటాను. 1933 చివరిరోజులలోనేను బెజవాడలో వైద్యవృత్తిలో ఉండగా నామిత్రుడొకడు (SV) తాడేపల్లిలో క్వారీ కంట్రాక్టరు ఉండేవాడు. ఆయనభార్య కొంతకాలం నుండి నిక్కాక, దగు, ఉమ్మిలో రక్తంపడడం ఆకలి నిద్రలులేమి మొదలగు వానితో క్షీణించి మంచమెక్కే స్థితికి వచ్చెను XRayలో క్షయ వ్యాధిగా గుర్తించ బడ్డది. అప్పటికే అనేకమంది వైద్యులచే మందిప్పిం చారు. ఏమిప్రయోజనం లేక పోయింది. అప్పుడతనికి ఏమితోచక స్నేహితుడను కావడం చేత నావద్దకు వచ్చి దైన్యంతో విషయమంతాచెప్పి మందివ్వమని కోరగా జాలిపడి సన్నిహిత మిత్రుడు కోరడం చేత ఆమెను ఒకనెలరోజులపాటు బెజవాడలో ఉంచమని చెప్పితిని. వేరేచేయునదిలేక దానికతడు అంగీకరించి ఆమెను తీసుకొనివచ్చి మాఇంటిప్రక్కనే ఒకఇంటిలో ఆమెనుఉంచి ఆమె ఉపచారాదికమునకుతగు ఏర్పాట్లు చేసి వెళ్ళెను. ఆమె ఎక్కువగా మాఇంటనేతిరుగుతూ ఉదయం సాయంకాలం ప్రతిరోజు మేము ప్రాక్టీసు చేసికొనే సమయాలలో ఆమె వేరే ఒంటరిగా ఉండి చేయునది లేక మా కుటుంబముతోను స్నేహితులతోను ఆమెకూడ ప్రాక్టీసుకు కూర్చోడం మొదలు పెట్టింది. అట్లు ఒకటి రెండు రోజులు జరిగిన తరువాత మందు ప్రారంభించమని ఆమె నన్నడిగింది. నీవు వచ్చి ఒకటి రెండు రోజులేగదా అయింది రెండు మూడు రోజులలో నీకు కొంత స్థిమితం చిక్కిన తరువాత మొదలు పెట్టెదనని చెప్పితిని. లోపలకు మందిస్తూ ఇన్‌జక్షన్‌లు చేస్తే త్వరలో వ్యాధితగ్గి ఇంటికి పోవచ్చు ననే ఆతురతతో ఆమె అట్లనెనుకాని నామాటకు ఎదురు చెప్పలేక ఓర్పుతో మరి రెండు రోజులు మాతో ప్రార్థనకు కూర్చుండెను. మూడవదినం సాయంకాలం మా అందరికంటె ఎక్కువసేపు ప్రార్థనలో కూర్చుండి కండ్లు తెరచి "ఇదే మార్గ"మని ఒకశబ్దం ప్రార్థనలో తనకు వినబడెనని "ఇదే మార్గ"మని తన మనస్సుకు తోచెనని ఆమె చెప్పినది. మరునాడు ఉదయం ప్రార్థ నానంతరం "మందు మొదలు పెట్టెదను, ఇప్పటికే నీవు వచ్చి 4,5 దినములైనది. ఇంకా ఆలస్యమెం దుకు" అన్నాను "ఇదే మార్గమని ప్రార్థన సమయంలో

నాకు వినబడెనుగదా ఇక నాకు మందు మాకులెందుకు ఇప్పటికే నాకు కొంత ఆరోగ్యమేర్పడుతున్నట్లుంది. బాధలు కొన్ని తగ్గినవి. ప్రతిదినము ఇకముందు మీతో ప్రార్థన చేసికొంటాము. ఇదే నాకు శరణ్య"మని సంతోషంతో అన్నది. అట్లే ఆమె మాతో ఒక నెల రోజులుండి మాతో ఉదయ సాయం సమయములందు ప్రతి దినము ప్రార్థన చేసికొన్నది. ఆకలి పెరిగింది. నిద్రబాగా పోసాగింది. క్రమంగా సంపూర్ణారోగ్యవం తురాలైనది. నెల దినములైన తరువాత తృప్తితో భర్తను కలిసి ఇంటికి పోయింది.

మందులు పుచ్చుకొని ఆరోగ్యం పొందవలెనని ఆమె నా దగ్గరకు వచ్చింది- మందివ్వవలెననే సంకల్పంతోనే ఆమెను రమ్మన్నాను. కాని మందులేకుండానే చిత్రంగా దీర్ఘకాలం ఔషధ సేవనం వల్ల కుదురదగిన క్షయ వ్యాధి స్వల్పకాలంలోనే అద్భుతంగా నయమైనది. ఈ సంఘటన వల్ల నాకు ఆశ్చర్యము ఆనందము కలిగినవి- ఈశ్వరానుగ్రహము మనకు తెలియకనే ఎట్లు మనకు మార్గదర్శకమై శ్రేయస్సు కూర్చునో దీనివల్ల కొంత తెలిసికొంటిని- ఆమె కావిధంగా ఆరోగ్యం కలుగుటలో నా సంకల్పంగాని పూనికగాని ఏమీలేదు- ఆమె వచ్చిన వెంటనే మందులివ్వడం ప్రారంభించక 4, 5 రోజులు ఆలస్యం చేయడంలో ఆమె స్థితి కొంత అబ్జర్వు చేసి ఆమెకు కొంత స్థిమితము చిక్కిన తరువాత మొదలు పెట్టవలెననే గాని వేరే నాకేమి తెలిసికాదు- ఏదో ఒక అజ్ఞాత శక్తి నన్నట్లు సరియగు మార్గమున నడిపి ఆశ్చర్యకరమగు ఫలితమును కలిగించింది - దీనికి మాస్టర్ సి.వి.వి. దివ్యానుగ్రహమే కారణమని సంతోషించి తృప్తి పడ్డాను-

అనారోగ్యంతో బాధపడుతున్న మిత్రులు మా అన్నగారిని చూచుటకు వచ్చి ఆయన ప్రార్థన చేసే సమయంలో ఆయనతో కూర్చోడం జరిగేది. ఆయన సహజంగా జాలిగుండె కలవాడగుట చేత వారి బాధలు తన బాధలుగానే భావించి సానుభూతితో తన ప్రార్థనతో మాస్టర్ సి. వి. వి. అనుగ్రహంవల్ల వారికి ఆరోగ్యం కలుగవలెనని అర్థించేవారు- వారి శరీరంలో కొంత అలజడి జరిగినట్లు కొంత బాధ తొలిగినట్లుప్రార్థనానం తరం వారు చెప్పడం జరిగేది. ఈ కథనం కొంత ప్రోత్సాహకరంగా ఉండడంచేత, ఈ ప్రాక్టీసువల్లనేతన అనారోగ్యం లోగడ తొలగి ఉండడం చేత మొట్ట మొదట ఆయన ఈ మార్గంలో చికిత్సప్రారంభించడం జరిగింది. దీనివల్ల సత్ఫలితాలు కలగడంలో తన నిర్వాహమేమీలేదని దీనికంతకు మాస్టర్ నామమేమార్గ దర్శకమై అన్నియు నిర్వహిస్తూన్నదనిఎప్పటికప్పుడు ఆయన అనుభవపూర్వకంగా చెప్పేవారు-

ఈ భృక్తరహిత తారక రాజయోగం వల్లనేఅమృ తత్వం సిద్ధించగలదని, అది సిద్ధించుటకు చీకుచింతలు లేని నిరామయ జీవితం ప్రథమ సోపానమని ఆయన విశ్వాసం. తన వద్దకు వచ్చిన రోగార్తులబాధ తొలగ వలెనని ప్రార్థన చేసినాడు. అది ఫలప్రదం కావడం గమనించి ఈ యోగంవల్ల కలిగే పరమప్రయోజనం తనతో పాటు వారు కూడ పొందవలెననే ప్రగాఢ సంకల్పంతో తనజీవితమంతా తదాశయసిద్ధికి వినియో గించి కొంతవరకు కృతకృత్యుడైనాడు.

మా అన్నగారైన శ్రీ ప్రభాకరశాస్త్రిగారి యోగ జీవితాన్ని ఆయనతో నా సంబంధాన్ని పురస్కరించు కొని ఆయననుగూర్చి ఒకవ్యాసాన్ని వ్రాయవలసిందని యోగ మిత్రులొకరు కోరగా దీనిని వ్రాయుటకు ఉపక్ర మించితిని. కాని ప్రారంభంలోనే ఆయన యోగ జీవి తాన్నే గాక ఆయనతో నాకు గల సంబంధము, ఆయన వ్యక్తిత్వము, ఆయన స్వభావము మొదలగు వానిని గురించి వ్రాయబూనగా నా సంకల్పం లేకనే ఈ వ్యాసము కొంతవరకు స్వీయచరిత్ర ధోరణిలో సాగింది అందుకు మిత్రులు మన్నింతురుగాక!-||

# ఒకలేఖ-ఒక సమావేశము

-డా॥ వేటూరి ఆనందమూర్తి

**ఉపోద్ఘాతము :**

పితృపాదులు వేటూరి ప్రభాకర శాస్త్రి గారికి సంబంధించిన లేఖల్ని ప్రముఖులు వ్రాసిన వాటిని, ప్రముఖులకివ్రాసినవాటిని ప్రకటించాలన్న నాసంకల్పానికి మిత్రులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారు ఇటీవల ప్రేరణ కల్గించారు. కొన్నిటిని వేర్పరచి ఫొటో కాపీలు తీయించాను. వీటిని చూసి జిరాక్సు తీస్తున్న టెక్నిషియన్ 'ఏదయినా కోర్టు కేసు నడుస్తున్నదా సార్! ఇంత పాత ఉత్తరాల్ని జాగ్రత్త చేసి కాపీ తీయిస్తున్నారు!' అనడం జరిగింది. చటుక్కున కోర్టు కేసు లాగానే సాగిన వెనకటి పావులూరి మల్లన కేసు నా మనస్సులో మెదిలింది. అయినా ఆ టెక్నిషియన్‌కి ఈ లేఖల్లోని సాహిత్యపు విలువలు గాని, వాటి పూర్వాపరాలు గాని ఈ నాడు తెలిసే అవకాశమెక్కడుంది? అందుకని పర్లాకిమిడి నుంచి 1924-25లో గిడుగు రామమూర్తి పంతులు గారు ప్రభాకర శాస్త్రి గారికి వ్రాసిన లేఖాంశాల్ని కొన్ని చూపించి కాస్త విశదీకరించాను.

"మీరు సవిస్తరముగా జాబు వ్రాస్తే మీ గోష్ఠి వలన కలిగే ఆనందము కలుగుతుంది. నేను మీ దర్శనమునకు వచ్చి వుంటే ఏమేమి ముచ్చటలు చెప్పుదురో అవి అన్నీ ఉత్తరములో చెప్పి నన్ను సంతోష పెట్టరాదూ! ఇంగ్లీషులో అట్టి ఉత్తరములు ఇంపుగా రచించేవారు ప్రఖ్యాత కవులున్నారు. లెటర్ రైటింగ్ మధుర కవిత వంటిది."

"మీకన్న ఎక్కువగా ప్రాచీనాంధ్రమును శోధించి తెలుసుకొన్న పండితులను నేను ఎరుగను. ఇచ్చకానికి చెప్పిన మాట కాదు. నమ్మండి....."

పై పంక్తులు చదివి, రామమూర్తి పంతులు గారి పదేసి పేజీల ఉత్తరాలు చూసి ఆయన ఆశ్చర్యంప్రకటించాడు. అప్పటి ఉద్దండుల పాండిత్య ప్రకర్షకీ వారి శ్రద్ధాభినివేశాలకీ. ఈ లేఖలన్నీ త్వరలో గ్రంథ రూపాన్నందుకోగలవు. వాటిల్లో ఒక లేఖని మీముందుంచుతున్నాను.

RAO BAHADUR
K: VIRESALINGAM PANTULU

RAJAHMUNDRY
ANANDA GARDENS
9 th December 1917

Dear Sir,

ఆర్య వర్యా! నమస్కారములు. తాము దయతో వ్రాసినకార్డిప్పుడే యందినది. మీ యభిప్రాయ భేదాదికమును సూచించిన పుస్తకమును దయచేసి నాకుఁబంపుడు. మీకు వేఱొక ప్రతినిబంపెదను. మార్చవలసిన దానిని మార్చి యనుబంధముగాఁబ్రచురించెదను.

మన మిత్రులైన మ. రా. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారే యపూర్వ వాఙ్మయమును గూర్చి కడచిన మెయి నెలలో చెన్నపురిలో నిచ్చియున్న యుపన్యాసమునందు గంగా

ధరని యైరావత చరిత్రమును దాము ప్రకటింపఁదలచుకొన్న పుస్తకములలోఁ జేర్చియున్నారే. తాము చిత్తగింపలేదా?

నేను వృద్ధుఁడనయి వ్యాధి బాధలచే దుర్బలుఁడనయి యుండుట చేత గ్రంథ పరిశోధనమునకును వ్రాఁతకును నాకంతగా శక్తి చాలకయున్నది. నాకంటె నెక్కువ గ్రంథ పరిశోధనము చేసిన మీవంటి వారు నాకు తోడ్పడి చేయూత యిచ్చి నన్ను నిలువఁ బెట్టవలెను. ద్వితీయ తృతీయ భాగ సంస్కరణమునందు మీ హితోపదేశము ననుసరింపఁ బ్రయత్నించెదను.

"సత్యాశ్రయునిదొట్టి చాళుక్య నృపుల్" అన్న పాఠము వ్రాఁత ప్రతిలో లేని పక్షమున మన రామకృష్ణ కవిగారి కాపాఠ మెక్కడ నుండి వచ్చినది? ౧౮౭౦ సంవత్సర ప్రాంతమునందే నేను తంజావూరి మండల న్యాయాధిపతియైన యొక మిత్రుని సాహాయ్యమున నక్కడి తెలుగు పుస్తకముల పట్టికను దెప్పించి తరువాత కొన్ని సంవత్సరములకు నేనే పోయి కుమారసంభవాది కావ్యములను జూచితిని గాని నాకప్పటికీ గ్రంథమునందు శ్రద్ధ లేకపోయెను.

ప్రబంధ రత్నాకరము ముగిసినదా? పూర్తికాఁగానే నాకొక ప్రతిని బంపుఁడు. చిత్తగింఁపుడు.

ఇట్లు
విన్నవించి నమస్కరించు
విధేయమిత్రుడు- కం- వీరేశలింగము.

*　*　*　*

సందర్భం:

ఈ లేఖ ప్రబంధ రత్నావళి పీఠికలో ప్రస్తావింపబడ్డది.

"గంగరాజు (గంగాధరుఁడు) చిరుమూరి:- రా. బ. వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్ర ప్రథమ భాగ పీఠికలో నైరావతచరిత్ర మీతనికృతిగా వ్రాసినారు. ఐరావత చరిత్ర ప్రతులు రెండు నే నెఱుంగుదును. రెండింటను పీఠికా గద్యములు లేవు. కృతి మంచిది. చిన్నది. కథ భారతేతిహాసప్రసక్తము. కాని సంస్కృతాంధ్రభారతములం దాకథ కానరాదు. కర్ణాట భారతమందు మాత్రమున్నది. ఆంధ్రమున వేఱుగ నున్న యీకృతి యత్కర్తృకమో నా కెఱుఁగరాలేదు. గంగరాజు కృతియని మీ రెట్లు వ్రాయగల్గితిరని శ్రీ వీరేశలింగము పంతుల వారికి వ్రాసి కనుఁగొంటిని. శ్రీ రామకృష్ణ కవిగా రపూర్వ వాఙ్మయ పరిశోధన మనుపేరఁ బ్రచురించిన యుపన్యాసమును జూచి వ్రాసితిమని బదులు వ్రాసిరి.* కవిగారిట్లుపన్యసించినచో నాధారమేమో? తెలియవలసియున్నది.(* శ్రీ వీరేశలింగముపంతులుగా రన్యదీయములగు విషయములనేకమిట్లు స్వకపోలసాధితములట్లు కవుల చరిత్రమున జేర్చినారు. ఆయా విషయముల కాకరము తెలుపకుండుట భావిపరిశీలకులకుఁ జిక్కుఁ గల్గించును)."1 ప్రబంధరత్నావళి (1918). ద్వి.ము. 1976 పీఠిక. పు. 15.

శ్రీ వీరేశలింగము పంతులుగారు తమకవుల చరిత్రని సంస్కరించి పునర్ముద్రించిన సంవత్సరము అది (1917). అప్పటికి ముప్పై యేళ్ల క్రితం 'అప్పటికి ముప్పై యేళ్ళ క్రితం 'అప్పటికి దొరకిన సాధన కలాపముతో...ఏదో యొకరీతిని' పూర్తి చేసిన కవుల చరిత్రని వారు సంస్కరించి ప్రకటించాలనే సంకల్పంతో పరిశ్రమించిన సంవత్సరమది.

కవుల చరిత్ర విషయమై అంతకుపూర్వం చెలరేగిన వాద వివాదాలు, పంతులు గారికి అవి కలిగించిన 'రోషా'వేశాలు వార్ధక్య దౌర్బల్యం మీద పడుతున్నా తాము సజీవంగా ఉండగానే పెంపుచేకూర్చి కవుల చరిత్రని సంస్కరింప జేసి ప్రకటించాలనే పట్టుదలతో వారు పడిన పరిశ్రమ 'వేగిరిపాటు' మొదలైన విషయాలన్నిటిని పంతులుగారు తమ సహజ ధోరణిలో క.చ. పీఠికలో ప్రకటించారు. ఆ సంవత్సరమే పంతులుగారు పలువురికి లేఖలు వ్రాశారు. పలువురి తోడ్పాటు పొందారు (చూ.క.చ. పీఠిక). అప్పుడు శ్రీ వంగూరి సుబ్బారావుగారికి పంతులు గారు వ్రాసిన 16,17 ఉత్తరాల్ని మిత్రులు డా॥ అక్కిరాజు రమాపతి రావుగారు తమ సిద్ధాంత వ్యాసంలో ప్రకటించారు.[2] ఇప్పుడీ లేఖ ప్రకటితమవుతున్నది. వంగూరి వారికి వ్రాసిన లేఖల్లో పంతులు గారు ప్రభాకర శాస్త్రిగారిని గురించి, మానవల్లి రామకృష్ణకవి గారికి గురించీ కొన్ని వ్యక్తిగతాభిప్రాయాలు ప్రకటించడం జరిగింది. ఆ అభిప్రాయాలు అప్పట్లో శాస్త్రిగారి దృష్టికి వచ్చినవో లేదో తేలీదు గానీ కవుల చరిత్ర పీఠికలో పంతులు గారు తమ తోడ్పాటును గుర్తించిన తీరుకి, ప్రబంధ రత్నావళివిషయమై తమను 'అకారణముగ చెనకిన' వైఖరికి నొచ్చుకొని శాస్త్రిగారు వ్రాసిన జాబులకి జవాబుగా వచ్చిన పంతులు గారి లేఖల్లో పైన ప్రకటించినది ఒకటి. అప్పటి సందర్భాలన్నిటిని శాస్త్రిగారు తమ స్వీయచరిత్ర 'ప్రజ్ఞా ప్రభాకరము'లో ఈ విధంగా విశదీకరించారు.

**పావులూరి మల్లన కేసు:-**

"ఆనాళ్ళలో పావులూరి మల్లన కవిని గూర్చి నామూలమున చర్చ రేగెను శ్రీ వీరేశలింగము పంతులుగారు కవుల చరిత్రలో వ్రాసిన తీరు సరిగాదని, పావులూరి మల్లన నన్నయనాటి మల్లన మనుమడని నేను లైబ్రరీలోని వ్రాత పుస్తకములఁ బరిశీలించి పత్రికల ద్వారా నిరూపింప యత్నించితిని. అప్పటి మద్రాసు తెలుగు పత్రిక శశిలేఖ. వీరేశలింగము పంతులుగారి తరపున నిలిచి అనేకులు నాపై చెలరేగిరి. వీరావేశముతో చిలుకూరి వీరభద్రరావుగారు లైబ్రరీ పుస్తకములను నేను పసికుంకను జేరి దుర్బుద్ధితో మార్చివేయుచుంటినని, నేను వ్రాసినట్లు వ్రాత ప్రతులలోలేదని, గవర్నమెంటువారు నన్నక్కడ నుంచరాదని బాహటముగా వ్యాసములు వ్రాయసాగిరి. ఇంకెందరెందరో అటు తిరిగి నన్ను కటువుగా మందలింప సాగిరి. శ్రీ వీరేశలింగము పంతులుగారి పేరు ప్రతిష్ఠలట్టివి గనుక, వారి యాంధ్ర సాహిత్యసేవ యంత మహనీయమైనది గనుక వారెల్లరు నట్లు గ్రిక్కులయిరి. ఏవో కొన్ని పొరపాట్లుండిన నుండ వచ్చునుగాకని సరిదిద్ద నొల్లక పోయిరి. వారందఱు సత్యమేదియని పరిశీలింపక వ్రాసినవారే. ఒక వీరభద్రరావుగారే సత్యము స్పష్టముగా గుర్తింపఁ దగియున్నను, లైబ్రరీ పుస్తకములను నేనేమి తార్మాఱు చేయకున్నను స్పర్థాబుద్ధితో సత్యదూరముగా వ్రాత సాగించిరి.

అనాళ్ళలో ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో మహావీరాచార్యుని గణిత సారసంగ్రహమును ప్రొఫెసరు రంగాచార్యులుగారు ముద్రించు చుండిరి. మల్లన గణితము దానికిఁదెలుఁ గగుట నేను గుర్తించి రంగాచార్యులుగారి కెఱిఁగించితిని. అప్పుడు వీరభద్రరావుగారి వ్రాఁతలను గూడ వారికి దెలిపితిని. అప్పుడు మా వివాదమునెల్ల హైకోర్టుకేసు రికార్డులను పరిశీలించునట్టుపరిశీలించుచు శ్రీ వేపా రామేశముగారు నా వాదము సత్యమైనదని, ప్రతివాదము శ్రుతిమించి యసంబద్ధముగా సత్యదూరముగా నున్నదని గుర్తించి నా నౌకరికి కీడుదేఁజూచు చున్నవారి దురుద్రేకమునకురోసి శ్రీ బయ్యా నరసింహేశ్వరశర్మగారితో నొకనాడు ముచ్చటించిరి. రంగాచార్యులుగారు నా కభయము చెప్పిరి. ట్రాన్స్లేటరు ఆఫీసువారు నా మీఁది నిందను దొరతనము వారికి తెలుపు నంతటిస్థితికి వచ్చెను. ఇంత జరిగిన తర్వాత. దొక్క చెదరి యందాఁక నాకు ప్రతికూలంముగా నున్న

వారొకరు లైబ్రరీ వ్రాత ప్రతుల పాఠములనెల్ల శశిలేఖ పత్రికలో ప్రకటించిరి. అవి నా ప్రకటించిన తీరునే నిరూపించెను. మఱియు కాకినాడలో కార్చెర్ల శ్రీనివాసరావుగా రనువారు పావులూరి గణితపు తాటాకు ప్రతుల సంపాదించి యందలి పాఠములను శ్రీ పోలవరం జమీందారుగారు, దురిసేటి శేషగిరిరావు గారు వగైరాల సంతకములతో ప్రకటించిరి. అవి యెల్ల నేఁజెప్పినట్లే యుండెను. అంతతో నా వివాద మడఁగారెను. "(ప్రజ్ఞా ప్రభాకరము పు 57-59.)

అప్పుడు 'శశిలేఖ'లో జరిగిన వివాదం యొక్క భోగట్టా ఇది- "19-8-1910 తేదీన శ్రీ చెన్నపురి యాంగ్లేయ కళాశాలలో మ॥రా॥శ్రీ జయంతి రామయ్య పంతులుగారి యాజమాన్యములో జరిగిన నన్నయ భట్టారకవర్ధంతి మహోత్సవ సభలో బ్రహ్మశ్రీ శతావధాని దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు నన్నయభట్టాద్యాంధ్రకవియని యుపన్యసించిరి. ఆగొప్ప తప్పిదము నకై శశిలేఖలో నొక యనామకుఁడు శ్రీశాస్త్రిగారిని, వారి జతకవియగు వెంకటశాస్త్రిగారిని గూడ దూషించుచు వ్యాసము వ్రాసెను. దాని మీద చెన్నపట్టణ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందెలుగు పండితులగు ప్రభాకర శాస్త్రిగారు హెచ్చరిక యను వ్యాసము వ్రాసి శశిలేఖలోనే ప్రచురించిరి. పిదప శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు దూషణమున ననామకునే యనుసరించుచు నొక కొంత కసి దింపి యొక వాదమును బయలుదేరదీసిరి. తరువాత ప్రభాకరశాస్త్రిగారు పావులూరి మల్లన నన్నయకు సమకాలికుడు కాడనియు రావుబహద్దరుగారి కవుల చరిత్రలో తబ్బిబ్బులు కలవనియు వ్రాయుచు పుస్తకభాండాగారములోని నాలుగు ప్రతులలోని పీఠిక యని పావులూరి గణితపు పీఠిక నుదహరించిరి.... నేనీ వ్యాసములన్నియు జూచి యీ పుల నెక్కడేని యీ కాగితపు ప్రతి కలదేమోయని బ్రహ్మశ్రీ రాళ్ళ



పల్లి రామన్న సిద్ధాంతి గారి యింట నున్నదని విని ఆ మహానుభావుని ప్రార్థించి యా గ్రంథమును గైకొంటిని. పిదప నా గ్రంథములోని పీఠిక చూడగా శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రచురించినట్లేయందున్నది. ...." (కాకినాడ 25-11-1910 సం. కార్చర్ల శ్రీనివాసరావు శ్రీ పోలవరం జమీందారుగారు మరి పద్దెనిమిది మంది సంతకాలతో మల్లన గ్రంథ పీఠికలోని పద్యాలు ప్రకటింపబడినవి.)

ఇదంతా 1910కి పూర్వపు ముచ్చట. ఆ తరువాతి సందర్భాలన్నీ ప్రజ్ఞా ప్రభాకరంలో ఇలా విశదమవుతున్నాయి.

**ఒక సమావేశం:**

"శ్రీ లక్ష్మణరావుగారు వీరేశలింగం పంతులు గారినొకనాడు ప్రాచ్య లిఖిత పుస్తకశాలకు గొని వచ్చి - వారప్పుడు కవుల చరిత్రను సంస్కరించి ప్రకటింపఁబూని యున్నారు గాన- వారి కస్మదాదుల సహాయము లభింపఁజేయుటకై జతనము సాగించుటలో నన్నెఱుక పఱచిరి. పావులూరి మల్లన్న చరిత్ర విషయములు వీరేశలింగము గారి దగ్గర, నా దగ్గర చర్చించి తత్త్వము నిర్ణయింప నభిలషించిరి. అన్ని వ్రాతప్రతులను జూపి నా వాదమెఱింగించితిని. వీరేశలింగము గారికి వేరు విధముగా పూర్వము తాము వ్రాసిన తీరుగా సమర్థింపనయితిగాదయ్యెను. లక్ష్మణరావుగారు జాగ్రత్తగా నెల్లవిషయము మరల ననువదించి వివరించి 'మీరికనిట్లుమార్చుకోవలసినదే. మీరు తొలుత వ్రాసినదియు, మిమ్ము సమర్థింపబూని యితరులు వ్రాసినదియు సరికాదని స్పష్ట పడినది' అనిరి. పంతులుగారు నా దగ్గర వ్రాత ప్రతి యేదో ఉండుట బట్టియే యట్లు వ్రాయుటయ్యెను. రాజమహేంద్రము వెళ్ళి నా దగ్గరి గ్రంథములను బట్టి మరల పర్యాలోచించి నిర్ణయింతును' అనిరి. లక్ష్మణరావుగారు 'ఇన్ని ప్రతులలో నున్న దానికి విరుద్ధముగా మీ వ్రాఁత ప్రతి

యుండదు. ఉండినచో సరిగా సమర్థముగా మీ వాదము నిర్వహించుకోవలసియుండును' అనిరి పంతులుగారి పట్టుదలను పరిభావించుచు' వీరేశలింగము గారికి మన మందఱము సహాయము చేయుదము. వారిచేతనే కవుల చరిత్ర సంస్కరణము జరపింతము' అని లక్ష్మణ రావుగారు చెప్పిరి 'నా చేతనయినంత తోడ్పాటు జరపుదునంటిని. వారిర్వురు నింటికి వెళ్లిరి. (ప్రజ్ఞా ప్రభాకరము. పు 60-61 ద్వి ము 1976.)

1917 ఏప్రెల్ 21, శనివారం:—

ఈవిధంగా ప్రజ్ఞా ప్రభాకరంలో అలనాటి పండిత ప్రకాండుల సమావేశం స్మరింపబడింది. పంతులుగారు వంగూరి వారికి వ్రాసిన లేఖల్లోని అంశాల్నీ, కవుల చరిత్ర పీఠికలోని వివరాల్నీ పైన ఉట్టంకించిన విశేషాలతో సమన్వయించి చూడగా అప్పటి ఆ మేధావుల అపూర్వ సమావేశం 1917 ఏప్రెల్ నెల 21వ తేదీన శనివారమునాడు అప్పటి ప్రాచ్యలిఖిత పుస్తక శాలలో జరిగినట్లు విశదమవుతోంది.[3] వేసవిలో చల్లదనానికి బెంగుళూరు వెడుతూ మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక శాలలో గల తాళపత్ర ప్రతుల్ని స్వయంగా చూచుకొని, అనేక విషయాలు సంప్రదించుకోడానికే పంతులు గారు అప్పుడు మద్రాసు వచ్చారు. ఆ సందర్భంలోనే వారు మద్రాసులో అనుకోకుండా మానవల్లి వారిని కూడా కలుసుకోవడం తటస్థించింది. (చూ. క. చ. పీఠిక పుట vi-1917). కొమర్రాజువారు, పంతులు గారు, శాస్త్రిగారు, మానవల్లివారు ఆ సమావేశంలో ప్రధానంగా కలుసుకున్నారు. పంతులుగారు ఆనాటికి పిఠాపురం నుంచి వంగూరి సుబ్బారావుగారిని కూడా అక్కడకి రమ్మని కోరిరి. కాని వారికి వీలు పడినదో లేదో!

ఆ సమావేశం తరువాత ముచ్చట ఇది-

"అటనుండి వీరేశలింగము పంతులుగారు బెంగుళూరు కొలది దినములకే వెళ్లిరి. కవుల చరిత్ర ప్రథమ భాగమున మాత్రము చేయవలసిన సంస్కరణములు నే నెఱిఁగినంత బెంగుళూరికి వ్రాసి పంపితిని. అది యొక పెద్ద కట్ట. పంతులుగారు వాని నుపయోగించుకొనిరి. కాని వాని నాయా పట్టులందు పేర్కొననే లేదు సరికదా! గ్రంథ పీఠికలో 'శాస్త్రిగారును.. తమ గ్రంథాలయములో నున్న పుస్తక భాగములను పద్యములను నేను కోరిన వానిని వ్రాసి నాకెంతో తోడు పడిరి' అని వ్రాసిరి. వారి కే యేవిషయములుకావలసి యుండునో వానిని నేనే తెలిపి, లిస్టు వ్రాసి, సంస్కరింపవలసిన చేర్చవలసిన విధానములు, పద్యములు వ్రాసి పంపఁగా ఆ విషయము నిట్లా స్మరించుట? ఈ సంస్కరణమున ఫలాని ఫలాని పద్యములను గ్రంథములను వ్రాసి పంపవలసినదిగా వారు కోరగా నస్మదాదులము వ్రాసి పంపినట్టులర్థమగును. నే నన్న వాస్తవార్థమును దేవచ్చును. ఇంతేకాక తమకు చిర మిత్రులయిన శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారిని కూడఁ జెనకిరి. ప్రబంధ రత్నావళిని గూర్చి యకారణముగా వారి కవుల చరిత్ర పీఠికలోనే మరల నన్నును జెనకిరి. వానినెల్ల వివరించుట రోఁత. నేను జాబులు వ్రాయగా జాలి జాలిగా వానికి బదుళ్లు వ్రాసిరి. ఆ జాబులనిటీవల నేను చింపివేయబోగా తాము జాగ్రత్తగా నుంచుకొందుమని నా మిత్రులు గయికొనిరి.[4]

ఇంత యెందుకు వ్రాసితిననఁగా నాకు వాఙ్మయ రంగమున క్రీడా వినోదమనుభవింపవలెనని కొండంత కోరిక చెలరేగుచున్నను, అదినుండి కూడ దానికభ్యంతరములు ప్రతిషేధములు తఱచుగా నడ్డు తగులుచు నిరుత్సాహము గొల్పుచున్నవని తెల్పుటకు....బ్రదుకు సాగించుకొనుటకు వాఙ్మయ సేవ సాధనముగా నాకేర్పడినది గాన, అందులో అరకుడుపు సాగునట్లు పని చేయుటకే నాయంతర్యామి నన్ను మెసలనిచ్చినది గాని యంతకెక్కువగ పనిచేయుటకుగాని, యంతకెక్కువగ సాధించుటకుగాని నాకు చోటియ్యకే పోయెను." (ప్రజ్ఞా ప్రభాకరము. పు. 61-62. ద్వి.ము 1976).

కొమఱ్ఱాజు వారు కోరిన మేరకు శాస్త్రిగారు పంతులుగారికిచ్చిన వాగ్దానమును నెరవేర్చారు. "లిస్టు వ్రాసి పెద్దకట్టను, బెంగుళూరుకే పంపిరి. ఆ పనివారు మే నెలాఖరుకుగా చేసి ఉండవలెను. దానిని పంతులు గారుపయోగించుకొన్న వైనము ప్రజ్ఞా ప్రభాకరంలో ఉంది. కాని అప్పటి యూశనివారం సమావేశం గురించి గానీ, శాస్త్రిగారు పంపిన సమాచారాన్ని గురించి గానీ పంతులుగారు వంగూరివారికి వ్రాసిన లేఖల్లో, ప్రకటింపబడిన వాటిల్లో, ఎక్కడా పేర్కొనట్లు కనపడదు. మానవల్లి వారు మాత్రం అప్పట్లో వీలుపడక జూన్ తర్వాతగానీ తామే విధంగానూ సాయము చేయ జాలకున్నామన్నారుట(చూ.క.చ.పీఠిక.పుvii 1917). ఆ రోజుల్లో మానవల్లి వారు, వేటూరివారు ప్రాచీన తాళపత్ర గ్రంథ సేకరణార్థం ప్రభుత్వాదేశం చొప్పున నిరంతరం దేశాటనంలో నిమగ్నులై ఉండినట్లు తెలుస్తున్నది. 1916 ఆరంభంలో కృష్ణా జిల్లా పర్యటన [5] ఆ సంవత్సరం మధ్యలోతిరిగీ తంజావూరులో లైబ్రరీ పని 1917లో మొదటి మూడు నాలుగు నెలలు మద్రాసులో.[6] తరువాత, సంవత్సరం మధ్యలో విశాఖ మండలంలో పర్యటన.[7] ఈ పర్యటనలన్నీ కవిగారూ శాస్త్రిగారూ కలిసే చేస్తూ వచ్చారు. తంజావూరులో పరిశీలించిన గ్రంథాల విషయమై కొరవ పని చేయడానికి మద్రాసు వచ్చియున్న సందర్భంలోనే పంతులుగారితో ఆ సమావేశం జరిగింది. అలాంటి పనుల ఒత్తిడిలో తాముండగా, దానికి తోడు '(క.చ) మొదటి భాగములో చేయఁబడిన ప్రాంతనిర్దేశమునేకములు మార్పఁబడవలసి' యుండగాను, 'నూఱుగురు నవకవులు మొదటి భాగములో జేర్పఁబడవలసిన' వారుండగాను, కోరిందే తడవుగా సమాచార మందించలేదని పంతులుగారు క.చ. పీఠికలో చేసిన విమర్శకు కవిగారు కూడా కాస్త నొచ్చుకున్నట్లు కనపిస్తుంది నిడుదవోలు సుందరం పంతులు గారితో ప్రస్తావిస్తూ బాధపడి 'వీరేశలింగముగారు 'కవిగారు కార్యాంతర వ్యగ్రులై నాకు సహాయము చేయ లేక పోయినారు. వారి తోడ్పాటున్నచో నా గ్రంథ మింకను ప్రామాణికముగ నుండెడిది.' అని వ్రాసి యుండవలసినది." అనినారట![8] కవి గారప్పుడు సాయము చేయలేక పోయినా తరువాత కవుల చరిత్రని సంస్కరించే కార్యభారమును నిర్వహించినట్లే తెలుస్తోంది. "శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారు శ్రీ వీరేశలింగము గారి కవుల చరిత్ర శేషమును రచించుచున్నారు. పదునేడవ శతాబ్ది నడిమి కాలపు కవుల చరిత్రము దాక రచించుటయినది. దానిని తిరుపతి దేవస్థానపు ప్రాచ్య పరిశోధన శాఖవారు ప్రకటింపనున్నారు."(చూ.ఉపలబ్ధ అముద్రిత ప్రాచీనాంధ్ర గ్రంథములు.ప్రభాకరశాస్త్రిగారివ్యాసము-భారతి వ్యయ. వైశాఖము) అంతటి వార్ధక్యంలోను పంతులుగారు చూపిన పట్టుదల వెనక వారికి గల సాహిత్య రచనాభిలాషని, చేసిన అభియోగాల వెనక సమకాలిక విద్వాంసుల యెడవారికి గల ప్రీత్యయాన్ని మనం సంభావించుకో వచ్చును.

**వివరణ :**

లేఖలోని 1-3 పేరాలు:— పంతులుగారు వంగూరి వారికి, ఇతరులకి వ్రాసిన లేఖల్లో కూడా ఇలాటి అభ్యర్థనమే ఉంది. ''నా కవుల చరిత్రములోని ప్రమాదములను మీరు పుస్తకములో వ్రాసికొన్నట్టు రమణారావు పంతులుగారు చెప్పినారు. కాబట్టి సంశయింపక నాకాపుస్తకమును తప్పక పంపుడు" (ఏప్రిల్ 1-1917)., "ఏయేకవులుప్రథమ భాగములో జేరవలసియున్నారో వారిని గూర్చి వ్రాయుటకేమేమి యాధారములున్నవో మీకు తెలిసినంత వరకు వ్రాయుడు. శ్రమకు మన్నింపుడు"(మే 17, 1917) "మీరు దోషములను గురుతుపెట్టిన నాకవుల చరిత్రమును నాకియ్యవలసినదనియు మిమ్ము పలుమారు వేడితిని. మీరట్లు చేయ ననుగ్రహింపరైతిరి" (డిశంబరు 24-1917)

''కవి చరిత్రమును సంస్కరించుటలో మీరు నాకు మనస్ఫూర్తిగా తోడ్పడదలచుకొన్నట్టు నాకిప్పుడు

నిశ్చయమైనది.... నాకు తోడ్పడుట మీకిష్టములేదేమో యనిసందేహించితిని. నేనుపడిన భ్రమకు క్షమింపుడు' (ఏప్రిల్ 1-1917). కాబట్టి అప్పట్లో పలువురు పలు విధాల తోడుపడినట్లున్నారు. పంతులుగారు ఆ సహాయాన్ని తమ దృక్పథమునకు అనుకూలమైన విధమున ఉపయోగించుకున్నారు.

పేరా 2:- ఈ అంశం గురించి ప్రబంధరత్నావళి పీఠిక పుట 15 నుంచి ఉద్ధరించిన విషయములో తెలుస్తున్నది.

పేరా 4:- ''కుమారసంభవప్రతుల యొక్కయుఁ బాఠముల యొక్కయు రహస్యములింకను బయల్పడవలసియే యున్నవి. కాని తంజాపురపు సరస్వతీ పుస్తకభాండాగారమునఁ దాటియాకులపై వ్రాయబడిన కుమారసంభవపుఁబ్రతి యున్నది. అక్కడదక్క నింతవరకుఁ బ్రత్యంతర మెక్కడను మనకు గనరాదు. వినరాదు. ఆ పుస్తకములోఁ బై పద్యమిట్లున్నది

క. "మునుమార్గ కవితలోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గునునిలిపి రంధ్రవిషయం

బునఁజనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్."
కవిగారికి 'చన సత్యాశ్రయునిఁదొట్టి చాళుక్యనృపుల్' అన్న పాఠమెక్కడ నుండి వచ్చినదో! వారింకెక్కడ ప్రతి సంపాదించినారో! ప్రథమ భాగమును ముద్రించు నప్పటికి వారీ తంజాపూరుఁబ్రతి నెఱుఁగనే యెఱుఁగరుగాపలయు. ఎఱింగి యుందురేని యనర్ఘమగునీ పాఠమును జూపకుండుట కేమికారణము? తంజావూరు పుస్తకశాలలో నన్నిచోడని కుమారసంభవ మున్నదని యెల్లరు నెఱింగిన తర్వాత క్రీ. 1914లో వీరు ప్రచురించిన కుమార సంభవపు రెండవభాగమున చాళుక్యరాజు మొదలుగఁబలువుర్' అను పాఠాంతర మున్నట్లుతెలిపిరి. కాని యిప్పుడయినను దంజాపురపుఁ బుస్తకమును వీరు చూచినట్లు వ్రాయలేదు. కావున నీ పాఠము వీరి యొక్క ప్రతిలోఁ జూచినారేమో? అత్యూహ లెందుకు? తంజావూరు పుస్తక పాఠము మాత్రమే మనకిప్పుడు గ్రాహ్యము. శ్రీ కవిగారి పాఠముగల మాతృక బయల్పడువరకును. అట్టి ప్రత్యంతరము బయల్పడెనా యని పాఠాంతరముగా గూర్చుకొందము. ఇంక చాళుక్యరాజు మొదలుగ నన్నప్పుడు రాజరాజనరేంద్రుడే యేల కారాదు? చోడఁడు నన్నయ్య కంటెఁ బ్రాచీనుఁడనుట కాధారములు తగినవి లేవు. శ్రీ వీరేశలింగము పంతులుగారు నన్నిచోడని భాషాప్రయోగములను గూర్చి చేసిన యాక్షేపములు నిలువఁ జాలనివి." (ప్రబంధ రత్నావళి పీఠిక. పు. 19-20.(1918)ద్వి.ము 1976)
ఈ విషయమై శాస్త్రిగారానాడువ్రాసిన దింత మాత్రమే. తంజావూరులోని కుమారసంభవ తాళపత్ర గ్రంథాన్ని యథామాతృకంగా శ్రీ తిరుమల రామచంద్రగారిచేత శాస్త్రిగారు వ్రాయించుకొన్న వ్రాత ప్రతి మా దగ్గర ఉంది. పాఠాంతరాల విషయం ప్రస్తావిస్తూ వాటి 'రహస్యము లింకను బయల్పడవలసి యే యున్నవి' అన్నారు శాస్త్రిగారు. కాని ఇటీవల కుమారసంభవ కావ్యకర్తృత్వము విషయమై కొత్త సిద్ధాంత మొకటి వినవస్తోంది. "కుమార సంభవము నన్నెచోడుడు రచింపలేదనియు, మానవల్లి రామకృష్ణ కవిగారే రచించి ప్రాచీనతను సంపాదించుటకై నన్నెచోడుని పేరు పెట్టెననియు, కావ్యాంత చక్రబంధ పద్యమునందు రామకృష్ణకవి పేరుండుటయే అందుకు ప్రబలనిదర్శన మనియు (డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు) పేర్కొనిరి"9 కాని వాస్తవము పై అభిప్రాయానికి భిన్నంగా ఉందని పంతులుగారి యీ లేఖాంశాన్నిబట్టి తెలుస్తున్నది. హేతువు లివి (1) కవిగారు కు॥సం॥ ప్రకటించడానికంటె చాలాకాలానికి పూర్వమే కం॥వీ॥ గారు తంజావూరులో ఆ కావ్యాన్ని చూశారు. (2) తంజావూరులోని అప్పటి పుస్తకాల పట్టికలో కూడా ఆ కావ్యంపే రున్నది.(3) ఆ పుస్తకాల పట్టిక,

అందులో పేర్కొనబడిన ఆకావ్యము 1870 లో పంతులుగారు చూడడానికి పూర్వమే తంజావూరులో ఉండినవి

పేరా 5:- ప్రబంధ రత్నావళిని ప్రభాకరశాస్త్రి గారు ప్రకటిస్తున్న విషయాన్నిగూర్చి పంతులు గారు క-చ- పీఠికలో ప్రస్తావించారు. ఆంధ్ర సాహిత్య పరిషద్భాండాగారంలోని ఉదాహరణ పద్యాల్నీ తంజావూరు పుస్తకశాలలోని జగ్గకవి ప్రబంధరత్నాకరాన్నీ గుది గ్రుచ్చి 'భాషాకవి చరిత్రాద్యపేక్షకులకు' తోడు పడే విధంగా దీనిని శాస్త్రిగారు సంధానించారు. 'అవిరత ప్రయాణములతో' దేశాటనము సల్పుతూ ఉక్కిరిబిక్కిరిగా ఉన్నా 1917-18 సంవత్సరాల మధ్యనే శాస్త్రిగా రీసంకలనాన్ని వెలువరచారు. తుదకిది 1918 జనవరి నాటికి పూర్తి అయింది. ఈ విషయమై తమనుపంతులుగా'రకారణముగాచెనకి'రనినొచ్చుకున్న శాస్త్రిగారు ఈ ముద్రణం ముగిసిన తర్వాత పంతులు గారి కొక ప్రతిని పంపి వారి ఉత్కంఠను తీర్చారు. (1976లో దీని ద్వితీయ ముద్రణం వెలువడింది.)

**ఉపసంహారం:**

భాషా చారిత్రిక దృష్టితో ప్రముఖుల లేఖల్ని ఈ విధంగా గుర్తించి ప్రకటించడమూ అప్పటి సన్నివేశాల్ని స్మరించడమూ అన్నవి పెద్దల భాషాసేవను కీర్తించడానికీ వాఙ్మయ విమర్శలో యువతరానికుత్తేజం కల్గించడానికీ ఎంతో అవకాశ మివ్వగలవని నావిశ్వాసం.

---

1. "భైరవుని శ్రీరంగమహాత్మ్యము ముద్రించు నవుడు ప్రమాదవశమున గౌరన యుదాహరించిన కవిగజాంకుశ శ్లోకము (కుసీదుగ్ధమివశ్యాజ్యం) తత్పుత్రుండగు భైరవుని కవిరాజ గజాంకుశములోని పద్యమని భ్రమించి, భైరవుఁడు గౌరవ పుత్రుడగునో కాదో యను సంశయమున నీ యుదాహరణము బాధక మగునని పీఠికలో వ్రాసియుంటిమి.

కందుకూరి వీరేశలింగం పంతులుకూడా దానినే గ్రహించి తన కవుల చరిత్రలోఁ దాను సంపాదించిన స్థలము చెప్పకయే దోషము నెక్కించుకొనిరి. ఇప్పుడు గౌరన యుదాహరించిన కవిగజాంకుశ శ్లోక మొక సంస్కృతగ్రంథమునఁ గానవచ్చు చున్నది." మానవల్లి కవి రచనలు-కవికంఠపాశము పుట 274 (1972)

2. చూ. డా. అక్కిరాజు రమాపతిరావుగారి సిద్ధాంత వ్యాసము "వీరేశలింగముపంతులు - సవిమర్శ పరిశీలనము"

పంతులుగారు వంగూరి సుబ్బారావుగారికి వ్రాసిన లేఖల్లో కవుల చరిత్ర (1917) పునర్ముద్రణకి సంబంధించిన వివరాలివి.

18-2-1917 'నా కవుల చరిత్రము యొక్క మఱియొక కూర్పును నేను చూడనేమో యని సందేహము కలిగియున్నది.'

28-2-17 'నా కవుల చరిత్రమును సరిచేసి పునర్ముద్రణము చేయింప నిశ్చయించు కొన్నాను.'

2-3-17 'నా కవుల చరిత్రములోని గ్రంథములను లేనివి వేనినిచేర్పవలయునో చేయవలసిన మార్పులను గుఱుతు పెట్టగలరా?'

1-4-17 'కవుల చరిత్ర ప్రథమ భాగమును నేను ముద్రింప నారంభించితిని.'

16-4-17 'తంజావూరునుండి క్రొత్తపుస్తకములు వచ్చునని విని సంతోషించుచున్నాను. శనివారమునాడు (21) మీరు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు రాగలరా? ... 21వ తేదీన నన్ను కలుసుకొనుటకు ప్రయత్నింపుడు.'

17-5-17 'ఏయే కవులు ప్రథమభాగములో చేరవలసి యున్నారో వారిని గూర్చి వ్రాయుట కేమేమి యాధారము లున్నవో మీకు తెలిసినంతవఱకు వ్రాయుడు.'

1-5-17 'చెన్నపురినుండి వచ్చిన తర్వాత నాకిక్కడ కొంచెము జబ్బుచేసినది. అందుచేత మీకు వెంటనే ఉత్తరము వ్రాయలేక పోతిని. ప్రభాకరశాస్త్రిగారును-మానవల్లి రామకృష్ణయ్య గారును నాకింకను సాయమేమియు చేయలేదు. చేయుదురో లేదో తెలియదు. ఎవరు చేయక పోయినను నాచేత నైనంత వఱకు పుస్తకమును సవరించి ముద్రింపించెదను...రామకృష్ణకవిగారు మొదలైనవా రాయాకవులకు కర్తృత్వము నారోపించి ప్రకటించుచున్న పద్యములు గలపుస్తకములు నిజముగానున్నవాయని నాకు సందేహము కలుగుచున్నది. పుస్తకములను కన్నులార చూచువరకును నా కేవిషయమునను నమ్మకము కలుగకున్నది.'

12-5-17 "రామకృష్ణకవిగారు పంపెదమన్న విషయముల నింకను బంపలేదు ఎప్పుడు పంపుదురో తెలియదు.'

30-5-17 'మానవల్లి రామకృష్ణయ్యగారుగాని, ప్రభాకరశాస్త్రిగారు గాని యేమియు సాయము చేయువట్లు కనపడదు. వారు నేనడిగిన యంశములను దెలుపక పోవుటయేగాక నా యుత్తరములకు బ్రత్యుత్తరమిచ్చుట సైతము మానినారు. తమకు తెలిసినది ఇతరుల మూలమున లోకమునకు తెలియుట వారికిష్టములేదు కాబోలు.'

5-6-17 'నేను పదునేనవ తేదీనే యిక్కడ (బెంగళూరు) నుండి బయలుదేఱి చెన్నపట్నములో రెండుమూడు దినములుండి యీ నెల యిరువదవ తేదీలోపలనే రాజమహేంద్రవరము ప్రవేశించెదను'

8-10-17 'నాలుగైదు దినములలో అచ్చువని పూర్తి కావచ్చును'

12-10-17 'కవుల చరిత్రము ప్రథమ భాగము కంపోజు పూర్తి అయినది ... పీఠిక నిన్నటి దినము వ్రాసి పంపితిని... రెండు మూడు వారములు విశ్రాంతి పొంది రెండవ భాగము పని యారంభించెదను.'

19-10-17 'కవుల చరిత్రము ప్రథమభాగమును నేడే మీకు పంపితిని పోయి వుచ్చుకొని పీఠికతో గూడ దానిని జదివి నేను చేసిన ప్రమాదములను దెలుపుడు.'

24-12-17 'చేర్పవలసిన క్రొత్త కవుల పేరుల నేబదింటిని వ్రాసితిమని మీరు నాతో జెప్పితిరి. ఆ పేరులు పంపుడని నేను వ్రాసినను, ఏబది పేరులను పావుగంటలో వ్రాయుట సాధ్యమయినను మీరు నాకా సాయము చేయ నొల్లరైతిరి. నా పుస్తకములోని దోషములను మీరు వార్తాపత్రికలలో బ్రకటించుటకు నా కేవిధమైన యాక్షేపమును లేదు....ముద్రణము నిమిత్తమయి కాగితమును గొనుటకయి కావలసినంత సొమ్ము యాచితముగ సమకూరినను నా నిమిత్తమున మీరు లోకోపకారమయిన యీ పుస్తక ముద్రణమును మానుకొంటిరని ప్రకటింపబడుటను జూచినప్పుడు నాకెంతో చింతకల్గినది.'

3, "మాకు, మహమ్మదీయులకి, మహిళలకి శుక్రవారాలు ముఖ్యం" అని శాస్త్రిగారు అప్పట్లో శుక్రవారాలు సెలవుదినాలు కావడాన్ని గూర్చి చమత్కారంగా అంటూ ఉండేవారని మా అన్నగారు చెప్పారు. (డా॥ వేటూరి సుందరమూర్తి గారితో ముఖాముఖి)

4. పంతులుగారి తక్కిన జాబుల్ని తీసుకొన్న మిత్రులెవరో నాకు తెలియరాలేదు. వారెవరైనా వాటి ఫొటో కాపీలను మాకు పంపగలిగితే కృతజ్ఞులము. ఇది వ్రాసిన దరిమిలా మా పినతండ్రి డా॥ వేటూరి శంకరశాస్త్రిగారితో జరిపిన ముఖాముఖిలో వెల్లడైన విషయమిక్కడ పొందుపరుస్తున్నాను. 'చిన్నన్నయ్య చించివేయబోయినపుడు ఈ లేఖల్ని తాను జాగ్రత్త చేసుకొంటానని చెప్పి తీసుకున్న మిత్రుడు గన్నవరపు సుబ్బరామయ్యే. నాకు బాగా తెలుసు.' (డా॥ వేటూరి శంకరశాస్త్రిగారితో ముఖాముఖి)

5. చూ. ప్రజ్ఞాప్రభాకరము పు 127. (1951) ద్వి. ము 1976.

6. చూ. ప్రజ్ఞాప్రభాకరము పు 130-139 (1951) ద్వి.ము 1976.

7. చూ. మానవల్లికవి రచనలు (1972) పీఠిక పు. 8, 25 (1972)

8. చూ. మానవల్లికవిరచనలు (1972) పీఠిక పు.26

9. చూ. 'శిల్ప ప్రభావతి'. పు. 260 ప్రభావతీ ప్రద్యుమ్న కావ్యవిమర్శ (1980)

డా॥ రాచపాళెం చంద్రశేఖరరెడ్డి.



# లేఖ

[మహాత్ముని మరణానంతరం దశాహస్సునాడు ఆకాశవాణి మద్రాసు కేంద్రం నుండి గురుదేవులు ప్రసంగించారు. ఆ ప్రసంగ వ్యాసాన్ని 12-2-48 నాటి ఆంధ్రప్రభ ప్రకటించింది. ఆ ప్రసంగ వ్యాసాన్ని విన్నవారు, చదివినవారు ఒక అనిర్వచనీయమైన దివ్యానుభూతికిలోనై ప్రశంసా పూర్వకంగా లేఖలు వ్రాశారు. కవులు కవితలల్లారు. వాటిల్లో శ్రీ మోచర్లవారి ఈ లేఖ ఒకటి. 'మహాత్ముడు' అన్న వ్యాసాన్ని ఆంగ్లంలోనికి తర్జుమా చేయించాలన్న మోచర్ల వారి ఆనాటిఅభిలాషని నేటికి 'మణిమంజరి' తీర్చగల్గు తున్నందుకు ఆనందముగా ఉన్నది. మహాత్ముని 33 వ వర్ధంతిని పురస్కరించుకొని స్మృత్యంజలి ఘటిస్తూ ఆ వ్యాసాన్ని-మూలపాఠాన్ని అనువాదాన్ని ఇందులో ప్రకటిస్తున్నాము-సం॥]

మోచర్ల రామకృష్ణయ్య బి. ఏ. బి. యల్
ప్లీడరు

81, అత్తితోట అగ్రహారం
నెల్లూరు
తేది. 13-2-1948

శ్రీ మత్ప్రభాకర మహాశయుల పాదార విందముల సన్నిధికి:-

నమస్కారపురస్సరముగా వ్రాయునది- గాంధి దేవుని గూర్చి తాము రేడియోద్వారా చేసిన వాఙ్ముఖము వినని నేను నిన్నటి యాంధ్ర ప్రభాముఖమునఁ బ్రత్యక్షముగాఁ బ్రత్యక్షరము మూఁడు పర్యాయములు చదివి యనుభవించి స్నేహితులకు వినిపించితిని. ఎన్నో వ్యాసములు తెలుగున నింగిలీషున నమ్మహాత్ముని గురించి ప్రకటితములైనవి- అగుచున్నవి. కాని యా మహానుభావుని దైవసంపత్తి మీరావిష్కరించినట్లు ఎవ్వరును కావించి యుండరు. ఒక సమర్థునిచే దానిని మీరాంగ్లీకరింపించి ప్రకటించితిరేని లోకమున కుపకారమొనర్చిన వారగుదురు. ఈ సంగతిని గూర్చి 'స్వతంత్ర' పత్రికా సంపాదకునికి కాసా సుబ్బారావు గారికి ఇపుడే ఉత్తరము వ్రాయుచున్నాను.

శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు మీ రచనమును మా యింట నేను చదువ విని యచ్చెరువంది 'కవిత్వమన-ఇది' అని సెలవిచ్చిరి. నిన్నటి యుదయము నుండి యిప్పటివఱకు నా హృదయమున మీ వ్యాస పఠనము కారణముగా ఒక spell ఏర్పడి నన్ను లోఁగొన్నది. కావుననే తమకీ లేఖ వ్రాయుట-

నమస్సులు
విధేయుడు
(సం) మోచర్ల రామకృష్ణయ్య

# మహాత్ముడు

వేటూరి ప్రభాకరశాస్త్రి

ఇప్పుడు నేను చేయబోవు ప్రసంగంలోని చాలా అంశాలు అనుదినము మేము ప్రార్థనచేసుకొనే సమయాలలో నాలోనుండి ఉద్బోధ రూపముగా గోచరించినవే. నాతోడి మిత్రులకు ఆ గోచరించినవాటిని అప్పుడప్పుడే తెలుపు కొంటూనూ వచ్చాను. వాటిలో కొన్నింటిని అటు తర్వాత ఒకటి రెండు రోజులకు శ్రీ రాజేంద్ర ప్రసాదుగారు మొదలగువారు ప్రకటిస్తూ వచ్చారు. గాంధిగారి దివ్య ప్రబోధ బైటి రేడియోలలో వినబడక పోయినా వారి హృదయమునంటి యుండే వారికి వివేకముతో ఆత్మప్రబోధముల నాలకించేవారికి కొందరికయినా అంతరంగపు రేడియోలో అంతర్వాణిగా ఏక కాలంలో వినవస్తున్నవి అన్న సత్యం వెల్లడించడానికే ఇది నేను తెలిపింది.

మహావీరుడయిన గాంధి మహాత్ముడు అహింసా సత్య జ్ఞాన ప్రేమ ప్రకాశాత్మకుడై తనలో ఈశ్వరాంశమును ప్రజ్వలితపఱచుకొంటూ, హింసాసత్యాజ్ఞాన ద్వేష తమః కలుషితమైయున్న మానవ ప్రకృతిని అనేక రంగాలలో ఓడిస్తూ మానవతలో ఈశ్వరత్వమును నెలకొల్పుతూ యాభైయేళ్ళు విజయపరంపరతో వెలుగొందుతూ వచ్చి వచ్చి, తీరా స్వదేశంలోనే, తాను స్వాతంత్ర్యం తెచ్చిపెట్టిన స్వప్రభుత్వంలోనే, ప్రభుత్వానికి గుండెపట్టయిన ఢిల్లీ పట్టణంలోనే ప్రతిదినమూ ప్రపంచానికంతా సత్యాహింసాది సద్ధర్మములను రేడియోద్వారా ప్రసారిస్తూ భగవత్ప్రార్థన చేస్తూ ఉండే పవిత్ర స్థలంలోనే, తాను పుట్టిన హిందూ మతములోని హింసా స్వభావపు సారాంశ గుళికలయిన రివాల్వరు గుండ్లతో, బ్రాహ్మణాకారమయిన యకాల మృత్యువుచే హతమార్పబడినాడంటే, ఈ హతమార్పబడడం గాంధి మాత్రమే కాదు- ప్రపంచంలోని శాంతి సౌశీల్యాది సద్గుణ సముచ్చయమే హతమార్పబడడం, కంటిని రెప్పవలె పుణ్యాత్ములను కాపాడుతూ ఉంటాడనబడే భగవంతుడే హతమార్పబడడం.

గజేంద్రమోక్ష కథ కట్టుకథే కాబోలును. కాకపోతే గాంధి, రక్షణార్హుడు కాడా? ఆనాటిరాముడు, కృష్ణుడు, మహావీరుడు, బుద్ధుడు, క్రీస్తు, శంకరుడు మొదలయిన వారికంటె గాంధి తక్కువవాడా? వారిలో ఒకవేళ మచ్చలు కనిపెట్టవచ్చు నేమోకాని, గాంధీలో కనిపెట్ట వీలులేదే? గాంధి సర్వావతారములలోని సదంశ సారోద్ధారము కాదా? రామకృష్ణాద్యవతారముల నాటినుండి హిందూ మతములో చెలరేగుచున్న చెడుగును, హింసా ప్రవృత్తిని, నిర్మూల పఱచుచున్నందుకా గాంధిగారి నిట్లు కాల్చి చంపుట? బుద్ధుని కాలములో, క్రీస్తుకాలములో, నేడు గాంధి జరిపినంత అహింసా సిద్ధాంత వ్యాప్తి సాధ్యమయినదా? ప్రాచీనాచారపరులు బుద్ధుని బాధించుట, క్రీస్తును ధర్మసభలో విచారణ జరపి కొఱ్ఱను వేయుట, గాంధి మారణమునకు వెనుకబడినవి కావా?

ప్రపంచములో ద్వేషమారణములు తృటిలో సాధ్యములే కాని అహింసా నిత్యతలు అబ్బో ఎంత దుస్సాధ్యములుగా ఉన్నవి. నూటయిర్వది నూటయిర్వదైదు, నూట ముప్పదిమూడు ఇంకా నూట నలభై ఏళ్ళు

అంటూ జీవితాశను పెంపొందించుకుంటూ ప్రపంచ మంతటా అహింసా సత్యములను, ఈశ్వరభక్తిని ప్రతిష్ఠాపించపలెననుకుంటూ ఉన్నవానిని-

మన సారధి మన సచివుని
మన వీయసు మన యనుంగు మన బాంధవునిన్
మన విభుని గురుని దేవుని
మనమే తెగటార్చుకొంటి మా హాహాహా.

ఎవరెవరో కాదు హిందువే. బ్రాహ్మణుడే, ఆకస్మికపు మనోభ్రంశంతో కాదు. పెద్ద ప్రయత్నంతో, చంపినాడంటే బ్రాహ్మణజాతి కిరాత జాతికంటె అధః పతితమైనట్టయినది. పూజ్యతాచిహ్నమనుకొనే జందెం నాకిప్పుడు నింద్యతాచిహ్నంగా అవమానం కలిగిస్తోంది.

మొన్న జరిపిన ఉపవాసవ్రతంలోనే ఆయన చని పోవునేమో యని క్షోభిస్తూఉండగా మా ప్రార్థన సమయంలో నా అంతేవాసి కొకనికి 'అస్మిన్నేవలోకే ప్రతితిష్ఠతి' అని తైత్తిరీయ బ్రాహ్మణ శ్రుతివాక్యము వినబడింది. సంతోషించితిమి. నాటి బహిరంగసభలో ఒక మిత్రుడు.

"కలఁడందురు దీనులయెడ" అనే పద్యం తుది చరణంలో'కలడు కలండనెడు వాడు'అంటూ ఉండగా మీద చదువనీయక 'కలడీనాటన్' అని మార్పుచేసి నేను పద్యము ముగించితిని. ఇట్లా "గాంధి అమృత మయ శరీరుడు. అట్టి వానికి చావు ఉండదు." అనుకోవడం లోక ప్రవృత్తికి తల్లక్రిందైన వెర్రి వికారము కాలేదా? 'కాలేదు, కాలేదు,' అని ఇప్పటికీ నా అంతరాత్మ యెదురు తిరిగి నానోరు మూస్తున్నది. ఏమి గతి? ఇక, గాంధి చచ్చిపోలేదంటే ఎవరు నమ్ముతారు? ఈశ్వరుడున్నాడంటే ఎవరు నమ్ముతారు? గాంధి చచ్చి పోయినా ప్రపంచం ప్రాణంతో ఉందే? హస్తినా పట్టణమైనా భూకంపంతో అణగారలేదే? ఇత్యాది విధముల దుఃఖ సముద్రపు ఉప్పెన రేగుతూ ఉండగా అఘోరిస్తూ ఉన్న నన్ను పలువురు మిత్రులు సాయంకాలం మీటింగుకు పిలువ వచ్చారు. నా ప్రజ్ఞ ఎక్కడికో పోయింది. కనులు మూతబడ్డై. మేఘ మండల మంటుతూ ఉన్న అగ్ని జ్వాలల అంచలములందు జాజ్వల్యమానముగా గాంధిమూర్తి అడ్డపడి చేయెత్తి అగు. ఆ. ఆ. అనుచున్నట్లు గోచరించింది. ఏదో ఉన్నట్టుందే అని గుండె నిల్పుకొని ఈ సంగతి మిత్రులకు చెప్పాను. సాయంకాలం గాంధిగారి అగ్ని సంస్కార సమయంలో జరిగిన మీటింగులో మాట్లాడబోతే నాకు నోరాడలేదు. నాలోనే చితి మండుతూంది. కూడి ఉన్న అనేకుల హృదయాలలోనూ మండుతూంది. ఇప్పుడే మామా అజ్ఞానాంశములన్నీ మంట గలసి పోవునుగాక అని మొత్తుకొన్నాను. ఈ శ్లోకం జ్ఞాపకం వచ్చింది.

"అతర్ని రింధన సమింధన మేధమానే
మోహాంధకార పరిపంథిని సంవిదగ్నౌ
కస్మింశ్చిదద్భుత మరీచి వికాస భాసే
విశ్వం జుహోమి వసుధాది శివావసానమ్"

అయిపోయింది. ఇక గాంధి చైతన్యమూర్తి కాన రాదా? రేడియోలో ఇంక ఆయన దివ్యవాణి వినరాదా? ఉజ్జ్వల ప్రతిభకు ఊటపట్టు వట్టిపోవడమేనా? ఢిల్లీ రేడియోద్వారా సత్యాహింసల ముదులతో అల్లికగొన్న వలపు వలను ప్రపంచ మంతటా విసరుచూ ప్రపంచ మానవ మత్స్యములనన్నింటిని అవర్జించు కొంటున్న ఆ ధీవరుని వలత్రాడు తెగిపోవడమేనా? అందరూ ఆయన ముక్తుడైనా డంటున్నారు. ఊఁహూఁ నేనొప్పుకోలేను. ఆయన ముక్తి అంటే బౌద్ధుల నిర్వాణమూ, శరీరపు పంచభూతాంశాలూ పంచభూతాలలో కలసి పోయి జీవాత్మ ఆనందమయకోశం అంచుననో, దాని కావలనో లయమైపోయేటట్టు చెప్పే వేదాంతుల కైవల్యమూ కానే కాదు. ఎవడైనా ముక్తుడు కాదగిన వాడంటూ ఉండే వాడు సర్వ ప్రాణివర్గమునూ తనలో ఉంచుకొని సర్వప్రాణివర్గంలో తానూఉండి అందరనూ

కడతేర్చిన తర్వాత తాను కడతేరగోరేవా డవుతాడు. సృష్టి పుట్టిన తరువాత అట్టి పురుషుదెవ్వడూ ఇంత వరకూ వెలయలేదు. కనుక ఎవ్వడూ ముక్తి పొంద లేదు. జరామరణములు లేకుండా తనతోడి సర్వప్రాణి వర్గమునకూ ఇహలోకంలో స్వాతంత్ర్యం సాధించిన వాడే ముక్తుడు. వాడే ఈశ్వరుడు. 'బహుస్యాం' అని కోరికొని సృష్టి ఆరంభించినపరమాత్మ మళ్ళీ లయమై పోవడమేమిటి? గాంధిగారికి ముక్తి ఈ లోకంలోనే తననూ, తనతోడి లోకమునూ గట్టెక్కించుకోవడంలో ఉంది కాని తాను వేరువాసి ఎక్కడకో పోవడంలో లేదు. ఈ భావమునే గాంధిగారి భార్య కస్తూరిబా చని పోయినప్పుడు 'మాతృశ్రీ' అనే వ్యాసంలో కూడా వెల్లడించినారు. ఈశ్వరుడనేవాడు ఇప్పటికీ ఇంకా రూపు దాల్చలేదు. ఆయన సర్వసమర్థత అవ్యక్తంగా ఉన్నదేకాని తనకు ఎదురెత్తులెత్తుతూ సర్వవిధాలా ప్రతికూలురాలై వ్యక్తురాలై ఉండే ప్రకృతిలో ఇంకా రూప దాల్చలేదు. ప్రేమమయుడైన ఆ పురుషునికి ఆ గయ్యాళి పెళ్ళాం ఇంకా కట్టుకు అందలేదు. గాంధి శరీరంలో ఈశ్వరత ప్రవ్యక్త మవుతున్నది. అల్పా చ్ఛాదనంగానే మాయ అడ్డం ఉన్నది. అది కూడా ఆయనకు లోబడే కాలం వస్తున్నట్టున్నది అని అను కుంటూండగానే హఠాత్తుగా అది ఆయన గుండెను నొక్కివేసింది. ఇది దాని కడపటి దౌర్జన్యం కారాదా? గాంధిగారి జీవాత్మ తన అర్ధాంగితో కలసి పరి పూర్ణమై ద్వాదశాహస్సుదాకా భూమ్యుపరిభాగముననే ఉండి అంత అస్థులను మహానదీ ప్రవాహములలో కలిపిన పిదప పంచభూత సూక్ష్మాంశములతో భూమి సెంటరును, ప్రజా శరీరంలోని సెంటరును పొంది తన దివ్యవాణిని తన దివ్య రూపమును రేడియేట్ చేస్తుంది అని నా నిశ్చయం. ఈ సందర్భంలో గాంధి గారు రేపు చనిపోతారనగా బన్నూ శరణాగతుడొకడు వచ్చి 'మాకడగండ్లన్నియూ నీ మూలముననే, మమ్ము మాగతికి వదలి నీవుహిమాలయ పర్వతములకు వెళ్ళు'

అని కోపోక్తులాడగా గాంధిగారు 'నా హృదయకుహర ములో ఉన్న భగవంతుని ఆజ్ఞ తప్ప మరెవ్వరి ఆజ్ఞనూ నేను పాటింపను కొండలలో శాంతిని నేననుభ వింపగోరను. నన్ను నల్గడల ఆవరించిన సంక్షోభము నుండి యెంత శాంతి లభ్య మగునో అంత శాంతిని అనుభవించెదను. మీ మధ్యనే యుండెదను. మీరు హిమాలయమునకు వెళ్ళినయెడ మీసేవకుడనుగా నేను గూడ అచ్చటికి వచ్చెదను' అని బదులు చెప్పిరి. ఇది నా నమ్మకమును సమర్థించుచున్నది. పెక్కేండ్ల క్రిందట గాంధిగారన్న వాక్యమిది వేదాంత వాక్యంగా నేనెప్పుడూ మననం చేస్తూ ఉంటాను. 'జనరల్ డయరు నన్ను చంపుటకు రివాల్వరు గురి చూచు కొంటూ దూకుడుతో అపమార్గమున వస్తూ ఉంటే త్రోవలో పాము అతని కాలు చుట్టుకొని కాటు వేస్తూ ఉంటే, అతడు ధానిని చూడజాలక కోపోద్రేకంతో నా మీదికే దూకుతూ ఉంటే నిర్భయముగా నేను చేర బోయి పామును తొలగించి కాటు విషమును నోటితో పీల్చి ఉమిసి వాని ప్రాణమును కాపాడుదును. పామునూ చంపను.' ఇది నా అహింసా సిద్ధాంతపు పరమ లక్ష్యము. ఈ వాక్యమూ దీని నుండి ఇపుడు తీయ వలసిన సారాంశమేమిటి అన్న ప్రశ్నా, సమాధా నమూ, నాలో గోచరించినవి. నాడు గాంధీగారు డయ రునే యెఱిగిరి కాని, వాని తాతల తాత గాడ్సే వెలయనున్నాడని యెరుగరైరిగదా. గాంధిగారి సంక ల్పము ననుసరించే టట్టయితే గవర్నమెంటు గాడ్సేను తదనుయాయులను సంరక్షించి చక్కబఱుపవలెను. మారణానికి రక్షణమూ, నిప్పుకు నీళ్ళూ, ద్వేషానికి ప్రేమా ప్రతిక్రియలు. మారణ ద్వేషములు అనిత్య తను గొలుపునవి. రక్షణప్రేమలు నిత్యతకు చేర్చునవి. లోకంలో మారణతంత్రం గాంధిగారి మారణంతో నైనా మాసిపోవలెను. గాడ్సేకు ఉరిశిక్ష తప్పి నప్పుడు లోకంలో ఇక ఉరిశిక్షకు చొప్పడదగినవాడు ఎవ్వడూ ఉండడు. గాంధిగారి మారణానికి జ్ఞాపకంగా

ప్రపంచరాజ్యాలన్నింటినీ కూడా మరణ శిక్ష అనే అధర్మ కృత్యం ధర్మశాస్త్ర శిక్షాస్మృతుల నుండి తొలగిపోవలెను. అయితే ఇక గాడ్సేవంటి వారిని ఏమి చేయవలెను? అంటే గాంధిగారు పెక్కేండ్లు కారాగారాల్లో వసించినారు. గాంధిగారి పేర కారాగారాలన్నీ సబర్మతీ ఆశ్రమాలుగానూ, వార్ధా ఆశ్రమాలుగానూ మారిపోవలెను. మతపు వెర్రెత్తి పిచ్చి చేష్టలు చేస్తున్న గాడ్సే ప్రభృతులను ఆ ఆశ్రమాలలో ఉంచి గాంధిగారు ఆశ్రమవాసులకు ఇచ్చిన శిక్షణ ఇవ్వవలెను. శరీరబాధ ఎవ్వరికీ కలిగించరాదు. గాంధిగారు తమ ఆశ్రమానికి వచ్చిన కొత్తవారి అందరిచేతా కొన్ని వారాలపాటు ఆశ్రమానికి పాకీపని చేయించేవారట. వీరందరిచేతా తొలత ఆ పని చేయింపవలెను. సౌత్ ఆఫ్రికాలో జెయిలులో గాంధిగారూ పాకీపని చేసినారు తెల్లవారుజామున 4కు లేచి రాత్రి పడుకునేదాకా ఎంతెంత కార్యకలాపంతో గాంధిగారు ఉండేవారో ఎన్ని గంటలు పని చేసేవారో వారిచేత చేయింపదగిన కార్యకలాపం అంతంతా అన్ని గంటలూపని చేయింపవలెను. సాయంప్రాతస్సమయప్రార్థనలు వారిచేత జరిపింపవలయును. వారిచేత గాంధి చరిత్ర బోధలు చదివింపవలయును. తెలియ బోధింపవలెను. మతపిచ్చి కుదిరి గాంధీతత్వము వారిలో ప్రతిష్ఠితమైనదని స్పష్టమయ్యేదాకా వారి నీశిక్షలోనే ఉంచవలయును. ప్రపంచంలోని మానవులందరూ గాంధిగారి శరీరంలోని అణువులు ప్రపంచంలో దేశాలన్నీ వారి శరీరంలోని అవయవములు. అందులో హిందూ దేశం వారి రొమ్ముపట్టు.హిందూ మహమ్మదీయ ప్రజా సంఘం వారి ఊపిరితిత్తులు. వానిలో క్షయక్రిములు పెరిగినవి. రక్త వమనాలవుతున్నవి. మొన్నటి ఉపవాసం ద్వారా వారు తమ గుండెకాయను అంటే ఢిల్లీని. ఢిల్లీ ప్రభుత్వ వర్గాన్ని చక్క జేసికొని బలపరచుకొన్నారు. అక్కడనుంచి నిర్మల రక్తాన్ని రెండు ఊపిరితిత్తులకూ పారించుకొని అక్కడి క్షయపు పళ్లికలను మాన్పుకొని క్రమంగా రక్తక్షయమై ఉన్న శరీరాన్నంతనూ అంటే ప్రపంచాన్నంతనూ ఇంకా నలభై యాభై యేండ్లు జీవితం వృద్ధి పరచుకొంటూ సంరక్షించుకొని, ముక్తతను పడయగల్గుదుమనుకొన్నారు. ఊపిరితిత్తులలోని క్షయ శీఘ్రక్షయ అంటే గాలపింగ్ టీ. బీ. కావడంచేత సాగలేదు. వారు గాడ్సే ప్రభృతులను వారి శరీరాణువులుగానే భావిస్తారు. గాంధిగారి మరణంలో ఈశ్వర సంకల్పం గూఢంగా ఏదో ఉన్నట్టుంది స్థూల శరీరంతో ఉండి గాంధిగారు ఏండ్లలో చేయదలచుకొన్న పనిని సూక్ష్మ శరీరంతో రోజులలో వారాలలో కాకపోతే నెలల్లో నిర్వహించగలిగేటట్టున్నారు. అది చేసేదాకా వారు ముక్తులు కారు. సర్వలోకము వారి ముక్తి. 'భగవంతుడు హిందూ మతమును రక్షించడానికి ఎవరినైనా సృష్టించి ఉంటే ఆ సష్టింపబడ్డవాడను నేనే ఔతాను' అన్నారు. ఇది మఱవరాని మాట. రామాయణశ్లోకమిది. 'రామోరామో రామ ఇతి ప్రజానామభవన్ కథాః రామభూతం జగత్సర్వం రామే రాజ్యంప్రశాసతి'—అది యెప్పటిమాటో ఎటువంటిదో కాని నేడు 'గాంధిర్గాంధి ర్గాంధి రితి ప్రజానా మభవన్ కథాః గాంధి భూతం జగత్సర్వం గాంధి హృద్గ్రంథి భేదనే' అన్నట్టుంది.

సృష్టి పుట్టిన తరువాత ఉత్తర ధ్రువము నుంచి దక్షిణ ధ్రువముదాకా ఇండియా నుండి అమెరికా దాకా ఉండే భూ ప్రపంచపు టంచుల నంటి ఉన్న మానవతలో పసిబిడ్డల దగ్గరినుంచీ పామరుల పగ్గరనుంచీ ఏకకాలంలో ఏక కంఠంతో ఎవరి వియోగం గురించియైనా అనుతాపంతో కన్నీటి ధారలు ఇన్ని కారి ఉంటవా?

గాంధిగారి మహత్తును ఇది వెల్లడించుట లేదా?

భారతదేశానికి బైట ఉండే ప్రపంచంలోని సర్వ మతాచార్యులూ తమ సంక్షోభాన్ని వెల్లడిస్తున్నారు గాని హిందూమత మతాచార్యులలో ఎవరైనాగాని గాంధిగారి గురించి పల్లెత్తు పలుకైనా పలికిన పుణ్యం కట్టుకోలేదు గదా. మన తల్లి హిందూ మతశక్తి కడుపున పుట్టిన బిడ్డలే జైన బౌద్ధమతములు. ఆమె వెయ్యి

యేండ్లపాటు తన బిడ్డలయిన ఆ జైన బౌద్ధమతము లను దయాదాక్షిణ్యములు లేక తెగటార్చివేసుకొన్నది. ఈ కడుపుకోత దుఃఖమును తానే యిటీవల వేయేండ్ల నుండి అనుభవిస్తూ ఉన్నది మహమ్మదీయమతముచేత. పూర్వం కాళికామూర్తిని ధరించి రక్త పిపాసతో చెలరేగి బౌద్ధ జైనమతాలను సర్వనాశనం చేసింది వంగదేశంలో. నవకాళి వగైరా స్థలాల మొన్నటి అవస్థలు దాని ప్రతిఫలితాలే. గంధి పాదస్పర్శచే ఆ స్థలాలకు పవిత్రత వచ్చి మళ్ళీ ఊసురు నిలిచింది. "దత్తపరా" అనే ఊరు అక్కడ బుద్ధుని దంతంతో స్థూపం కట్టిన పట్టు కాళికాదేవి మూర్తితో హిందూ మతం ఆ స్థూపాలనే కాక బౌద్ధుల నెందఱినో అక్కడ నాశనం చేసింది. ఆ స్థలం చూచి గంధి కన్నీరు కార్చినాడు. బౌద్ధ విహారములతో మహావీరుని మహా వ్రతములతో పవిత్రమైనది బీహారు దేశం. మహా వీరుడు అఘోరోపవాస వ్రతములు జరిపిన చంపా పట్టణమే నేటి చాంపరాన్. అక్కడనే గాంధి ప్రథమ సత్యాగ్రహం జరపింది. అక్కడ జైన బౌద్ధ మత ములు సర్వనాశనమయినవి గదా. ఆ దేశమంతా భూకంపాలతోనూ మహాహింసలతోనూ ఈ మధ్య ఎంత పాడైంది. గాంధారము, పంజాబులలో పూర్వం బౌద్ధ మతం రూపు మాపబడ్డదిగదా. దాని ఫలితమే కదా అక్కడి నేటి దుర్గతి. హిందూమాత వీరశైవ వేషంతో హైద్రాబాదు బళ్ళారి ప్రాంతాలలో జరిపిన క్రూరకృత్యాల ఫలితాలుగావా విద్యానగర వినాశాదిగా అక్కడి హిందువులు నేడు అనుభవిస్తున్న కష్టాలు? కృష్ణాతీరంలోని ఎన్ని బౌద్ధారామాలు నాశం చేయ బడ్డవి. వాటి ఫలితంగాదా ఇటీవల ఎన్నో దేవాలయాలు నాశనం కావడం. పూర్వం బుద్ధుని భస్మశేషపు పంప కాలకోసం యుద్ధాలు జరిగినట్లు చరిత్ర చెప్పుతున్నది. నేడు గాంధిగారి భస్మశేషాన్ని దేశానికి పంచిపెట్ట వలసిందని మన మిత్రులు కొందరు కోరుతున్నారు. వారు అర్ద్రహృదయంతోనే అడుగుతున్నారు గాని అది జరగ గూడనిపని. వాటికోసం కొన్ని దేవాల యాలూ, పూజాపురస్కారాలూ, నైవేద్యాలూ, ఊరే గింపులూ, ఈ అన్నింటికై తగాయిదాలూ - గాడ్సేవంటి వాడే ఎవడైనా ఆభస్మం చెడగొడితే పెద్ద అల్లకల్లో లాలూ, అయ్యయ్యో ఇక జరుగరాదు. చేతనతోఉన్న గాంధిని చంపుకొన్న హిందూమతం మళ్ళీ ఆయన బూడిదను నిలుపుకోవడం ఏమిటి? పూర్వం రాణా ప్రతాపుడు రాజ్యంకోసం లక్షలకొలది స్వబలాన్ని, సైన్యాన్ని, చంపుకొని దేశభ్రష్టుడై పారిపోతూ ఇంత స్వదేశపు మట్టి నెత్తిమీద పెట్టుకు పోయాడట. లక్షలకొలదిప్రాణులను మంట గలపుకొని అమన్నెత్తు కొని పోయి ఏమి చెయ్యడం? రాణా ప్రతాపు, శివాజీల భావౌద్ధత్యాలు ఈ కాలంలోపనికిరావు.

గాంధిగారు ఇతరులెరుగని స్వచరిత్రను లఘు వుగా యే కొంచెమో వ్రాసినారు. కాని సరిగా వ్రాస్తే వారి చరిత్ర శతకోటి ప్రవిస్తరము. గాంధిగారు స్వయ ముగా వ్రాసినదానికి తర్వాతది, వారి దగ్గరివారు లిఖిత పరచి ఉంచినది వారిచరిత్ర యెన్నోవాల్యుములు కాదగినది ఉంటుంది. పసితనము నాటినుండి గాంధి గారితో పరిచయము కలవారెందరో వారివారి దృష్టి ననుసరించి, వారివారి యెరుకకందిన గాంధి చరిత్రము లెన్నో వ్రాయగలరు. గాంధిగారికి వచ్చిన జాబులు, వానికి వారిచ్చిన బదుళ్ళు, యెంగ్ ఇండియా, హరి జన్ పత్రికలలో వారువ్రాసిన వ్యాసాలు, అక్కడక్కడ ఇచ్చిన ఉపన్యాసాలు, ప్రార్థనప్రసంగాలు చేర్చి ప్రక టిస్తే, అందంతా ఒక మహత్తరమైన సారస్వత మవుతుంది.

'చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్'

అన్నది రాములవారి కుటుంబకథకు, ఇరవై యేండ్లలో జరిగిన దానికి, సంబంధించినది. ఇప్పుడు ప్రపంచానికంతకూ సంబంధించినది యాభై యేండ్ల పాటు జదిగినదీ గనుక-

'చరితం గాంధిదేవస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్'
అనదగదా?

ప్రపంచంలో యిప్పటికి క్రీస్తువేదంకంటె మహా వ్యాప్తికల గ్రంథం సర్వభాషలలో పరివర్తితమయిన గ్రంథం వేరొకటి లేదంటారు. గాంధి చరిత్ర దాన్నెన్నో రెట్లు మించి పోతుంది గవర్నమెంటు వారు ధనం సేకరించి సర్వభాషలలోనూ చక్కగా అచ్చువేసి కారుచౌకధరకూ, వీలయితే ఊరికే కూడా దానిని లోకమునకు పంచిపెట్టవలెను.

మోతీలాలు నెహ్రూ మొదలుగా ఎందరో మహనీయులు చని పోయినప్పుడు ఇంకా ఏవేవో సందర్భములలోను గాంధిగారు వారివారి కిచ్చిన టెల్లిగ్రాములన్నీ సేకరించి ప్రకటిస్తే ఒక మహా సారస్వతరత్నరాశి అవుతుంది. నేడు గాంధిగారు చనిపోయినందుకు ప్రపంచ వాసులందరూ వెల్లడించిన హృదయ క్షోభ ఒక మహా సారస్వతరత్నరాశి అవుతుంది. ఇక భవిష్యత్కాలంలో దివ్య సారస్వతం వెలయడానికి ఈ రచనలన్నీ ఊటపట్లవుతవి. శాశ్వత సారస్వత జనకుడు గాంధి అవుతాడు. పిదపకవిత్వా లిక చిదికిపోతవి.

రెండు మూడు రోజులలో చనిపోతారనగా ప్రకాశంగారితో అన్నట్టు ఆంధ్ర ద్రవిడ రాష్ట్ర విభాగం కొంత అటో యిటో ఏలాగయితేనేమిఉభయ రాష్ట్రాల వారూ మనం ఒకళ్లమే భాషామూలకపరిపాలనకోసం విభక్తులమవుతున్నామని గుర్తించుకొని హృదయంలో గాంధిగారి దివ్యానురాగం ప్రతిఫలింప జేసుకుని సామరస్యంతో పరిష్కరించుకోగలరుగాక. ఉభయుల సామరస్య పరిష్కార చిహ్నంగా నాగేశ్వరరావు గారి శ్రీ బాగ్ గాంధి విహారం కావాలి. గాంధిగారి అనురాగాన్ని గుర్తిస్తే హైద్రాబాదు రాజ్యం వివేకం గలిగి వర్తిస్తుంది. కాశ్మీర వ్యవహారం సమరసంగా పరిష్కారం అవుతుంది. పాకిస్థాన్ యూనియన్‌లు అన్యోన్యమిత్రతతో సామరస్యంతో వర్తించగలుగుతారు. ఇవన్నీ గంధి దివ్యసంకల్పబలంతో సాగితే గాంధి క్షేత్రమైన ఢిల్లీయే, గాంధిచితియే ప్రపంచ రాజ్యాల తగాదాలను తీర్చే ప్రపంచ రాజ్య సామరస్య స్థాపక స్థానం అవుతుంది. ఇదంతా కోటానుకోట్లు గంధులు తయారుగావడంలో ఉంది.

దక్షిణాఫ్రికాలో, ఇండియాలో, యూరపులో,ఇంకా ఎక్కడెక్కడ ఏయే నగరాలలో, గ్రామాలలో, ఇండ్లలో గాంధిగారు అడుగుపెట్టి ఒకరోజయినా ఉన్నారో, ఏయే సభలలో ఉపన్యసించినారో, ఏయే జైళ్ళలో వసించినారో, ఏయే స్థలాలలో సత్యాగ్రహయాత్రలు జరపినారో అవన్నీ పుణ్య క్షేత్రములవుతవి. అక్కడంతా గాంధి విహారములు వెలుస్తవి. ఆ విహారములలో హిందువులు, మహమ్మదీయులు, క్రిష్టియనులు, అన్ని మతాలవారు సాయం ప్రార్థనలు జరపుకొంటూ ఉంటారు. ఆ అన్ని చోట్లా ఆ పుణ్యమూర్తి విగ్రహములు వారికి జ్ఞాపకార్థమై వెలయవలయును. కాని వానికి నైవేద్యాలూ, అగమ పూజలూ ఉండరాదు. అన్నాద్యాహారములు అన్నమయకోశముతోగాని ఈశ్వరాత్మతను బడసినవారికక్కఱలేదు.గాంధివిహారములలో ఆయా దేశభాషలలో పరివర్తితమైనగాంధి సారస్వతము వెలయవలెను. వాని పాఠ ప్రవచనముల కాలక్షేపము అక్కడ జరుగుచుండవలెను. వేదములు, ఖురాను, బైబిలు మొదలగు మతముల గ్రంథములన్నీ ఆ విహారములలో వెలయవలెను. వాని పరిశీలన అక్కడ జరుగుచుండవలెను. వాని అన్నింటి సారము గాంధి మతమగుట గుర్తింపబడవలెను. ఆ విహారములు నలుదెసలను విద్యాశాల, వైద్యశాల, ప్రార్థనశాల, సత్రశాల, వాని ప్రయోజనములను సమర్థించునవిగా వెలయవలెను. నేటి దేవాలయములు కూడా నీ విధానమునకు దొర్లివచ్చి మారిపోవచ్చును. నేడు గుళ్ళలో దేవునిపేర జరిగే ప్రతారణములిక జరగజాలవు, సర్వమతములు నిజనిర్మల స్వరూపములతో సామరస్యము పొంది

గాంధి మతములో సమన్వితములు కాగలవు. అంటే హిందూ మతములోని మాలిన్యము హింసాస్వభావము అంతరించి విశ్వవ్యాపకము కాగలదన్న మాట. ఈ విధంగా గాంధి విహరించిన ప్రదేశాలన్నీ గాంధీ విహార ములుగా వెలయడానికి ముందుగా, వడివడిగా, ఢిల్లీలో గాంధిగారు పడగొట్టబడినమసీదుల పునరుద్ధరణము జరపించినట్లు హైదరాబాదు దేశంలో, ఇంకా అనేక స్థలాలలో పాడయి పోయిన సుందర శిల్ప రేఖలతో ఇంకా విరాజిల్లుతూ ఉన్న జీర్ణ దేవాలయాలను ఆయా చెడ్డగొట్టినరాజ్యాలవారుపునరుద్ధారముజరపి,వానిపూర్వ విగ్రహములతో పాటు గాంధిమూర్తినికూడ ఉంచి వానిని గాంధి విహారములు కావింపవలెను. కృష్ణాతీర మున, ఇంకా ఇతర స్థలాలలో హిందువులచే నాశపరు బడిన బౌద్ధారామస్థూప విహారాదులు, జైన వసతులు, శక్యమయినంతవరకు జీర్ణోద్ధారణ పడయవలెను. వాటిలో ఆయా పూర్వ మతాచార్యుల చిహ్నములతో పాటు గాంధిగారి గ్రంథ సంచయము, మూర్తి కలసి ఉండవలెను. కాని వానికి షోడశోపచారాలు, నైవేద్యాలు ఆగమపూజలు ఉండరాదు. గాంధిగారిని గూర్చి బహిరంగముగా చేసే యోచనలు ప్రతిష్ఠాపనలు, సభలు, ఉపన్యాసాలు మొదలయిన వాటికంటె ప్రతి మనిషి వారిని గూర్చి అంతరంగంలో యోచనలూ, ప్రతిష్ఠాపనలూ ముఖ్యంగా జరుపుకోవలెను. కడపటి ఉపవాస సమాప్తి సమయంలో 'నన్ను సత్యం ముం దుండి నడిపిస్తోంది' అని గాంధిగారు చెప్పినారు. ప్రతి ధర్మ సందేహంలోనూ ఇలాటప్పుడు గాంధి ఏం చేస్తాడు? అని మనంయోచించి చూచుకోవాలి. తెలియక పోతే ప్రార్థనలలో ప్రార్థించి చూడాలి. ఈశ్వర ప్రార్థ నలు లేక పోతే నాస్తికుల మవుదుము. గాంధిగారిని అను సరింప దలచేవారు అతిముఖ్యంగా పాటించవలసింది భగవత్ప్రార్థనము. గాంధిగారి అనుయాయులు పలు వురు వారి వెలుగే మాకు దారి చూపుతుందంటున్నారు. గాంధిగారికి దారి చూపిన వెలుగు భగవత్ప్రార్థనము.

'సర్వకర్త యా నీశ్వరేశ్వరుని దివ్య
తేజము వరేణ్యమును వినుతింతు మెపుడు
ఇదిగదా లోనుండి మా కెపుడు మంచి
మంచి యుద్బోధముల నొదవించు నంచు'



"కవిత చింతపండు కాదు, మామిడి పండు
కాదు,కాదువెండి, కాదు పైడి.
అమృతధార, రేడియము, భగవంతుడున్
వలె, సుదుర్లభంపు వస్తు వదియు.
అది అకృత్రిమమై, దివ్యమై. పవిత్ర
మై, శివేతరక్షతి కరమై పరార్థ
సాధకంబై రహించు- నాసత్పదార్థ
మబ్బినత డిష్టసంపద ప్రబ్బినతఁడు"

పే.ప్ర.

# పావులూరి గణితం-ప్రభాకరశాస్త్రిగారు

-ఆచార్య తిమ్మావజ్ఝల కోదండ రామయ్య

తెలుగు సాహిత్యానికీ, చరిత్రకూ గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరి శాస్త్రిగారు చేసినసేవ విస్మరింప రానిదీ, విలువ కట్ట లేనిదీ. ఇంచుమించుగా నాలుగు దశాబ్దాలపాటు వారు పయి రెండు రంగాల్లోనూ నిజంగా వీరవిహారమే చేశారు. ఏన్నో యెన్నో విషయాలను, కొత్త విషయాలను వారు తవ్వి తలకెత్తారు. సాహిత్య విషయకంగా వారు చేసిన పరిశ్రమ బహుముఖీనమయింది. వారు తెలుగు పలుకుబడికీ, నుడికారానికీ నెలవయిన కమ్మని కవితలు వెలయించారు. తాళపత్రాలలో చివికి జీర్ణిస్తూ ఉండిన ప్రాచీనాంధ్ర గ్రంథాలను సముద్ధరించి ప్రకటించారు. శాసనాలను వెలికి తీసి వెలుగులోనికి తెచ్చారు. దేశం నలుమూలలా తిరిగి తాళపత్ర గ్రంథాలను సేకరించారు. ఆ నోటా, ఆ నోటా విన్న చాటువులను సేకరించి తెలుగు వారికి తొలిసారిగా చాటు వినోదపు విందు సంతరించారు. ప్రాచీన కవుల గ్రంథాలకు వివిధ విషయ సముల్లసితములయిన విపుల పీఠికలు వెలయించారు. అనేకానేక తెలుగు కవులకూ, సంస్కృత కవులకూ సంబంధించి ఎన్నో నూతన విషయాలను తెలుగు వారి ఎరుకలోనికి తెచ్చారు. గ్రంథ పరిష్కరణ కళ వారికి వెన్నతో పెట్టిన విద్య. పండితవర్యుల చిన్న చూపునకు పాల్పడిన జానపద సాహిత్యమును సమర్థించారు, సముద్ధరించారు. వాటి లక్షణాలను ప్రాచీన గ్రంథాలనుండి ఎత్తి చూపి సమన్వయించారు. గ్రంథ గ్రంథుల నెన్నిటినో ముడి విప్పి ముందు పెట్టి సదర్థపు చూ అలిచ్చారు. తెలుగు పలుకుబడులనూ, నుడికారములనూ జనుల వ్యవహారంలోనుండి 'గాలికబుర్లు'గా పోగు చేశారు. నోటి తెలుగే నేటి తెలుగని యెలుగెత్తి చాటారు. తాళ్లపాక కవుల సంకీర్తనాది వాఙ్మయాన్ని వారి జీవిత సన్నివేశాదుల వివరణ సమన్వయాలతో తెలుగువారికి తొలిసారిగా పరిచయం కలిగించారు. లక్షణజగదుద్ధారమును సంకల్పించిన భూవరాహకల్పులు వారు! తెలుగు సాహిత్యంలోని వివిధ రంగాలలో వారి ప్రమేయం లేని అంశం యేదీ కనబడదు. ఏ రంగం తీసుకున్నా దానిలో కీ శే. ప్రభాకరశాస్త్రిగారి అమృతహస్తం ఉండక తప్పదు. ఆయా విషయాలను గూర్చి వారు ఏనాడో చేసిన ఊహలూ, సిద్ధాంతాలూ నిజం కావడం, ఇటీవలి పరిశోధనలలో ప్రామాణికతను సంతరించుకోవడం వారి సునిశిత సత్య దృష్టికీ సమ్యగ్దృష్టికీ చక్కని తార్కాణం. వారు గతించిన ఇంచుమించుగా మూడు శాబ్దాలకు తరవాత ఒకసారి వెనుతిరిగి చూస్తే వారి సాహిత్య మూర్తి మేరుపర్వతమంత మహోన్నతంగా దర్శన మిస్తుంది.

గురుదేవులు ప్రభాకర శాస్త్రిగారు పరిష్కరించి ప్రకటించిన గ్రంథాలలో 'పావులూరి గణితం' ప్రముఖమయింది అసలు, వారు మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో 'తెలుగు పండితులు'గా ఉద్యోగంలో ఉన్నప్పుడే ఈ గ్రంథానికి సంబంధించిన తాళపత్ర ప్రతులను పరిశీలించవలసిన అగత్యం అంటూ ఒకటి యేర్పడింది. కంధుకూరి వీరేశలింగం పంతులు

గారు పావులూరి మల్లన కాల నిర్ణయంలో పడిన పొరపాటును ఎత్తి చూపి మల్లన కాలనిర్ణయం చేయడానికి అవసరంకొద్దీ వారు ఆ గ్రంథాలయంలోని తాళపత్ర ప్రతులను పరిశీలించవలసి వచ్చింది. ఆసందర్భంలోనే నన్నయకు కొంత యిటీవలి వాడయిన మల్లన పావులూరి గణితాన్ని ఏనాటికయినా సంపాదించి ప్రకటించాలనే సంకల్పం వారికి కలిగి ఉంటుందని తోస్తుంది. కానీ, ఆ సంకల్పం కార్యరూపం దాల్చడానికి చాలా కాలమే పట్టింది మరి.

శ్రీ శాస్త్రిగారు తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యా పరిశోధనాలయంలో ప్రధాన తెలుగు పరిశోధకులుగా నియమితులయినప్పుడు తమ పరిశోధన కార్యంలో భాగంగా 'పావులూరి గణితం' పరిష్కరణ కార్యాన్ని చేపట్టారు. దీనిని వారు చేపట్టడానికి అది ముద్రితం కాని ప్రాచీన గ్రంథం అవడం ఒక్కటే కారణం కాదు. అప్పుడు ప్రాచ్య విద్యా పరిశోధనాలయానికి అధ్యక్షులుగా ఉండిన శ్రీ పరవస్తు రామానుజస్వామిగారికి కూడా దానిమీద ఒక ప్రత్యేకమయిన శ్రద్ధా, ఆసక్తీ ఉండేవి. పావులూరి గణితానికి సంబంధించిన వ్రాత ప్రతులలో నుండి ఉద్ధరించి వారే గ్రంథారంభ భాగాన్ని ఒకఫారం మాత్రమే ముద్రించి యేకారణం చేతనో ముద్రణం కొనసాగించ లేదు.

['Even while the Late Mr. M. Rangacharya was editing the Ganitasara sangraha of Mahaveeracharya in the first decade of this century, my brother S.P.L. Narasimhaswami of Visakhapatnam collected several Manuscripts of this Sarasangraha ganita by Pavuluri Mallana, and later he began to publish it and printed about 16 pages. But the enterprise had to be given up for want of funds'

Preface P1. of Sarasangraha ganitam by P. V. Ramanuja Swami. Director S V.O.R. 1, Pub 1952]

ప్రభాకరశాస్త్రిగారు దానిని పరిష్కరించి ప్రకటించాలనే తమ అభిప్రాయం చెప్పగానే శ్రీ రామానుజస్వామి గారు ఎగిరిగంతువేసి 'అది చాలా అవశ్యం పరిష్కరించి ప్రకటింప వలసిన గ్రంథం' అంటూ తమదగ్గరున్న వ్రాతప్రతులనూ.ముద్రితమైన ఫారాన్నీ శ్రీ ప్రభాకరశాస్త్రి గారి కిచ్చి ఆకార్యం చేపట్టి సాధించ వలసిందిగా అభ్యర్థించారు. శ్రీ ప్రభాకరశాస్త్రి గారు వెంటనే కార్యోన్ముఖు లయ్యారు.

అప్పుడు మదరాసులో ప్రాచ్యలిఖిత పుస్తకాలయం ప్రపంచ యుద్ధభయంవల్ల తిరుపతికి తరలింపబడి తిరుపతిలో పనిచేస్తున్నది. శ్రీ ప్రభాకరశాస్త్రి గారికి పరిశోధన కార్యంలో తోడ్పడటానికి నామిత్రుడు, ఇటీవలే కీర్తిశేషుడు, శ్రీ తిరుమల పంచాంగం భాష్యకారాచార్యులు గారు సదరు పరిశోధనాలయంలో తెలుగు పరిశోధక విద్యార్థిగా నియమితులయ్యారు. శ్రీ శాస్త్రిగారి ఆదేశం మేరకు శ్రీ భాష్యకారాచార్యులు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారానికి పోయి అందులో పావులూరి గణితానికి సంబంధించిన వ్రాత ప్రతులను పరిశీలించడం ఆరంభించారు. అందలి వివిధ గణిత భాగాలను కాపీచేసి. ఇతర వ్రాతప్రతుల లోని భాగాలతో సరిచూచి చాలా ప్రామాణికంగా పాఠాంతరాలను గుర్తించి వాటిని ప్రత్యేకంగా పద్య సంఖ్యాది వివరాలతో గుర్తించి సిద్ధం చేసారు. ఈ లోగా, శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమ సంకల్పాన్ని తెలుపుతూ దేశంలో ఎవరి దగ్గరనైనా పావులూరిగణితం తాలూకు తాళ పత్రప్రతులు ఉంటే తెలియజేయ వలసిందిగా పత్రికా ప్రకటన యిచ్చారు. అది అంత ఫలప్రద మయినట్టుగా కనబడదు. శ్రీ ప్రభాకరశాస్త్రి గారికి దానివిషయంగా కొన్ని ఉత్తరాలు రావడం మాత్రం గుర్తుంది. ఈలోగా యుద్ధభయం తొలగడం మూలాన తిరుపతిలో తాత్కాలికంగా పని చేస్తూండిన ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారం మరలా మదరాసుకు తరలించబడింది. తిరుమల తిరుపతి దేవస్థానం వారి

అనుమతి పొంది శ్రీ ప్రభాకరశాస్త్రిగారు నన్ను కొన్ని రోజులపాటు మదరాసులో ఉండి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని ఇతరగణితభాగాలను కాపీచేసుకొని రమ్మన్నారు. అలా అక్కడ ఉన్నప్పుడు నేను శ్రీ వేదం లక్ష్మీనారాయణ శాస్త్రిగారిని కలుసుకున్నాను. వారు అప్పటికే వావిళ్లవారికొరకై లీలావతీగణితం పరిష్కరించి ఉన్నారు. వారిదగ్గర కొన్ని సందేహాలు తీర్చుకొని వచ్చాను. భారతిలో చాలాకాలం క్రితం శ్రీ వేమూరి విశ్వనాథ శర్మగారు 'పావులూరిగణితం' గురించి ఒక వ్యాసంవ్రాస్తూ అందులో పరికర్మ గణిత భాగాన్ని బెంజమిన్ హైవ్ అనే ఆతడు ఇంగ్లీషు లోనికి అనవదించినట్లు తెలిపారు. దాని విషయమై శ్రీ లక్ష్మీణరాయణ శాస్త్రిగ రిని అడిగాను. తాముకూడా ఆ గ్రంథం చూచామన్నారు కానీ ఎక్కడ చూచారో చెప్పలేక పోయారు. ఇప్పటికీ నాకు ఆ గ్రంథం లభించలేదు. ఇలా మదరాసులో 'పావులూరి గణితం' గురించి కొంత పని చేసుకొని వచ్చాను శ్రీ శాస్త్రిగారి ఆదేశంమీద. ఇలా 'పావులూరి గణితం' పరిష్కరించడానికి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు రంగం సిద్ధం చేసుకున్నారు.

అప్పుడు నేను తిరపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యాలయంలో వారి విద్యార్థిని. అప్పటితో ఇంగ్లీషు చదువుకొని, ఆ తరువాత ఆవిద్యాలయంలో చేరిన విద్యార్థులు కొందరిలో నేను ఒకణ్ణి. నాకు గణిత శాస్త్రంలో కొంత అభిమానం ఉండేది. లెక్కలలో మంచి మార్కులు రావడం దానికి కారణం. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు పావులూరిగణితం పరిష్కరించడానికి ఆరంభించారు. వారి ఇంట అంతేవాసిగా నేను సతతమూ వారి వెంట ఉండేవాణ్ణి. మహావీరాచార్యుల గణితసార సంగ్రహం- శ్రీ రంగాచార్యులుగారు ఇంగ్లీషులో అనువాదంచేసి ప్రకటించినది—వారు నాకు ఇచ్చారు. పావులూరి గణితాన్ని దానితో సరిచూచి అనువాద విషయముగా కానవచ్చిన విశేషాలను వ్రాసి ఉంచడం, అందులోని లెక్కలువేసి ఆ యా పద్యాల కింద యిచ్చిన వర్కింగు వివరాలు సరి అయితే రూఢి చేయడం, తప్పయితే సరి చేయడం నాపనిగా నిర్ణయింప బడింది. నేను నడుం కట్టి ఆకార్యం చేయడం ప్రారంభించాను. వర్గువు, వర్గుమూలం లెక్కకట్టడానికి మామూలు పద్ధతులనే అనుసరించి నేను తంటాలు పడుతూ ఉంటే శ్రీ ప్రభాకరశాస్త్రిగారి జ్యేష్ఠ పుత్రులు శ్రీ వేటూరి సుందరమూర్తిగారు Mathematical Table చూచి లెక్కలు సరి చూచే సులభపద్ధతి నేర్పారు. అప్పటికి కాలేజీచదువు లేకపోవడం మూలాన అలాంటి సదుపాయం ఒకటి ఉన్న దన్నజ్ఞానం కూడా నాకులేదు. శ్రీ సుందరమూర్తిగారు కూడా నాతోపాటు అప్పుడప్పుడూ కొన్ని లెక్కలు చేశారు. ఇలా తంటాలుపడి పావులూరి గణితంలోని పరికర్మ భిన్న గణితాలకు చిత్తుప్రతిని తయారు చేశాను. ఆ చిత్తు ప్రతిలో చాలా ప్రశ్నార్థక చిహ్నాలు ఉండేవి. పద్యం అన్వయం కాని స్థలాలు, వ్యాకరణ దోషాలు ఉన్న పట్టు, ఛందస్సు తప్పినచోట్లు ఇన్నీ సరిగా ఉన్నా పద్యానికి కింద యిచ్చిన లెక్కకూ పొంతన కుదరని స్థలాలూ, మూలానికీ అనువాదానికీ భేదం ఉన్న స్థలాలూ గుర్తించిన ప్రశ్నార్థకాలవి. ఆచిత్తు ప్రతిని తీసుకుని, నేను ఆయా ప్రశ్నార్థకాలకు కారణాలనూ, నా సందేహాలనూ వారిముందు ఉంచే వాణ్ణి. నేను ఎంతో సేపు తలబద్దలు కొట్టుకొని, ఎంతకూ కుదరక ప్రశ్నార్థకం గుర్తించడంలో నా బాధ్యత వదిలిందని అనుకున్న సందర్భాలను వారు అలవోకగా పరిష్కరించడం నాకు చాలా ఆశ్చర్యం కలిగించేది. నేను నా సందేహాన్ని, అక్కడి చిక్కునూ వివరించగానే వారు కలం తీసుకుని దానిని మార్చి లేక సరిదిద్ది నా వైపు తలయెత్తి చూచి నవ్వేవారు. వారు చేసిన సవరణ నిర్ద్వంద్వంగా అతికినట్టు సరిపోయేది. చెయ్యి తిరిగిన

చిత్రకారుడు భావగర్భితంగా గీచిన ఒక గీతలాగా ఉండేది వారు చేసిన సవరణ. దానిని పరిష్కరించ లేక తంటాలుపడిన వాణ్ణి కనుక వారు అలవోకగా చేసిన సవరణ చూడగానే నాకు సంతోషం కలిగేది. చాలా బాగా సరిపోయిందంటూ నేను నాతృప్తినీ, సంతోషాన్నీ వెల్లడించే వాణ్ణి 'సరిపోయిందంటావా?' అని మళ్ళీ అడిగి నేను నా అంగీకారం తెలిపిన తరువాత కానీ ముందుకు సాగిపోయేవారు కాదు. లేకపోతే అక్కడే నిలిచి పోయేవారు. వారు అంత అలవోకగా దాన్ని ఎలా పరిష్కరించగలిగారా అని విస్తుపోవడమే నా వంతయ్యేది చాలాసందర్భాలలో. వారు చేసిన సవరణ ఎంతలా సరిపోయిందో, చిక్కు ఎలా పరిష్కారమయిందో వెంటనే అవగాహన చేసుకో గలడన్న నమ్మకం వారికి నా మీద ఉండేది. నన్నె చోడని కుమారసంభవాన్ని వారు పరిష్కరించే సందర్భంలో కూడా నాకు ఇలాంటి అనుభవం చాలా సార్లు కలిగింది.

పావులూరి గణితంలో ఒకచోట 'ద్రాక్షారామ భీమేశుని లోకనాథు' అని వస్తుంది. అన్ని వ్రాతప్రతుల లోనూ ఆపాదం అలానేఉంది. ఛందోభంగం స్పష్టంగా కనిపిస్తూఉంది. నేను ఆస్థలంలో ప్రశ్నార్థకం ఉంచి ఉన్నాను- ఆపాదంలోని ఛందోభంగ దోషాన్ని పరిహరించడం కుదరక. నేను వారి పక్కనే నిలబడి ఉన్నాను. ఆచోటు వచ్చినప్పుడు నేనుఅక్కడిచిక్కుని వివరించాను. వారు వెంటనే - ఒకలిప్తకాలం ఆలోచించి ఉంటారేమో! ఆపాదంమీద ఒకగీటు గీసి కొట్టివేసి దానిమీద 'దాకరేమి భీమేశు లోకనాథు' అని వ్రాశారు. ఇక్కడ మాత్రం వారు చేసిన సవరణ యేమిటో నాకు అర్థంకాలేదు. ప్రాసయతి కుదిరే టట్లుగా పాదం ఎలాగోసరి పెట్టా రనిపించింది. అమాటే అన్నాను. 'పద్యలక్షణం సరిపోయింది గాని, అర్థం మాటో' అన్నాను. 'అర్థమూ సరిపోతుంది' అని నావైపుచూచి నవ్వారు. ఎలా! అన్నాను. శాసనాలలో దాక్షారామానికి దాకరేమి అని పర్యాయంగా వాడతారంటూ కొన్నిశాసనాలలో ఎత్తిచూపారు. చాలా ఆశ్చర్యం వేసింది. అపద్యపాదం అర్థవంతంగా పరిష్కృతమయినందుకు నాకు ఏనుగు నెక్కినంత సంబరం కలిగింది. శాసన పరిజ్ఞానాన్ని సమయ స్ఫూర్తితో గ్రంథపరిష్కరణంలో చూపగలిగిన వారినేర్పునాకు అచ్చెరువు గొలిపింది. ఇలాసాగేది కౌశలంతో కూడిన వారి పరిష్కరణ కర్మ.

పావులూరి గణితంలో పదిభాగాలు ఉన్నాయి. అవి అన్నీ పరిష్కరించబడాలంటే చాలాకాలం పట్టుతుంది. అందుచేత ఇతర భాగాలను పరిష్కరించే దాకా ఆగనవసరం లేకుండా సిద్ధపరిచిన పరికర్మ భిన్న గణిత భాగాలను మాత్రం ఒక సంపుటంగాముద్రింపజేయాలని శ్రీ శాస్త్రిగారు భావించారు. శ్రీ పరవస్తు రామానుజ స్వామి గారు కూడా అందుకు తమ ఆమోదం తెలిపారు. శుద్ధ ప్రతి తయారు చేసిన తరువాత ఆ రెండుభాగాలనూ అచ్చుకిచ్చారు.

**['It is really unfortunate that the hand of providence should have snatched him away from our midst before he could carry the work completely through the press. The first two books of the treatise were printed and the work had to be suspended for want of an editor. It is decided to publish the portion printed so far without waiting indefinitely till the completion of the whole work. It is under these circumustances that I am issuing a part of the book to the public. Preface. P 1. of Sarasangraha ganita by P. V. Ramanujaswami 1952.]**

వారు దానికి పీఠిక వ్రాసి ఉంటే ఎన్ని విషయాలు వ్రాసేవారో! కానీ, అది వారు దివంగతులయిన తరవాతనే ప్రకటింపబడిన కారణాన వారి పీఠిక దానిని అలంకరించే మహద్భాగ్యం మనకు లేక పోయింది.

వారి అనంతరం వారుచేపట్టినకార్యాన్ని కొనసాగిం చాలనే పూనికతో-పావులూరిగణితంలోని తరువాతి రెండు భాగాలనూ త్రైరాశిక గణితము ప్రకీర్ణక' గణితము అనే వాటిని నేను మూలంతో సరిచూచి, లెక్కలు గుణించి, వారు చూపిన మార్గంలోనే, వారి దగ్గర పొందిన తరిఫీదుతోనే పరిష్కరించాను. అవి 'భారతి' పత్రికలో వరుసగా రెండు సంచికలలో ప్రక టింపబడినవి. నేనుచేసిన పనులలో 'పావులూరిగణితం' పరిష్కరించి ప్రకటిచడం చాలా గొప్పదిగా నేను అప్పటికీ యిప్పటికీ భావిస్తూ ఉంటాను. దానికి నన్ను 'తగువానిని' గా చేసినది వారి దగ్గర నేను పొందిన తరిఫీదే.

పావులూరి గణితం విషయంగా శ్రీ ప్రభాకర శాస్త్రి గారి మూలంగా యేర్పడిన ఆసక్తే ఆ తరువాత 'పరి శోధన' పత్రికలో కోడూరి వాసుదేవకవి అనువదించిన, లీలావతీ గణితాన్ని సంపాదించి, పరిష్కరించి, ప్రక టించడానికి నాకు స్ఫూర్తి నిచ్చింది.

ఇటీవల చిత్తూరు వాస్తవ్యులు, పార్లమెంటుసభ్యులు శ్రీ వి. రాజగోపాల నాయుడుగారు తిరుపతి శ్రీ వేంక టేశ్వర విశ్వవిద్యాలయంలో గణిత శాస్త్రాచార్యులుగా ఉన్న ఆచార్య విశ్వనాథ ఆరుణాచలం గారి తోడ్పా టుతో 'పావులూరి గణితం' గ్రంథానికి దేశంలో లభించే తాళపత్ర ప్రతుల నన్నింటినీ సేకరించి పరి ష్కరింపచేసి ప్రకటింపజేయాలనిసంకల్పించినట్లు తెలు స్తున్నది. వారు ఉభయులూ దానికి కావలసిన శక్తి యుక్తులు చాలగా కలవారు. పావులూరి గణితం-పరి ష్కరణంలో అంతో యింతో ఉడతా భక్తిగా పని చేసి ఉన్ననాకు ఇంతకంటే ఆనంద దాయక మయిన విషయం వేరేదీ ఉండదు దానికై కలలు గని, అం దులో కొంత మాత్రమే తమజీవిత కాలంలో సాధించ గలిగిన శ్రీ ప్రభాకరశాస్త్రి గారి యెడల యింక యేది చేసీ కృతజ్ఞత చూపలేము. వారి సంకల్పం మవుతుందనే నానమ్మిక.



# గురుదేవుల డైరీనుండి కొన్ని పుటలు

1. సోమవారం-15 మార్చి, 1926

నేడు సంవత్సరాది పండుగ యగుటచే CVVపూజ జరిపినాను.

2. మంగళవారం- 23 మార్చి, 1926.

ఎపుడు చూతునో దివ్యతేజము
నెపుడు చూతునో ధూమకేతువు
నెపుడు నా సందేహజలనిధు
లింకిపోగలవో!
సీవిపీ కరుణావిశేషము
చేత నెన్నడు తొలగిపోవునో
చిరయుగంబులనాటిమాయా
వరణ మదియెల్లన్
తోచ దేపని చిత్త మెల్లను
దోచుకొంటిరి సద్గురూత్తమ
వేచియుంటిమి దర్శనముకై
వేగ రాగదరే!

3. మంగళవారం— 20 ఏప్రెలు, 1926.

నేటి రాత్రి ఎవరో కొందఱు బుద్ధపూజచేయుట కాన వచ్చెను. నే నక్కడికి వెళ్ళితిని.

4. శుక్రవారం-23ఏప్రెలు, 1926.

నేటిరాత్రి శరీరమున ఏవో వింతప్రాక్టీసులు జరిగినవి ముఖమందు గొప్ప వెల్తురు గోచరించినది. 'చూచితివిరా జ్యోతిస్వరూపమును! ఇప్పటి కింతవఱకే చూడగలవు'అని ఎవరోఅన్నమాట వినపడినది. తరువాత కనులు తెఱపి అయ్యెను. ఇది స్వప్నమువంటి స్థితిలోనే.

5. మంగళవారం-27ఏప్రెలు, 1926.

నేడు నాయనగారి మాసికము. 10వది. కశ్లేపల్లిలో నేనొక్కడనే పెట్టినాను. నేటిరాత్రి మిక్కిలి భయంకరమైన పీడకల వచ్చినది. ఆ కల స్వరూపము నిక్కడ వివరించి వ్రాయను. C.V.V. కృపవలన సర్వమును క్షేమమునకు పరిణమింపగలదు.

6. ఆదివారం-2 మే,1926

ఈనాటినుండి C.V.V లోకమున వ్యక్తమగుట కారంభమని తెలుపబడినది.

# వేటూరి వారు

**-వేమూరి సీతారామశాస్త్రి**

[ఈ వ్యాసాన్ని శ్రీ వేమూరి సీతారామశాస్త్రి గారు 1959 ప్రాంతాలలో హైదరాబాదు విచ్చేసి నపుడు మేము కోరగా వ్రాసియిచ్చినది- సం]

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు కృష్ణా జిల్లా దివితాలూకా పెదకళ్ళేపల్లి గ్రామ వాస్తవ్యులు. తండ్రి సుందరశాస్త్రిగారు తల్లి శేషమ్మగారు. సోదరులు నలుగురు. వీరు రెండవవారు. వీరి మాతామహస్థానము పెదకళ్ళేపల్లికి ఏడెనిమిది మైళ్ళలోగల ఘంటసాల. పెదకళ్ళేపల్లి దక్షిణకాశియని ప్రసిద్ధిగాంచిన శ్రీ నాగేశ్వర క్షేత్రము. ఇట కృష్ణానది ఉత్తరవాహిని. ఈ గ్రామము శ్రీ చల్లపల్లిసంస్థానాధీశుల పరిపాలనలోనిది ఇందు పలుమంది సుప్రసిద్ధ విద్వాంసులు నివసించు వారు. వారెల్లరు వేద వేదాంగములందును, తర్క వ్యాకరణాది శాస్త్రములందును పరి నిష్ణాతులగుటయే గాక ధర్మశాస్త్రమునందు పెద్దగా విశిష్టత గడించిన వారు. కాశీపండితులకుఁగల ధర్మశాస్త్ర సంశయము లను గూడాఁ దీర్పఁ జాలిన సర్వతోముఖ ప్రజ్ఞకలవా రని ప్రతీతి.

శ్రీ శాస్త్రిగారి పితృపాదులు వైద్యము అభిమాన విద్యగా వృత్తిగాఁ గలవారైనను సంస్కృతాంధ్రము లందు మంచి ప్రవేశము కలవారు. చక్కని వాక్చ మత్కృతి వక్తృత్వము గలవారు. భారత భాగవత రామాయణాది గ్రంథములను బాగుగా చదివిన వారు. శ్రీవారి మేనమామలు వైదిక వృత్తిగలవారయ్యు ఆంధ్రమున బాగుగా కృషిచేసిన వారు. సాయం సమ యములలో పదిమందిని చేర్చి భారత భాగవత రామయణాది సద్గ్రంథములను నిరంతరము చదివి వినిపించు చుండెడివారు. అందుచే శ్రీవారి మాతృ శ్రీ కూడా ఉత్తమ సంస్కారముగల సాధ్వీరత్నము. అట్టి ఉత్తమ సంస్కారవంతులగు పుణ్యదంపతుల గర్భవాసమున జనించుటచే ఈ సోదరుల కందఱకు అబాల్యముగా విద్యాభిరుచియు, చక్కని సుశిక్షణమూ నలవడినవి.

పూర్వముగల విద్వద్బృందము కొంతకుఁగొంత తరిగి పోయినను శ్రీ శాస్త్రిగారి బాల్యములోఁగూడ మద్దూరి రామావధాన్లుగారు, తంగిరాల వెంకటావధాన్లు గారు (వీరు అనంతశయనము మహారాజా వారిచే సువర్ణ కంకణ బహుమానము పొందిన మహామేధావులు), శిష్టాచయనులుగారు, ఎడవల్లి అప్పావధాన్లుగారు, ప్రభల ఆదినారాయణావధాన్లుగారూ, సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిలుగారు (సుప్రసిద్ధ సంగీత విద్వత్కులపతులు) బుద్ధు భూషయ్యశాస్త్రిగారు, తెంజర్ల సాంబయ్యశాస్త్రి గారు మున్నుగా పలుమంది విద్వాంసులుండెడి వారు, శ్రీ మైసూరి భీమాచార్యులవారి శిష్యులును, తర్కవేదాం తాది శాస్త్ర పారంగతులు మహా తపస్విలునైన శ్రీ శ్రీ అద్దేపల్లి సోమనాథ శాస్త్రిల వారు కూడ కారణాంతరములచే వచ్చి కొంతకాల మక్కడ కడపుట తటస్థపడినది. శ్రీవారికడ పలుమంది ఉద్గ్రంథముల చదువుకొను విద్యార్థు లుండెడి వారు. తరుచుగా శాస్త్రార్థ

ములు, సాహిత్య గోష్ఠులు, ధర్మశాస్త్ర చర్చలు జరుగుచుండెడివి. అప్పట్లో పశ్చిమ గోదావరి మండల వాస్తవ్యులు అపరగౌతములు సని పేరు వడసిన సుప్రసిద్ధ తర్కవిద్వాంసులు శ్రీ పాద లక్ష్మీనరసింహ శాస్త్రిల వారు కొందరువిద్యార్థులతో పెదకళ్ళేపల్లి వచ్చి రెండు మూడురోజు లుండి రనియు "నిత్యమేక మనేకానుగతం సామాన్యమ్" అను సామాన్య లక్షణము గూర్చి శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రిల వారితో నాలు గైదు గంటలసేపు ప్రసంగము జరపిరనియు, తత్ప్రసంగానంతరము శ్రీ సోమనాథశాస్త్రులుగారిని బుద్ధిమదగ్రేసరులని ప్రశంసించిరనియు తద్జ్ఞులవల్ల వినికి. శ్రీ ప్రభాకరశాస్త్రిలవారు బాల్యమున విజ్ఞులైన తల్లిదండ్రుల భారత భాగవతాది కథనములు, విద్యాప్రసంగములు, సాహిత్య గోష్ఠులు మున్నగు చక్కని వాతావరణములో పెరిగినవారు. వీరి అగ్రజులు శ్రీ వెంకట శివశాస్త్రిగారు తొలుత శ్రీ మద్దూరి రామావధానులగారి వద్ద కావ్యములను, పిదప చల్లపల్లి సంస్థానా స్థాన విద్వాంసులుగా ప్రవేశించిన శ్రీ అ॥ సోమనాథశాస్త్రుల వారియొద్ద సాహిత్య గ్రంథములను, తర్కప్రకరణములను, జదివి వీరికి మార్గ దర్శకులైరి. శ్రీ ప్రభాకర శాస్త్రిల వారును అట్లే రామావధానులు వారియొద్ద కావ్యత్రయమును ముగించి చల్లపల్లి వెళ్ళి శ్రీ సోమనాథ శాస్త్రుల వారి యొద్ద సాహిత్యగ్రంథములను, వ్యాకరణమున లఘుకౌనుదిని, సభాష్యముగ పతంజలి యోగ సూత్రములను అభ్యసించిరి. అక్కడ వీరికి సుప్రసిద్ధులగు ఆవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారును, పిసుపాటి వెంకటరామశాస్త్రిగారును సహాధ్యాయులైరి. బ్రహ్మచర్య నియమముల బాటించుచు వారక్కడ నెఱపిన విద్యాభ్యాసము ఆదర్శప్రాయమైనది.

తర్వాత వీరు ముప్వురు జగత్ప్రసిద్ధులు, శతావధానులు నైన శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిలుగారి యొద్దకు విద్యాభ్యాసమునకై పోయిరి. 'సిద్ధాంత కౌముది' ప్రధాన పాఠ్యముగ జదువుచు ఉభయ భాషలలో కవితా వ్యాసంగము అష్ట శతావధాన విధానము నభ్యసించుచు బందరులో రెండు మూడేండ్లు కడపిరి. అక్కడ ప్రసిద్ధ న్యాయవాదులు, ఆంధ్ర భాషాభిమానులు, సరసులు, ఉదారులునైన శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారి యాశ్రయము లభించినది. వారి యింటనే భోజనాదికము జరుపుకొనుచు, నిరంతరము విద్యావ్యాసంగములో మునిగి తేలుచుండువారు. తరచు శ్రీ గురుపాదులు గావించు కవితా గోష్ఠులలో, అవధానములలో పాల్గొనుచుండు వారు. ఆ రోజులలోనే ఒకమారు శ్రీ గురుపాదులను పెద కళ్లేపల్లి తీసికొనివచ్చి వారి సమక్షములో అష్టావధానము చేసిరని వినికి శ్రీ పిఠాపురము మహారాజా వారి యాస్థానములోని రామకృష్ణ కవీశ్వరుల జంటలో నొకరగు శ్రీ ఓలేటి వెంకట రామశాస్త్రిగారితో కూడ వీరికి శ్రీ వెంకట శాస్త్రిగారి యొద్ద సహాధ్యాయత్వము లభించినది.

తరువాత శ్రీ ప్రభాకర శాస్త్రిలవారు మద్రాసు చేరిరి. శ్రీవారి భావుకులు, సరసులు నైన శ్రీ కాజ వెంకట శేషయ్య యనువారు అప్పట్లో హైకోర్టు న్యాయవాదులగు శ్రీ శ్రీ వేపా రామేశం పంతులుగారి వద్ద గుమాస్తాగా నుండువారు వారి ప్రేరణతో నక్కడకు బోయి యచిరకాలములోనే యచటి ప్రముఖులు పెక్కండ్ర పరిచయము సంపాదించుకొనిరి. ట్రిప్లికేను హైస్కూలులో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా కుదుర్కొనిరి. అందందు జరుగు సభలకు, సమావేశములకు నాహ్వానముల మీద హాజరగుచు సారవంతములైన ప్రసంగములచే, కవితా రచనలచే పలువురు పిన్న పెద్దల మన్నన లందుచుండిరి. వీరి ప్రతిభా విశేషములు, విమర్శనా శక్తులు, కవిత్వ రచనలు గ్రహించి ప్రభుత్వ ప్రాచ్య పుస్తక భాండాగారము పైయధికారులు వీరి నందలి తెలుగు శాఖలో నుద్యోగిగా తీసికొనిరి. ఆ శాఖకు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు ఉన్నతోద్యోగిగా నుండిరి. శ్రీ కవి

గారి సలహాలమీదఁ దమయుద్యోగములోని విహిత కార్యములను చుఱుకు చుఱుకుగా సక్రమముగా నిర్వహించుచు కొలఁది కాలములోనే పైయధికారుల ప్రేమాదరములకు పాత్రులైరి. అట గల సంస్కృత శాఖకు ప్రధానోద్యోగియైన శ్రీశ్రీ కుప్పుస్వామి శాస్త్రిగారి పరిచయము కూడ లభించెను. శ్రీ శాస్త్రిగారు (కుప్పుస్వామి శాస్త్రి) ప్రెసిడెన్సీ కాలేజీలో సంస్కృతాధ్యాపకులుగా నుండువారు. వారు శెలవు పెట్టి నపుడు మన శాస్త్రిగారు అక్కడకు సంస్కృత అధ్యాపకులుగా కూడ ఒండు రెండు మార్లు వెళ్ళియుండిరి. దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, శ్రీ రెంటాల వెంకట సుబ్బారావుపంతులుగారు, శ్రీ తం॥ తేవప్పెరుమాళ్ళుగారు మున్నగు పుర ప్రముఖులతో శ్రీ శాస్త్రిగారికి బాగుగ సన్నిహితత్వ మేర్పడెను. వారి వారి కోరికలపై శ్రీ శాస్త్రిగారు టీకలు, పీఠికలు వ్రాయుట, కవిత్వము చెప్పుట మున్నగు బహు కార్యములు నిర్వహించి వారి గౌరవాభిమానముల నొందుచుండువారు. ఒకప్పుడు సరసులు స్వయంగా కవులు కూడనైన శ్రీ రెం. వెం. సుబ్బారావు పంతులుగారి కోరికపై శ్రీ శాస్త్రిగా రీక్రింది పద్యము వ్రాసిరట.[1]

సీ॥ కొనగోటఁ గురుల చిక్కులుదీర్చి ముడిసుట్టి
నలుకెలంకులఁ జూపు లొలయఁ జేసి.
అదటు గుబ్బల రైక వదలించి దుసికిళ్ళ
వొలయఁ బయ్యెంట బేఁగలయఁబొదివి
గుము రెత్తు పులకల నిమిరి పొక్కిలిబంటి
నీట లేయెండ మైనాట డిగ్గి
గుమ్మడిమూటగా కూర్చుండి చిగురాకు
దొప్ప దోయిళుల నీ రవ్వళించి

తే॥ గీ॥ కరఁగి పోసిన పొంగు బంగారువోని
యొరపు మైకాంతి తరగలఁ బొరలియాడఁ
గొలనఁ గనుగొమ్మ చెలికాడ! జలకమాడు
చెలుఁగుమాసిన చిన్నారి చిగురుఁబోఁడి॥

ఇది యొక్క మచ్చు తునక. ఇట్లెన్నో పద్యములు వ్రాసి యుందురు. ఉద్యోగ ధర్మముపై ప్రాచ్యపుస్తకములకు వివరములతో గూడిన పట్టికలను తయారు చేయుటలో, శుద్ధాఽశుద్ధ పాఠములను నిర్ణయించుటలో, అముద్రిత గ్రంథములనుసంస్కరించి ముద్రించుటలో, కొన్నిటికి పీఠికలను వ్రాయుటలో శ్రీ శాస్త్రిగారు లైబ్రరీలో లభించు తాళపత్ర గ్రంథముల ప్రతులనెల్లఁ బరిశీలింపవలసిన వారగుటచే ప్రాచీనాంధ్ర సముద్రమునంతయు తఱచి యుందురు. దానిఫలితములే మీగడతరగలు, తెలుఁగు మెఱుఁగులు, శృంగార శ్రీనాథము మొదలైనవి. అక్కడ నుండుటలో వారి వారి సహవాసముచే సంస్కృతాంధ్రములతోపాటు ద్రావిడ కర్ణాట భాషలలోఁగూడ లోతైన ప్రవేశము కలిగినది. కొలఁదిగా ఇంగ్లీషు భాషా ప్రవేశముగలదు. ఇది యెల్ల శ్రీవారి సర్వతోముఖ పాండిత్యమునకు తోడైనది. శాసనలిపి చదువుట, పరిశోధించుట వానిని బట్టి దేశకాల చరిత్రాదుల నిదమిత్థమని నిర్ణయించుట మున్నగు అపూర్వ శక్తు లలవడినవి. బహుముఖమైన ప్రతిభా విశేషములనుబట్టి ప్రభుత్వమువారు శ్రీ శాస్త్రిగారిని ప్రాచ్యపుస్తకములను సేకరించు నుద్యోగిగా తెలుగు జిల్లాలకు పంపిరి అట్లు నియుక్తులై పర్యటించుటలో పలుమంది పిన్న పెద్దలను గలిసి కొనియుందురుగాన శ్రీవారి పాండిత్యము, అనుభవము, పరేంగితజ్ఞత మున్నగునవి యపారములై పరిపక్వస్థితికి వచ్చినవి. అందువల్లనే గురుపాదులగు శ్రీ వేంకటశాస్త్రులుగారుకూడా పూర్వ కవిప్రయోగములు, శబ్దసాధుత్వాఽసాధుత్వములు, చారిత్రక విషయములు మున్నుగా పెక్కింటిని గూర్చి వీరికి వ్రాసి విశేషములను, సలహాలను పొందుచుండువారు. అదియే కాదు వీరి "సతీర్థ్య సంప్రార్థనము" మొదలగు పద్యములను జదివి యెక్కువగా నానందపడు చుండువారు. స్వతః ప్రతిభయు, సుశిక్షణము, వాతావరణము, గుర్వనుగ్రహము, వృత్తియు, నిరంతర కృషియుఁ గలసి శ్రీవారి నిట్టియున్నతోన్నత స్థితికిఁ దెచ్చినవి.

శ్రీ శాస్త్రిగా రాయాసందర్భములలో చెప్పిన కొన్ని చాటు పద్యములు.

కుటుంబము నింటవదలి పుస్తకముల సేకరించు పనిమీద గుంటూరు జిల్లాలో తిరుగునప్పు డీ క్రింది పద్యము చెప్పిరి.

ఉ॥ దూరము నుండి యెండఁబడి దూపిలి యింటికి
నేగుదెంచు చో
ప్పారసి కూర్మి పేర్మి వినయంబు భయంబుఁ
దొలంకు చూడ్కినిం
పారెడి మోముతోడ నెదురయ్యెడి తొయ్యలి
డించి దేశసం
చారము సేఁత రోఁత పరిచారకులా? ధనమా?
వృధా వృధా.

నెల్లూరి జిల్లాలో గురువర్యులగు శ్రీ వెంకటశాస్త్రుల వారిని జులకనగా మాటాడిన ఒకానొక ప్రతి పక్షికి సవాలుగా చెప్పి పద్యము.

ఉ॥ కొంకులు వోని సత్కవన గుంభన మంతకు
మించి బింకపుం
బొంకము కల్గఁగాఁ జవులు పొంపిరివోవ బఠించు
నేర్పుమా
వేంకట శాస్త్రి పండిత కవి ప్రభు చక్కటిఁ దక్క
దక్కవి
ద్యాంకుల యందు నెందుఁగలదా! సకలాంధ్ర మహా
మహీస్థలిన్॥

వీరు వ్రాసిన సతీర్థ్య సంప్రార్థనము చూచి శ్రీరామ కృష్ణ కవులు మిన్న కుండగా తత్పక్షపాతు లెవరో ప్రచురించిన పద్యములకు జవాబుగా చెప్పినది.

ఉ॥ రిత్తకురిత్త సద్గురువరేణ్యుల దూరిన వారిఁ
గూర్చియే
న్నుత్తల పాటునొంది హితమో యహితంబొ వచించి
నంత ఖా
యెత్తరు వారు, నీవెవఁడ వేటికి నోటికి వచ్చినట్టులు
ద్వృత్తిని వెల్వరించెద, వెఱింగితివే గురు శిష్య
పద్ధతుల్?॥

చల్లపల్లి కోటలోని పోకల దొడ్డియందలి సంపంగి పువ్వును గూర్చి చెప్పినది.

శా॥ ఇంపుం బెంపున నీదు సౌరభముమమ్మీనాడు
ముమ్మాఱురా
వింపం బేరడి యాసపాల్పడియు నిన్వీక్షింప
రాదయ్యెమ
న్నింపం జెల్లదె గంధగౌరవమున న్నిండారునీ
తీరహో!
చాంపేయంబ! గుణాతిరేక మెసఁగన్ శ్లాఘ్యంబకా
గర్వమున్॥

గురుపాదులకుఁ గుశల ప్రశ్న చేయుచు వ్రాసినది.

సీ॥ కుశలమే మీకు, మీ కులవర్ధనులకు వి
ద్యావృక్ష మునఁ గ్రొత్త యంట్లుగలవె!
తిరుపతి సత్కవీశ్వరు చరిత్రము రచిం
చెదరటే! యది ముగించితిరికాదె?
గాటంపుఁదమిఁదోట నాటుకొన్నారు నిం
డారఁ బండునె! జహంగీరుమావి?
అవధానములు సూడ నభ్యర్థితులు వేడ
నేగు చుందురె యిప్పు డెచటికేని?

తే॥ కుల్కుఁగుత్తుల నునుతొక్కు పల్కులందు
ప్రౌఢి మీఱినసుకవితా ఫణితులందు
పరువు దేఱిన మామిడిపండులందుఁ
జక్కగుఱుతించుచుందురే చవుల వాసి?॥

అన్నగారి కుమారుఁ డొక్కడు జాఱిపోయినప్పుడు చెప్పిన వానిలో గొన్ని-

చం॥ కట కట; నాయనా! విధివికారము త్రిప్పఁ దరం
బుగాక య
చ్చటలును ముచ్చటల్ గొలిపి సంబర పెట్టెడు
ముద్దు మన్మనిన్

చిటి పొటి మేని కుజ్జు నరచేతులలోఁ గొని పెంచి నేఁటిక
క్కటికము పొల్లవోఁగఁ అకుగడ్డల పాలొనరించి నాఁడనే!

చ॥ కొమరు నొసంగు మంచు నినుఁగోరిన దెవ్వరు? లేనిపోనిము
ద్దుమురిపముల్ వెలార్పుమని తొందఱ పెట్టిన దెవ్వ? రయ్యయో!
యమృతము తీపు సూపి విషమావలఁబెట్టినయట్టు

గుమిలి కృశింప నీకడుపుఁగోతకుఁ దార్చితివేమొ దె వమా!

నుడికారము సొంపు, ఉదాత్తమైనశయ్య, భావ గాంభీర్యము వ్యర్థపదరాహిత్యము మున్నగు లక్షణ ములఁబట్టి శ్రీ శాస్త్రిగారికిఁ బద్యరచనలో కవిసార్వ భౌముడగుశ్రీనాథుఁ డాదర్శమనితోచును.

నిరంతరమగు విద్యాకృషివల్లను,దేశాటనము వల్లను 1915ప్రాంతములో శ్రీ శాస్త్రిగారి శరీరస్వాస్థ్యము దెబ్బతిన్నది. సహజ మృదుల స్వభావులు,స్వకష్టమును పరకష్టమును గూడ సహింప నోపనివారునగు శ్రీ శాస్త్రులు గారు కొంత కాలము సెలవుపెట్టి స్వగ్రామ మగు పెద కళ్ళేపల్లి, ఘంటసాల, బందరు మున్నగు చోట్ల విశ్రాంతి తీసికొనిరి. ఏమాత్రము మన శ్రమము చేయలేకుండిరి. భయము, అశాంతి ఏర్పడెను. ఏ మం దులు మాకులు పనిచేయవయ్యెను. తిరిగి యుద్యోగ ములో చేరవలసి వచ్చెను. అప్పుడు శ్రీ పోతరాజు నరసింహముగారు మున్నగు కొందరతో క్రొత్తగా చెలిమి యేర్పడెను. వారి ప్రోత్సాహముపై కుంభ కోణము వెళ్ళి యోగ నిష్ఠా గరిష్ఠులగు సి.వి.వి. అను సాంకేతిక నామధేయముగల మహనీయుల ఆశ్రయ మహా భాగధేయము పొందిరి. దానితో శ్రీవారి శారీరక మానసిక దౌర్బల్యము లన్నియు పటా పంచలై పోయెను. జీవితములోనే పెద్ద మార్పు వచ్చెను. ఉద్యోగ ధర్మముచే విద్యా వాఙ్మయ కవిత్వ కృష్యాదు లనివార్యమైనను వారి దృష్టి పూర్తిగా ఆధ్యాత్మికము వంకకు మఱలెను. తత్ఫలితముగా 'దివ్యదర్శనము' మొదలగు రచనలు సాగెను. అదియుఁ బరమార్థము కాదని రోసి ఉద్యోగవిహితకృత్యముల నెట్టెటో పూర్తిచేసి తదితర కాలమంతయు ఆధ్యాత్మికముగనే గడపఁ జొచ్చిరి. దానివలన వారు స్వయముగ పెద్ద శ్రేయస్సును పొందిరి. పలు విధములైన యాధ్యా త్మిక శక్తు లలవడెను. వానిచే పలుమందికి పలురకము లైన శ్రేయస్సులను సమకూర్పఁ జాలిరి. క్రమ ముగ శిష్యకోటి వృద్ధి పొందెను. ప్రతిదినము ప్రాత స్సాయంకాలములలో శిష్యకోటితో కలిసి ప్రార్థన సలుపుటయు అవుడు గోచరములైన ఆధ్యాత్మిక రహ స్యముల నెన్నిటినో శిష్యకోటికి వెల్లడించుటయు పరి పాటి యయ్యెను. పెద్ద పెద్ద వైద్యులు కూడ తమ వల్ల నయము గాదని వదలివేసిన ప్రబల వ్యాధులను శ్రీ శాస్త్రులుగారు యోగ చికిత్స చేసి యనతి కాలము లోనే వింతగా నిర్మూలించుచుండువారు. శారీరకముగ, మానసికముగ దుర్భరబాధ లనుభవించువారు పలు వురు వీరి యోగ మహిమచే సర్వ బాధా విముక్తులై, మంచి యారోగ్యము, సుఖము, ప్రశాంతి ననుభవిం చుచు శ్రీవారి దివ్యనామమును నేటికి నిరంతరము కీర్తించుకొనుచున్నారు. "స్వయం తీర్ణః పరాం స్తారయే" త్తను నార్యోక్తికి పరమ లక్ష్యముగ శ్రీవారు తమ జీవితము నంతయు గడపి ధన్యజీవులైరి.

---

పాదసూచిక: 1

"అప్పట్లో చిన్నన్నయ్య, రెంటాల సుబ్బారావుగారు మైలాపూరులో కపాలేశ్వర స్వామి వారి పుష్కరిణి కెదురుగా వుండే మేడమీద వుండేవాళ్ళు. ఒకసారి పుష్కరిణిలో స్నానమాడిన యువతిని చూపించి రెంటాల సుబ్బారావుగారు ఆ యువతి స్నాన సౌభా గ్యాన్ని వర్ణిస్తూ ఆశువుగా ఒక పద్యం చెప్పమన్నారట

చిన్నన్నయ్యని. అప్పుడు చెప్పిందే "కొ న గో టం గురులు చిక్కులు దీర్చి" అన్న పద్యం. దానికి ఆయన పరమానందం పొంది భారతం సెట్టు పూర్తిగా కొని చిన్నన్నయ్యకి బహూకరించాడు" (డా॥ వేటూరి శంకర శాస్త్రిగారితో ఆనందమూర్తి జరిపిన ముఖాముఖీ చర్చలోని అంశమిది.)

[ఆనాడు రెంటాల సుబ్బారావుగారు బహూకరించిన భారతం సంపుటాలు శాస్త్రిగారి లైబ్రరీలో ఉన్నవి. ఒక సంపుటం ఇన్నర్ టైటిల్ మీద సుబ్బారావుగారి సంతకం క్రింద శాస్త్రిగారిట్లా వ్రాసుకొన్నారు సం.]

బ॥ శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రి గారికి
సరస్వతీ ప్రదానము

(సం) రెంటాల వెంకట సుబ్బారావు
పరీధావి కార్తిక
బ॥ 3 శుక్రవారము.

[ప్రభాకరశాస్త్రిగారి దస్తూరిలో]

"ఔరా! పేరిమి పెంపు నా వలన నే యాధిక్య
మూహించెనో!
సారస్యజ్ఞుడు భవ్యనవ్య కవితాసంధాత రెం
టాల సు
బ్బారాయాఖ్య మహాశయుండు నను సంభావించి
దివ్యాంధ్ర వా
క్శ్రీరమ్యంబిది పారితోషిక మొసంగెన్ భారతా
మ్నాయమున్"



"అన్య ముఖమున దుర్వారమైన మాట
అదియె ప్రియముఖమునం బరిహాస మగును
అన్య కాష్ఠంబునను ధూమ మనంబడునది
యగురు కట్టెను ధూపమై యాదృతమగు"

[గోవర్థన సప్తశతిలోని శ్లోకమునకు
వేటూరి ప్రభాకరశాస్త్రిగారి తెలుగుసేత-సం]

# భజగోవిందం

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[శ్రీమచ్ఛంకర భగవత్పాదుల భజగోవింద శ్లోకాలకు ప్రభాకరశాస్త్రిగారి ఆంధ్రీకరణము. రచనా కాలం 1929. శతకరత్నావళి నుండి సేకరించినవారు-డా॥ వేటూరి శంకరశాస్త్రిగారు-సం]

**భజగోవిన్దమ్:-**

భజగోవిందం భజగోవిందం
పరమ మంత్రమిది మూఢమతీ! హరి
భజనమొండె అవసానమందు గా
పాడగలది యో మందమతీ! - ॥భజ॥ 1

**మూఢజహీహి:-**

విత్త సమార్జన విధములు వెదకకు
వెడగా! నిర్మల చిత్తమునన్ కుల
వృత్తివలన లభియించు దానితో
దృప్తి గనుచు సుఖియింపవలెన్- ॥భజ॥ 2

**నారీ స్తనభర:-**

పువ్వుబోండ్ల స్తనపుష్టిం గని కని
యువ్విళ్లూరకు మోహముతోన్ అవి
క్రొవ్వు కండలని గుత్తెరింగి మది
గోర్కెనడంచు మనస్యాము తోన్- ॥భజ॥ 3

**నళినీదళగత:-**

సరోజినీ దళగతజలబిందువు
చపలము సుమి జీవితము కడున్ బహు
దురవస్థా పీడితము ప్రపంచము
దుఃఖమయము పరికింపంగన్— ॥భజ॥ 4

**యావద్విత్తోపార్జనసక్తః:-**

గడన గల్గినపు డింట నందరును
మడుగు లొత్తుదురు అడుగులకున్ తన
గడన యుడిగి ముదుసలి తనమున బడ
గడకురారు పిల్చిన నొకడున్- ॥భజ॥ 5

**యావత్పవనో:-**

ఉసురు నిలిచి యున్నంత కాలమును
అరయుచుందు రందరు గుశలము నా
ఉసురు పోయి దేహము చల్లారగ
నులుకును దారయు దరినిల్వన్- ॥భజ॥ 6

**అర్థ మనర్థం భావయ:-**

అర్థమనర్థము లేశము సుఖదా
యకము గాదు నిజ మరయంగన్ భువి
నర్థవంతులకు ననుంగ పుత్రుల
యందును భీతి గదా యచటన్- ॥భజ॥ 7

**బాలస్తావత్:-**

ఆటలపై నాసక్తి బాల్యమున
బోటులపై దమి యవ్వనమం దా
రాటపుజింతలు వృద్ధత్వమున బ
ర బ్రహ్మనిరతి యపు డమరున్- ॥భజ॥ 8

**కాతేకాన్తా:-**

సతి యెవ్వతె నీ సుతుడెవ్వడు సం
సార బంధనము వింతసుమా నీ
పితకి వెవ్వడ వెక్కడివాడవు
విచారించి తత్త్వము గనుమా - ॥భజ॥ 9

సత్సంగత్వే:-

సత్సంగత్వము లభియింపగ బరి
జన గోష్ఠి యసహ్యము దోచున్ మో
హోత్సాహము విడి తత్త్వము దెలియును
ఒప్పను మోక్షం బటచేతన్- ॥భజ॥ 10

వయసిగతే కః:-

ప్రాయ ముడిగి మదనాగ్ని యెక్కడిది
తోయము లింకి తటాకమ్మున్ ఆ
దాయముడిగి పరిజన మెక్కడ ద
త్త్వమ్మ దెలిసి సంసారమ్మున్!- ॥భజ॥ 11

మాకురు ధనజన:-

భోగ భాగ్యములు యౌవనమును గని
బోర్లబడకుమా! అవిస్థిరమా వై
రాగివగుచు సర్వము విడిచి పర
బ్రహ్మము నారసి కను గొనుమా-॥భజ॥ 12

దినయామిన్యౌ:-

రేయి పవలు మరి రేపులు మాపులు
ఋతువు లిట్టు కాలము దిరుగున్ భువి
నాయువు బఅచు నదేమి పాపమో
ఆశాభూతము విడదు నరున్—॥భజ॥ 13

కాతేకాన్తా ధనగతచింతా:-

వారక ధన చింతనుబడి తప్పొ
ప్పరయక ప్రవర్తింపకుమా సం
సారసాగరము దాటగ సజ్జన
సహవాసంబే నావసుమా!—॥భజ॥ 14

జటిలో ముణ్డీ:-

ధర నెంపరో జోగులు జడదారులు
తలబోడులు కాషాయధరుల్ పరి
పరి వేసమ్ములు గ్రాసమ్మునకే
బ్రహ్మము గనగలరే మూఢుల్-॥భజ॥ 15

అఙ్గంగళితమ్:-

వీడును దేహమ్మున బిగి దంతము
లూడును వాడును గేశమ్ముల్ మరి
మూడుకాళ్ళ ముదుసలియు నగున్ విడి
పోవునె యాశా పాశమ్ముల్—॥భజ॥ 16

అగ్రేవహ్నిః:-

ఆతపశీతమ్ముల కోర్చి తపం
బహర్నిశలు తరుమూలమునన్ సం
ప్రీతిని నెరపియు భిక్షము వేడియు
బీడితు డాశా పాశమునన్- ॥భజ॥ 17

కురుతే గంగా సాగరగమనమ్:-

తీర్థయాత్రలు వ్రతమ్ములు సల్పిన
తెగువను ధర్మమ్ములు చేసిన పర
మార్థజ్ఞానము గలుగక మోక్షం
బబ్బదుపో శతజన్మములన్- ॥భజ॥ 18

సురమందిరతరు:-

నేలపాన్పు తరుమూలమ్ములు దే
వాలయములు వాసస్థలముల్ మరి
తోలు చేలము విరాగులు భోగవి
దూరులహో! నిత్యానందుల్— ॥భజ॥ 19

యోగరతోవా:-

జ్ఞానయోగి యజ్ఞానభోగి పరి
జనరక్తుండు విరక్తుండును నె
వ్వానిచి త్తమది బ్రహ్మలయం బౌ
నానరు డానందము గాంచున్— ॥భజ॥ 20

భగవద్గీతాకించిదధీతా:-

ఇంచుకేని గీతా పఠనముగా
వించు ద్రావు గంగా జలమున్ ఆ
ర్చించు మురారి నొకపుడే నెవ్వడు
చేర డతడు యము చర్చలలోన్- ॥భజ॥ 21

**పునరపి జననమ్:-**

మరి మరి పుట్టుట మరి గిట్టుట మరి
మాతృ గర్భమున బొరలుటయున్ ఈ
తెరగుగదా సంసారగమన మిది
తీర్పగ వేడుము గోవిందున్- ॥భజ॥ 22

**రథ్యాచర్పట:-**

పేలికలను జేలముగా గూర్చును
విడుచును బుణ్యా పుణ్యములన్ మరి
బాలుని గతి నున్మత్తుని భంగివి
బరమయోగి యానందించున్- ॥భజ॥ 22

**కస్త్వంకోహమ్:-**

నీవు నేను మరి తల్లి తండ్రి యే
నెలవువార లెవ్వరు వీరల్ ఈ
భావమరసి స్వప్న భ్రాంతులు విడి
వంచింపుము భవబంధమ్ముల్- ॥భజ॥ 24

**త్వయిమయి :-**

ఒకటే సుమి బ్రహ్మము సర్వత్ర ను
ఔకడని నేనని తలపకుమా భువి
సకల భావముల సమబుద్ధి నరసి
సదయుడవై మోక్షము గనుమా- ॥భజ॥ 25

**కామంక్రోధం:-**

కామము క్రోధము లోభము మోహము
గడతేర్చి గనుము పరమాత్మన్ విను
పామరులగు తత్వాంధులకును బెను
బాధలు తప్పవు నరకమునన్- ॥భజ॥ 26

**గేయం గీతానామసహస్రమ్**

వర పూరుష సహవాసము ధర్మము
భగవద్గీతా పఠనమ్మున్ శ్రీ
మురారి నామ సురూపధ్యానము
ముక్తికి సోపానమ్ములగున్- ॥భజ॥ 27



"రసికు లెందుఁగాని కసిగొందురే నది
యల్పమగు నడంగు నంతలోనె
వరుస చూడరాదె వడగల్లు చిన్నది
యగు నడంగు మఱియు నంతలోనె"

[గోవర్ధన సప్తశతిలోని శ్లోకమునకు
వేటూరి ప్రభాకరశాస్త్రిగారి తెలుగుసేత-సం]



# యోగము - విశ్వ చైతన్యము

వేటూరి

[గురుదేవుల ప్రార్థన సమయాల్లో వారున్నచోట ప్రతినిత్యమూ రెండు పూటలా పలువురు యోగమిత్రులు సమావేశమయ్యేవారు. ప్రార్థనానంతరం వారు తమ తమ దివ్యానుభూతుల్ని ముచ్చటించుకొనేవారు. గురుదేవుల ప్రార్థనానంతర ప్రసంగాలు ఉత్తేజకరంగా ఉండేవి. అట్టివాటిని కొన్నిటిని శిష్యులు కొందరు గుర్తుచేసుకొని తరువాత వ్రాసిపెట్టేవారు. వాటిల్లో కొన్ని 'ప్రభాకర ప్రవచనాలు'గా పూర్వం ప్రకటింపబడ్డాయి. అప్రకటితములైన అట్టి ప్రసంగాలు మరికొన్నిటిని మణిమంజరిలో క్రమంగా ప్రకటించగలము. ఈ ప్రసంగము 13-12-1948 నాటిది. శ్రీవారి రెండవ కుమారులు శ్రీ గురుప్రసాదముగారు గుర్తు చేసుకొని డైరిలో వ్రాసి యుంచినది. సం]

నాకు ఒక కథ తలచుకొంటే ఒళ్ళు పులకరిస్తుంది. హృదయం నీరయి పోతుంది. ఇది నేను చెన్నపట్టణంలో ఉండగ విచారిస్తూ ఉండిడి వాడిని. కుంభకోణమున మిత్రులు కూడియుండ ఈ కథ చెప్పితిని. వారందరూ హృదయ విదారకమగు ఈ కథవిని చింతించిరి.

ఆంధ్ర దేశమున వ్యాప్తి చెందిన పిటక కథలు తొలుత కాంచీ పురము నుండి వ్యాపించినవి. కావుననే మనము కథలు పూర్తి చేసిన పిదప "కథ కంచికి మనమింటికి" అంటూ ఉంటాము. ఒకానొక భిక్షువు భిక్షుకి యొక్క కలువరేకులవంటి కన్నుల జూచి వలచి ప్రేమించెను. ఆమె అతని కోర్కె తెలిసికొని బౌద్ధ ధర్మమునకు వ్యతిరేకము కదా నాయనా! గృహస్థుగ నుండి పాపముల పెంచదలచితివా! నీ కోర్కెకు ఈ నేత్రములే కదా కారణము" అని తుమ్మముళ్లతో తన కన్నులు పొడుచుకొనినది.

భిక్షువు తన ప్రవర్తనకు విచారించినాడు. బౌద్ధ ధర్మమున సర్వం "దుఃఖం దుఃఖం" "సర్వం శూన్యం శూన్యం". కావున జీవుడు నిర్వాణము పొంది జీవన్మరణ చక్రము నుండి విముక్తుడు కావలయును.

జీవించియుండు నప్పుడు పాపము చేయరాదు. హింసింపరాదు. ధర్మము నిర్వర్తింపవలెను. గృహస్థుగ నుండిన ఈ పాప ప్రపంచమున ఇంకొక జీవుడు పుట్టుటకు కారణమగుచున్నాము. అసలు పుట్టుటే పాపము. కావున సన్యాసులు కండి. ఇదీ బౌద్ధ ధర్మ సారము. ఈ ధర్మము ననుసరించియేకదా! ఆమె కన్నులు తుమ్మ ముళ్లతో పొడుచుకొనినది! దీని మూలమున ఆమెకు బాధ, అతనికి పశ్చాత్తాపము కలిగినవి! బౌద్ధ ధర్మ ప్రకారమది న్యాయమే కావచ్చును.

నీటిపై బుడగ చూచితిమి కదా! అది సగమే ఉన్నది. మిగతాసగము కనబడుటలేదు.నీరడ్డము వచ్చుచున్నది. భూమిపై ఆకాశము Semi Circle గా కనబడుచున్నది. మిగిలిన సగము కనబడుటలేదు. అట్లే పూర్ణముగ నుండవలసిన పురుషుడు, ప్రకృతి-పురుషుడుగా, చీలిరి. స్త్రీ పురుషులుగా కనబడు

చున్నారు. వీరిరువురు ఏకమై పూర్ణ వృత్తమైన గాని కేంద్ర మేర్పడుటకు వీలులేదు.

అట్లు ఏకమైన పురుషునిలోనే form less గ నుండినImaginative Centreగనుండిన కేంద్రము సృష్టికంతకు కారణమైన పురుషుడు Descend ఐ అతనే తానై పోవును. ఇట్లు ఈ సత్యమును గుర్తించి, దీనికై సాధనచేసినవారు లేరు. సృష్టి ప్రారంభమైన పిదప ఈ సత్యమును గుర్తించుటగాని, సాధించుట గాని జరుగలేదు.

ఈ సత్యమును గుర్తింపకుండుటచేతనే ఇంత వరకూ వ్యాప్తిచెందిన మతములు, సన్యాసమును బోధించినవి. సన్యసించి యోగసాధనము చేయుడని చెప్పినవి. ఇట్లే సన్యసించి బుద్ధుడు బయలుదేరినాడు. కావున పరిపూర్ణ సత్యమును తెలిసికొన లేక కొంత వరకే పోగలిగి తాను తెలిసికొనిన అసంపూర్ణ సత్యము లనే బోధించినాడు. మన యోగ దృష్టిని జూచిన బౌద్ధ మిట్లే కనబడుచున్న దికదా!

మన మవలంభించుచున్న యోగము సక్రమమైన ఇదివరకు బోధించినమతములన్నియు తప్పుచుకదా! ఈ నూతన యోగ దృష్టిని చూడ బుద్ధుడుగాని అతడు బోధించిన మతముగాని దానినవలంభించినబౌద్ధులుగాని సక్రమమైన మార్గమున నడచిరని చెప్ప వీలులేదు. పై పెచ్చు వారవలంభించినది తప్పుమార్గము.

ప్రజలకు తాను గుర్తించిన అసంపూర్ణ సత్యమును బోధించి ప్రపంచమున ఎంతోమందిని తప్పు మార్గ మున బెట్టిన బుద్ధుడు ఈ నూతన యోగదృష్టిని జూచి నపుడు పరితపించవలసినాడు కాడా? తన అవి వేకమునకు చింతించవలసినవాడు కాడా!

బుద్ధునికి సత్యమును తెలిసికొనవలెననీ, దానిని సాధించవలెననీ కోర్కె తీవ్రముగ నుండుటచే పరి పూర్ణ సత్యమును తెలిసికొను వరకును జన్మమెత్తుచునే యున్నాడు. ఇప్పుడిప్పుడు మన మవలంభించుచున్న నూతన యోగమును అతడును సాధించుచున్నాడను కొనిన తాను మాత్రము పరిపూర్ణ సత్యమును గుర్తించు కొని, తన మతమువారు ఇంకను తాను వెనుక బోధిం చిన, అసంపూర్ణ సత్యమునే, అవలంభించుచున్నారని తెలిసికొనినప్పుడు ఆ మార్గము నుండి రక్షించి వారిని కూడ సరిదిద్దుటకు ప్రయత్నించును కదా'

తన మతము వారిని సక్రమమైన మార్గమున బెట్టు వరకును అతడు పరితపించక పోడు. వారికి సరి యగు మార్గమును చూపించును. అట్లు వారి నందరినీ వదలివేసి తాను మాత్రము పరిపూర్ణ సత్యమును తెలి సికొని ఊరకుండు నలత Selfish fellow కాడు. తాను పరిపూర్ణుడై యోగమును పూర్తిగా పొందిన పిదప తన మతమువారిని దిద్దును గదా' నాడే బుద్ధుడు నేడు పుల్లయ్యగా, వెంకయ్యగా, ఉండి ఈ యోగ మును సాధించుచుండి పరిపూర్ణుడగు నను కొందము. బౌద్ధులు అతని నెట్లు గుర్తింతురు? ఈ X చెప్పిన వారు విందురా? వినరు. కావున వారిని సరియగు మార్గమున బెట్టుటకు ఈ x బుద్ధుడుగా వారికి కనబడ వలెను. కనబడి ఈ నూతన పరిపూర్ణ సత్యమును బోధించవలెను. అప్పుడగాని వారు వినరు. అట్లు వారిని తాను సరి దిద్దకపోడు. X గా నుండు ఆ వ్యక్తి వారి కోర్కె తీరునట్లు బుద్ధుడుగా కనబడక పోడు.

కన్నుల తోడుకొనిన ఆ భిక్షుకిని సక్రమమైన మార్గమును బెట్టు బాధ్యత ఆ కర్మకు కారకుడగు వ్యక్తిపై లేదా? బుద్ధుడట్లు బోధించుట చేతనే కదా ఆమె అట్లు చేసినది. కావున ఆమెను సక్రమమైన మార్గ మున బెట్టువరకును X గా నుండు ఆ వ్యక్తి పరితపిం చుచునే యుండును. ఇట్లే అందరినీ సరిదిద్దువరకు X గా నుండు ఆవ్యక్తి విశ్రాంతి గొనడు. వారి కర్మలకు కారకుడీతడు కావున వారికష్టములన్నియును ఈతనివే! వారి కష్టములన్నిటిని పరిపూర్ణముగ బాపు బాధ్యత అతనిపై నున్నది కదా!

ఈ నూతన యోగము సృష్టి ప్రారంభించినది మొదలు ఇంతవరకు ఉండిన వివిధ మతములందలి సత్యముల జీర్ణించుకొని దానిపై అభివృద్ధిచెందినదే. ఈ నూతన యోగము వాటి Further Development అని మాస్టరుగారు చెప్పినారు. దీని తత్వమును గుర్తింప కలిగిన కాలము వచ్చినప్పుడు ప్రపంచమంతయు మారిపోవును. అప్పుడు ప్రపంచమున ఒకే ఒక మతము వెలయగలదు. అది అన్ని మతముల సత్యమును గ్రహించి అభివృద్ధి చెందునదిగా ఉండును. అప్పుడు వివిధమతములుండవలసి అవసరమేఉండదు.

మాస్టరన ఒకానొక వ్యక్తిగా ఆయన గురించి వివరించి చెప్పుట లేదు. ఎందుకన ఆయనను నేను వరి పూర్ణముగా తెలిసికొనిన పిదప ఆయనను గురించి చెప్పవలసిన అవసరమే ఉండదు. నేను పూర్తిగా తెలిసికొనక చెప్పినచో నేను పూర్తిగా ఆయనను గురించి చెప్పలేక పోవుదునేమో. కావుననే ఆయనను గురించి చెప్పుటగాని వ్రాయుటగాని చేయుటలేదు.

సృష్టికి మూలము పురుషుడు. అతనిలో ప్రకృతి లీనమైయున్నది. ప్రకృతీ, పురుషుడూ, ఏకమై యున్నారు. ఈ సత్యమును గుర్తించి ఆ Level నందుండి మాస్టరు చూచి ఈ నూతన యోగమునకు మూలము గ్రహించిరి. Life అంతయు ఒక్కటే. అణువుకు అణువుకు మధ్య Ether అడ్డముగా నున్నది. వ్యక్తి కిని వ్యక్తిని మధ్య Ether అడ్డమున్నది. Life అంతయు ఒకటేనని గుర్తించిన Ether అడ్డముండుటకు బదులు Good Conductor గా మారి Life నంతయును ఏకము చేయగలదు. Ether అడ్డముండుటచేతనే మృత్యువు వచ్చుచున్నది. దీనిని అధిగమించి Life అంతయు ఒకటే ననిగుర్తించి ఏవ్యక్తి యైనను చూడగలిగినచో అప్పుడు ప్రపంచమంతయు మారిపోవును. అట్లు గుర్తించిన వ్యక్తియందు Form lessగా నుండిన మూల పురుషుడు Descend అగుచున్నాడు. ఆ వ్యక్తియే తానై పోవుచున్నాడు. ఆ Level నుండి చూచినచో Life అంతయు ఒకటే, భౌతికముగ కనబడు విభేదము లన్నియును నిజముగావు అని తెలియును.

Life అంతయు ఒకటే అయినప్పుడు, పురుషునకు పురుషునకు మధ్యగాని, స్త్రీకిని స్త్రీకిని మధ్యగాని, పురుషునకు స్త్రీకి మధ్యగాని, స్త్రీకి పురుషునకు మధ్యగాని భేదము కనబడదు. ఆ Level నుండి మాస్టరు చూచి ప్రపంచమంతయు తానే అని గుర్తించి తాను గుర్తించిన సత్యమును ఇతరుల కిచ్చినారు.

అదియే Initiation. ఈ సత్యమును తెలిసికొనుటకు జన్మల తరబడి కొట్టుకొనుచుండు వ్యక్తులకు మాస్టరు Initiation చేసినారు. Initiation పొందినవారు తాము పూర్వము బోధించిన తప్పుడు సిద్ధాంతముల నవలంబించుచుండు సంఘమును దిద్ద ప్రయత్నింతురు.

మన మందరము ఉదయము, సాయంత్రము, ఇచ్చట సమకూడుచుండుటకు కారణము వెనుకకు చూచుకొన గలిగినపుడు తెలియును. దాని కారణము ఒక్కసారిగా తెలిసినచో మనము కంగారు పడవచ్చును. కావున, సమయము వచ్చినప్పుడు అది క్రమక్రమముగా బయలుపడుచుండును. అది బయలుపడు సమయమునకు మన పూర్వ జన్మపాపములన్నియు చక్కబడగలవు. ఆ కాలము సమీపముననే ఉన్నది.

# గాంధి రామాయణము

## సంకలన గ్రంథము

[మహాత్ముని నిర్యాణానంతరం ప్రజా హృదయాల్లో ఉప్పొంగిన శోకం నుండి భావి కవిత జీవం పోసుకోగలదనే భావస్పందనతో 1950 జనవరి నెల తొలివారాంతంలో గురు దేవులు తెలుగు దేశపు పత్రికల్లో ఈ ప్రకటన నిచ్చారు. ఫలితంగా "గాంధి రామాయణం" అనే బృహత్సంకలనానికి అనుకూలంగా ఎన్నెన్నో రచనలు ఎందరెందరినుండో వచ్చినవి. అభినందిస్తూ లేఖలందినవి. వాటిల్లో కొన్నిటిని 'గాంధి రామాయణం' శీర్షికన వరసగా ఇందులో ప్రకటింప తలపు గొన్నాము. నేడైనా ఇట్టి రచనలింకా పంపగోరే వారు మణిమంజరి చిరునామాకి పంపవచ్చును. పై ప్రకటనలో సంతకం చేసిన పెద్ద లెవ్వరూ నేడు మన మధ్య లేరు మణిమంజరి తలపెట్టిన ఈ గాంధి రామాయణ ప్రకటన కార్యక్రమము వారికి పరితృప్తి గొల్పగలదని మావిశ్వాసము-సం]

ప్రకటన :

కౌజుపిట్టలజంట కలసి మెలసి యుండగా మగకౌజు నొక బోయ ఉండేలు గుండుతో కొట్టి చంపుట, ఆడు కౌజు కువకువమని గోలుపెట్టుట తపస్వి, వాల్మీకి దాని నాకలించి శోకించుట, పండబారి రసపరిప్లుతమై యున్న యామహర్షి హృదయఫలము చివుక్కురు మనిచిట్లగానందుండియాశోకమే శ్లోకమైరామాయణమను కరుణకావ్య మధుర రసధారలజాల్వార్చుట, జరగినది. ఇది వేల యేండ్లనాటి గాథ! ఇప్పటికినీ లోకమంతకినీ గొప్పకావ్యమే యా రామాయణము!

మన కనులెదుర వసుధపై వర్తిల్లి ప్రజ్ఞాబాలకులైన ప్రపంచవాసుల నందఱను సత్యజ్ఞానానందామృత ధారల నాస్వాదింప చేయుచు నుజ్జీవింప జేయుచున్న గంగిగోవును, అపకార మెఱుగని యర్భకా కారుని, మారట నారాయిణుని (నరుల మొత్తమునారము. నారములో నెలవు కొన్నవాడు, నారాయణుడు) గాంధిని ఆనాడు పిట్టను గొట్టినవాడే (యవతరించి నాడేమో) గుండె దెబ్బతో కూల్చి చంపగా రామ రామ యనుచు రామస్మరణముతోనే యా పుణ్యమూర్తి యుసురు విడిచినవార్త కొన్ని నిముసములలోనే ప్రపంచమెల్ల పరివ్యాప్తముకాగా నాశోకపు తాకిడి కెందఱు లోక ప్రజలు వాల్మీకు లయిరో? వారి యంతరంగపు టల్లకల్లోలము లెన్ని రామాయణముల పెట్టుగా పెల్లుబికినవో నాడు ప్రజల మహాభావప్రవాహములు వ్యక్తముగా పొర్వారి యారకుండ నేమిమార్పులు కొల్పినవో, కొల్పుచున్నావో, ఇంక నవ్యక్తముగా నేమి మార్పులు కొల్పినవో, కొల్పుచున్నావో అంతరాత్మ తత్త్వవివేకు లెవ్వరే నెఱుగ గలరేకాని యితరుల లేమి యెఱుక?

ఆనాడు, నటు తర్వాతను, ప్రజా హృదయపు టడుగు తట్టున నుండి స్పందింప దొడగిన ప్రజ్ఞోద్బోధములే యిక మీద వెలయవలసిన యుత్తమ రచనల కూటపట్టులు కాగలవనీ, గాంధి వాక్కులు వేదవాక్కులుగా వెలయగలవనీ, గాంధిపేర శకమేర్పడి యందు సర్వ నిర్వాహములు శాంత్యహింసాసత్య ధర్మ పరాయణములుగా సాగ గలవనీ, గాంధి హృదయము విశ్వమానవతను తనలో నిముడ్చుకొని దాని శ్రేయముకై తపించుచు కడతేరినది గాన పై యర్థముల్లే జరగ గలవనీ మా విశ్వాసము. ఆయన తర్వాత నేటి దాక సాగిన సంఘటన లిందు తార్కాణలు,

రెండేండ్లు నిండుచున్నవి. మన యాంధ్రులమాటే మాటాడు చున్నాను, ఆనాడు గాంధి మృతి వార్త విను నప్పటి కెవరెవరేమి యేమి చేయుచుండిరో, ఏమి యేమ యిరో, ఏమే మనుకొనిరో, ఏమేమి చేసిరో, ఏమని

యేమ్చిరో ఇంకేమయినదో తమ చుట్టు పట్టు లెట్టియ్యేనో తెలియబఱతురు గాకని వేడుచున్నాము. స్త్రీలు-బాలురు పామరులు- హరిజనులు- తురుష్కులు- ఉద్యోగులు- పండితులు- ప్రభువులు-వారు వీరననేల దేశము నలు మూలల వారు, నలుదెఱగుల వారు తమ తమ యను భూతి విశేషముల తెలుప గోరుచున్నాము. స్త్రీబాలాదుల నడిగి వారి యనుభూతులు ప్రాజ్ఞులు సేకరించి పంప గలరు గాక! ఇట్లు సేకరమై వచ్చిన వానిని ప్రత్యేక గ్రంథ రూపమున ప్రకటింప దలంపు గొంటిమి. వానిని పరికించి పరిష్కరించి ప్రకటించుట కొక సమితి సమకూడును. అనుభవ విశేషము లెవ్వరెవరు తెల్పుదురో వానిని వారి వారి పేర్లతోనే రసప్లుతముగా సత్యసుందరముగా నొక్కొక్క పుటకు మించకుండ సంగ్రహింప గలందులకు వేడుచున్నాము. కల్పితార్థము లకు, కవితా విలాసములకు, ఛందో బంధములకు స్వస్తి! అవి మా కక్కఱలేదు. బాల పామరాదుల భాషితములు అమాయకములుగా వారి తొక్కుబలుకుల తోనే యుండుట చక్కన. సర్వమానవ సహజభావ జ్వాలలించు వెలుగొంద వలెనని మా వేడుకోలు.

ఈ విషయమున విశేషము లరయగోరువారు క్రింది అడ్రసుకు జాబులు వ్రాయ వచ్చును. ఏ తద్గ్రంథ సంకలనమొక్కరి సొమ్ముగాదు. ఫలాపేక్షారహితమగు నొక యూడిగమే యిది. తిరుపతిలో 1. శ్రీ మాడ భూషి వేంకటాచార్యులవారు బి.యె. వకీలు, 2, కొచ్చి వెంకటేశ్వరరావుగారు, 3. ప. వెంకటరమణ రావుగారు బి- యె బియల్, ఈ మువ్వురును కార్య నిర్వాహకులు,ఇట్లనేకస్థలములనేర్పడుదురు, ఇక్కడికి. కొచ్చివెంకటేశ్వరరావుగారు అనుఅడ్రసకు జాబులు వ్రాయవచ్చును.

ప్రకటన -2 :-

## గాంధి రామాయణము

"చరితం గాంధి దేవస్య శతకోటి ప్రవిస్తరమ్!
ఏకైక మక్షరం ప్రోక్తం మహా పాతకనాశనమ్"

"గాంధి ర్గాంధి ర్గాంధి రితి ప్రజానామభవన్ కథా:
గాంధి భూతం జగత్సర్వం గాంధౌ ధర్మ ప్రవర్తతే"

గాంధి రామాయణమును గూర్చి మేము ప్రకటించిన విషయముల యెడ అత్యంతాదరము చూపుచు పలువురు మాకు జాబులు వ్రాసిరి. మాకు తోడ్పడ నంగీకరించిరి. గాంధిగారు నిర్యాణము చెందిన వార్త విన్నంతటనే అనేకుల హృదయములు తార్మారయినవి. కొందరు మరణించిరి. కొందఱికి వెఱ్ఱి యెత్తినది. కొందరు సర్వస్వ త్యాగులయిరి. కొందఱు పుణ్య వర్తనులయిరి. అనేకు లనేకవిధముల సంచలనము చెందిరి. ఈ రెండేండ్లలో నెందఱిలోనో యెన్నెన్నో పరిణామముల నానాటి గాంధి మరణ వార్త కల్పించి నది. కల్పించుచున్నది. వానిలో కొన్నింటినైన మేము సేకరింప గోరుచున్నాము. ఆ వార్త యంతరంగమున ప్రవేశించినపు డంతదాక వారిని నిందించుచున్న వారిలో కూడ గగ్గోలు మహాభీతి కల్పించినది. అది వారిలో చెడుగును నెమ్మదిగా నెత్తి పోయుటలో గాంధిగారిపై, వారిపై భక్తి నెఱపు వారిపై నది గొప్ప యెత్తిపోతగా పార్వారినది. ఆ పొర్లంతా పొంగిపోగా నట్టడుగున గాంధి హృదయమునువారెన్నటికైనామూడగలరు.గాంధి గారిసంకల్పములు సత్యాహింసాత్మకములు.సత్యాహింసలదివ్యశక్తి దేశకాలములచేగాని, యజ్ఞానముచే గాని వారితముగానేరదు.అదివిజృంభింపవలసినదేకానిసమసి పోవునది కాదు. అది నిర్వాహము చెందుచున్నదని నిరూపించుటకే మా యీ యుద్యమము. ఈ నెల 26 తేది నాటి ప్రజాస్వామ్యోత్సవమున భారతదేశమంతటా గాంధి మహత్త్వము తాండవించినది. భారతదేశము శ్రీ రామోత్సవములను మించి, భారతదేశముననే కాక విశ్వమంతటా కూడా గాంధ్యుత్సవములు సాగవలెను. ఆంధ్ర దేశమంతటా ఈనెల 30 తేదినాడు మర్నాడు జరుగు గాంధి నిర్యాణదిన సభలలో జరిగిన యుప న్యాస విశేషములను మాకు పంపగోరుచున్నాము.

మాకు తోడ్పడ నంగీకరించిన మిత్రులును, ఈ విషయముల నభిమానించు సహృదయులును ఈ 30తేది నుండి ప్రజా భావముల సేకరించి మాకు పంపగోరు చున్నాము. "గాంధిగారి మరణవార్త విన్ననాటి మా తలపులు, చేష్టలు—ఈనాటి దాక వాని పరిణామములు" అని వ్యాసములు విద్యార్థులచే వ్రాయించి అందు మేలయిన వానిని గుర్తించి మాకు పంపగలందులకు కాలేజీల, హైస్కూళ్ళ, ఇతర పాఠశాలల యుపాధ్యాయుల వేడుచున్నాము. ఉపాధ్యాయులు గూడ వ్యాసములు వ్రాసి పంపగోరు చున్నాము. ఉపాధ్యాయులే కాక ఆంధ్రలోక ప్రజలందఱుకూడ వ్రాసి పంపగలరు గాకనియే మేము కోరుచున్నాము. ఇందుకై ఆయా చోట్ల ప్రాజ్ఞులు కమిటీల నేర్పఱచుకొని సేకరము చేయగోరు చున్నాము.

తిరుపతి (సం) వే. ప్రభాకరశాస్త్రి
27-1-50 (సం) కొచ్చి వెంకటేశ్వరరావు

* * * *

**నాటి లేఖల్లో ఒకటి :**

పురిపండా అప్పలస్వామి 12-1-50
విశాఖపట్టణం.

అయ్యా! గాంధీ రామాయణం గురించి శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ఆంధ్ర పత్రికలో వ్రాసిన లేఖ చూశాను. ఈ విషయంలో మీకు తోడ్పడి ఏ మాత్రమైన సేవ చేయ గలిగితే సంతోషిస్తాను. దలుచేసి వివరాలు వ్రాయించ గోర్తాను, శ్రమకు మన్నింపుడు.

చిత్తగింపుడు

(సం) పురిపండా అప్పలస్వామి.

* * * *

## గాంధి రామాయణము

### (సంకలన గ్రంథము)

ఆ రోజు పరీక్షా ఫలితాలెట్లా వుంటాయో తెలుసుకోవాలని ఆత్రముగా వున్నాను. ఆనాడు శుక్రవారం. సాయంత్రం 6 గంటలు కావస్తున్నది. నాన్నగారు పార్కుకు వెళ్లారు. నేను, మా మంజక్కయ్య, తమ్ముడుఅన్నముతింటూన్నాము.మాఅమ్మ అన్నంలోకి నిమ్మకాయ బద్ద వేసింది. చాలా రుచిగా వుండటంవల్ల కబుర్లు చెప్పుకుంటున్నాము. అప్పుడే అనుకున్నాను గాంధీజీ చీటికి మాటికి వుపవాసం చేస్తారు. ఇటువంటి నిమ్మకాయబద్ద రుచి చూస్తే ఆయన ఎన్నటైనా వుపవాసం చేస్తాడా అని.

రేడియోనించి నాన్నగారు సరాసరి మేము అన్నాలు తినే చోటికి వచ్చి "ఊ!!! ఊ!!! ఎంత పనిజరిగింది" అంటూ కళ్ళనుంచి నీరు కార్చటం మొదలుపెట్టారు. మేమంతా ఖంగారుపడి అడిగితే 'గాంధీజీ ప్రార్థన చేసుకోటానికి వెడుతూవుంటే ఎవరో తుపాకితో కాల్చి చంపేశారట' అని చెప్పిరి. ఆ మాట వినకముందే నేనెంతో హితవుగా తింటున్న నిమ్మకాయ చేదయిపోయింది.

గాంధీ మహాత్ముని హృదయంలో ఆ పాపిష్టి తుపాకి గుండ్లు ఎలాచొచ్చుకుపోయాయో ఆ విధంగా ఆయన చనిపోయాడన్న మాట వినగానే ఆ మాటలు నా హృదయంలోకి చొచ్చుకు పోయినవి. అనేక వూహలు కలిగినవి.

అనేక పటములలో గాంధీమహాత్ముని హృదయము మీద నాలుగు ఎముకలు బైటికి తేలి వుండటము

చూచాను. ఈ ఎముకలు తుపాకి గుండ్లను ఎదుర్కొనలేకపోయినవాఅనుకొనుచు మరల ఆ విశాల హృదయుడు ఎటువంటిదుష్టుఁడైన ప్రేమతోచూచి మంచినేర్పునని తలచుకొని ఆ పాపిష్టి తుపాకి గుండ్లు లోనికి పోవుటకు దారి యిచ్చిన వనుకొంటిని.

అనేక మహత్కార్యములను సాధించిన అ మహావ్యక్తి 125 ఏండ్లు బ్రతులేక పోయెగదా! అవి నా విచారం.

రేడియోవాళ్లకి ఎవరో అబద్ధము చెప్పారేమో! ఆ చక్కని బోసినోటి కాంతుల చిమ్ము ఆయనను చంపుటకు చేతులెవరికి వస్తవి? అని నాయూహ. రేపు ప్రొద్దున మళ్ళీ బ్రతుకుతాడేమో అనుకున్నాను. ఋషి, సాధుపుంగవుడు, అమృత కల్పుడు, మహాత్ముడు అగు గాంధీమహాత్ముడు తన భౌతిక శరీరముతో 125 ఏండ్లు మనుటకన్న యశఃకాయముతో ఎల్లకాలము మనుచు ధ్రువతారయైయుండి మనల నాశీర్వదించు చుండునని నా ఆశాభావం.

వేటూరి సుందరరామ మూర్తి
(విద్యార్థి వయసు 14.)



## సత్కృపాకంధి మోహన చంద్ర గాంధి

సీ॥ వినయ కుటీరంబునన నిల్పితివిగదా
  గర్వ పర్వతముపైఁ బ్రాలువారి
పౌర తొలగించి కన్దెరపించితివి గదా
  యైశ్వర్య భోగాంధులయినవారి
తినిపించితివి గదా తన యింట తియఁగూర
  పొరుగింట పుల్లఁగూ రరయువారి
స్వాతంత్ర్య వీధిలోఁ జనఁజేసితివి గదా
  పారతంత్ర్యపు గొంది బడలువారి

గీ॥ అరసితివిగా జగం బెల్ల నాత్మగృహము
మాకికా నీవంటి యుత్తమ మర్త్యుఁడేడి?
జయము నీ కెందు నీ కార్య చయమునందు
సత్కృపాకంధి మోహన చంద్ర గాంధి!

[మున్నొక తూరి మహాత్ముడు మద్రాసు వచ్చినపుడు
(7-5-1925) ప్రభాకరశాస్త్రిగారు చెప్పిన పద్యము-సం]

# "వంశోద్ధారకుడు"

డా. వేటూరి శంకరశాస్త్రి

మా అన్నదమ్ములలో నేను కడపటివాడను గనుక, నా అన్నగార్లు అందరి దగ్గరను చదువు సంధ్యలు చెప్పుకొని, యేదో కొంత నేర్చినవాడను గనుక మా చిన్నన్నగారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారినిగూర్చి యేదైనా కొంత చెప్పుటకు నాకు అర్హత కలదనియే చెప్ప వచ్చును.

పూజ్యులు ప్రాతఃస్మరణీయులు మా పెద్దన్నగారు శ్రీ వేంకటశివశాస్త్రిగారు నా చిన్నతనములో దగ్గర నుంచుకొని విద్యాబుద్ధులు నేర్పినారు. వారు నాకు నేర్పిన సంస్కృతము ఇంగ్లీషు ఇప్పుడు నన్నుద్ధరించి నా జీవనోపాధికి ఆధారములయినవి. వారు బహు శ్రుతులు.

ఇక మా రెండవ అన్నగారు నాకు యుక్తవయస్సు వచ్చిన తర్వాత నన్నొక వ్యక్తినిగా తీర్చిదిద్దిన మనీషి ఆయన. ఆ వివరములన్నీ చెప్పవలెనంటే ఒక్కసారిగ అన్ని జ్ఞాపక పరచుకొని చెప్పే పరిస్థితిగా లేదు ఇప్పటి నా జ్ఞాపకశక్తి, ప్రసంగవశాత్తు అప్పుడప్పుడు చెప్పవలసినవే. మా చిన్నన్నగారి జీవిత విశేషాలు మూడు విధాలుగా విభజించి చెప్పవచ్చును.

మా సమష్టి కుటుంబ సభ్యుడుగా ఆయన ఉనికి, ఆయన నిర్వహించిన పాత్ర ఒక విధానం, కవిగా, పండితుడుగా, విమర్శకుడుగా, పరిశోధకుడుగా, ఆయన సల్పిన సరస్వతీ పూజ రెండవ విధానం, యోగిపుంగవుడుగా ఆయన ఆతురుల యెడ చూపిన కరుణ, వారికి సల్పిన సేవ మూడవ విధానం- ఇట్లా విభజించి ఆయా అంశాలమీద ఎన్నో విషయాలు చెప్పవచ్చును.

ప్రస్తుతము మొదటి విషయమునుగూర్చి మాత్రమే నేను కొంత చెప్పదలచినాను. మిగిలిన రెండు విషయములు అందుకు సమర్థులయిన వారికి వదలుతున్నాను. ఇంతకూ వారినిగూర్చి చెప్పుటకుముందు మా జన్మ కారకులయిన మా జననీజనకులను గూర్చి కొంచెమయినా ఇక్కడ చెప్పటం అవసరమని నేను భావిస్తున్నాను.

మా తల్లిదండ్రుల ప్రజ్ఞాప్రాభవాలు మాలో ఎంత ప్రతిఫలించినవీ, మమ్ముల నెంత ప్రభావితము చేసినవీ వివరించటం అవసరము.

మా తండ్రిగారు సుందరశాస్త్రిగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. శ్రౌతస్మార్తములందు ప్రవీణుడు. కవి, సంస్కృతాంధ్రములందు మంచి ప్రవేశము కలవాడు. కళాభిజ్ఞుడు. పత్రికా సంపాదకుడును. జ్యోతిషమున ముహూర్త భాగము, జాతక భాగము నెరిగినవాడు. వైద్యము సరే సరి. స్వయముగా నేర్చిన విద్య. శాస్త్రమున అనుభవమున అమృతహస్తుడు. గణితమున ప్రజ్ఞాశాలి. పావులూరి గణిత పద్యములన్నీ నోటికి వచ్చియుండేవి. ఆధ్యాత్మిక దృక్పథమున అద్వైత భావనగల వేదాంతి. చూడటానికి ఒడ్డుపొడుగుగల విగ్రహము. స్ఫురద్రూపము. జబ్బపుష్టితో ఎట్టి కష్టమైన పనినైనా సునాయాసముగా నెరవేర్చుసామర్థ్యము గల బలశాలి. కండెలతో నున్న మొక్కజొన్న పచ్చి

చొప్పమోపుకు పొలము నుండి మోసుకొనివచ్చి కం దెలు విరిచి తంపటవేసి పిల్లలకుపెట్టేవాడు. చొప్పను ముక్కలుగా నరికి ఇంటిలోని పశువులకు మేపేవాడు. గంధాక్షతలు నుదుట పెట్టుకొని మారేడు దళముల పోలికనున్న రుద్రాక్షమాలను మెడలో ధరించి ఎంత మందిలోనైనా సరే ఒక మంత్రద్రష్టవలె తన ప్రత్యే కతను నిరూపిస్తూ ఉండేవాడు.

స్వభావమున కొంచెము నిక్కచ్చితనమేకానవచ్చేది. ఇచ్చిపుచ్చుకోడంలో కరాఖండితనమే గాని మెతక తనంలేదు. ఇతరులు ఈయనగారి యెడల భయభక్తు లతో మెలగేవారు. వ్యవహారాల్లో మొగమాటమిలేకుండా మాట్లాడుతాడనే మాట ఆయన మీద ఉండేది. ఒక్క నిమిషం వృథాగాపోనిచ్చే వాడు కాదు. కష్టజీవి. జం థ్యాలు వడకటం దగ్గర నుంచి పశువులకు పలుపులు పేనడం దాకా అన్ని పనులూ స్వయంగా చేసుకొనే వాడు. అయితేనేమి సుకుమారుడు. ఉదయం పదింటి కల్లా భోజనం చేయాల్సిందే. కాసేపు విశ్రాంతి. తరు వాత రోగులకి మందులివ్వడం. రాత్రి యథా ప్రకారం జపం-భోజనం-స్తోత్రపఠనం అంతా లెక్క ప్రకారం జరిగేవి. మళ్ళీ పొద్దున్నే లేచేవాడు.

ఆయనకి స్తోత్రాలు అవీ చాలా వచ్చేవి నోటికి. మా అక్కయ్యకి, అమ్మకి లలితాసహస్రనామాలన్నీ చెప్పుతూ ఉండేవాడు. వినివిని వాళ్లకే కాక మాకూ చాలా నోటికి వచ్చేసినవి. నా అనుభవంలో ఉన్న విషయం చెప్పుతాను. ఎప్పుడయినా జబ్బుచేస్తే రాత్రి దగ్గర కూర్చుని శివకవచం, దేవీ స్తోత్రం, నారాయ ణోపనిషత్తు వల్లిస్తూ చేతితో నిమురుతూ ఉంటే ఒళ్లంతా చెమటపోసి జ్వరం జారిపోయేది. జ్వరం తగ్గిన తర్వాతనే ఆయన వెళ్ళి పడుకొనేవాడు. ప్రేమాభిమానాలకి ఆస్తిక్యబుద్ధికి మా యింట్లో ఆయన వేసిన పునాదే.

అప్పుడప్పుడు ఎవరైనా అడిగితే ఇంటివద్ద జ్యోతిషం పాఠాలు చెప్పేవాడు. దేశాటనం కూడా చేశాడు. ఆ రోజులలో రైళ్ళు లేవు. పడవలమీదను కాలినడకను ప్రయాణం చేయవలసి వచ్చేదట. నా పుట్టుకలకి పూర్వం అట్లా ఆయన హైదరాబాదుకి వచ్చి జాగీరుదార్లకి జ్యోతిషాలు చెబుతూను వైద్యం చేస్తూను సంవత్సరంపాటు ఉన్నాడుట. అట్లాగే చెన్న పట్టణమూ ఇంకా చాలా ఊళ్ళూ తిరిగాడు. ఇట్లా తిరిగి ఆర్జించిన డబ్బుతోనే తర్వాత కళ్ళేపల్లిలో ఆయన ఇల్లుకట్టు కున్నాడు. ఇప్పుడున్న పెంకుటిల్లు ఆయన కట్టించినదే. అంతకు పూర్వం ఒక పాక ఉండేదిట.

ఒకసారి నా చిన్నతనంలో ఆయనను అడిగాను- "వైద్యం చేస్తావు. జ్యోతిషం చెబుతావు. అన్ని విద్యలూ తెలుసంటావు. అన్నీ నేర్చానంటావు. ఎవరు చెప్పారు నీకివన్నీను? ఎక్కడ నేర్చుకున్నావు?" అని! ప్రేమతోనే మందలిస్తున్నట్లుగా కోపపడి 'బుద్ధి మంతుడైతే సరి లోకాన్ని చూచే అన్నీ నేర్చుకో వచ్చు' నంటూ ఈ ముక్కన్నాడు. 'ఆచార్య స్సర్వ చేష్టాసు లోక ఏవహిధీమతః' అట్లాటిదిఆయనప్రతిభ. స్వయంగా ఆయన చాలా చదువుతూ ఉండేవాడు. మా యింటి యందే వారు సంపాదించిఉంచిన, చదివిన తాటాకు పుస్తకములు ఇంచు మించుగా రెండు వందల వరకు ఉండేవి, ఎవరేవిషయము కావలసి వచ్చినా తెలిసికొనుటకు మా యింటికి రావలసినదే. వారు స్వహస్తముతో వ్రాసిన తాటాకు పుస్తకములు, కొండ వల్లి కాగితాల పుస్తకములు వారి జీవితాంతము మా యింటివద్దనే ఉండేవి. ఆయన దస్తూరీ కాగితాల మీద కన్నా తాటాకుల మీదనే చక్కగా ఉండేది. మా తాటి తోపులో ఒక చెట్టు ఆకు పెద్దది. వాటిని కోసి-దానికో ప్రాసెస్ ఉంది. ఆ ప్రకారం వాటిని వ్రాతకు సిద్ధంచేసి, కంసాలి పర్వతాలు దగ్గరికి వెళ్ళి వాటికి రంధ్రాలు వేయించి జాగ్రత్త చేసుకొనే వాడు. ఆయన రాసిన

పాటలు, పద్యాలు, దరువులు, ఏలలు, సంవాదాలు, తత్త్వాలు, కందార్థాలూ, కావ్యాలు చాలా ఉన్నాయి. కదళీపురమహాత్మ్యం అనే కావ్యం రాశారాయన. ఆ దరువులూ సంవాదాలు నేర్చుకుని మాశ్యామలక్కయ్య, శారదక్కయ్య వాటిని తరుచు పాడుతూ ఉండేవాళ్ళు అవి అన్నీ ఒక సంకలనంగా అచ్చులోకి వస్తే బాగుండు ననిపిస్తుంది.

ఇక మాతల్లిగారిని గూర్చి ఏమి చెప్పినను అది కొంచెము చెప్పటమే అవుతుంది. ఆమె చాలా నాజూకైన శరీరముకలది. పచ్చని పసిమిగల సౌందర్యవతి. గట్టిగా తాకితే శరీరము కందిపోయేది. పల్చనిపాదములు."పసుపు నిగ్గులుదేరు పండువంటి ముఖమ్ము కుదురైన నుదురు కుంకుమపు బొట్టు" అనే సీస పద్యము 'కృతార్థుడు' అనే శీర్షికతో ఒకప్పుడు మా చిన్నన్నగారు ఆమెనుద్దేశించి రచించి భారతిలో ప్రకటించినారు. ఆమె దేవీభక్తురాలు. బాలత్రిపురసుందరి ఆమె యిష్ట దైవము. మా తల్లిగారు మాయమర్మము లెరుగని అమాయక ప్రవృత్తిగల పుణ్యవతి. ఆమె తన పిల్లల మీదనే కాదు, మా నాయనగారి వద్దకు వచ్చే రోగులందరి యందును కారుణ్యము వహించెది. మా నాయనగారు వీధి గుమ్మము వద్దనుండి మందు లిచ్చి పంపితే వారి గోడువింటూ, దొడ్డి గుమ్మము నుంచి వారి పథ్య పానాదులకు అవసరమైన పచ్చళ్ళు పాలు ఇచ్చి పంపుతూ ఉండేది. అది కారుణ్యమనండి, ప్రేమ అనండి, దయఅనండి అన్నీ ఒక్కటే ఆమెకు. అంతా తనవారే ఆమె దృష్టిలో. "వాత్సల్యనిర్భరతయా జననీ కుమారమ్ స్తన్యేనవర్ధయతి దష్టపయోధరాపి" అనే సూక్తికి ఆమె తార్కాణ అయినది. ఏ మాత్రము పరులబాధను కష్టమును సహించలేక పోయేది. ఆమె శరీర నిర్మాణతత్వమే అందుకు తగినది కాదా అనిపించేది. తాను కష్టపడలేదు. ఇతరుల కష్టము సహించేది కాదు. అట్టి సమయములందు కండ్లు మూసుకొని యెక్కడ ఉంటే అక్కడే చెంగుపరచుకొని తన యిష్ట దైవమును ప్రార్థిస్తూ పడుకొనేది. ఒళ్ళువణికి పోయేది. కొంత సేపైనాక కాని తేరుకొనేది కాదు.

సంగ్రహముగా మాజననీజనకుల స్వరూప స్వభావము విట్టివి. ప్రధానముగావారిలోని యీస్వభావ అంశములే మా చిన్నన్నగారిని ప్రభావితము చేసిన వని నేను నమ్ముతున్నాను. పాండిత్య ప్రతిభావిశేషములందు మా నాయనగారి అంశ., కారుణ్య స్వభావము నందు మా తల్లిగారి అంశ మా చిన్నన్నగారిలో పూర్ణ వికాసమును చెందినవని నా విశ్వాసము. ఇందుకు తార్కాణగా ఒకటి రెండు విషయములు చెప్పుదును.

మొదటిది- మా నాయనగారు 84 యేండ్లు నిరామయ జీవితమును గడిపిరి. "అనాయాసేన మరణం వినాదైన్యేన జీవన"మ్మని కోరుకొంటూఉండేవారాయన ఆ ప్రకారమే వారి జీవితము, అవసానము కూడా జరిగినవి. జీవిత విశేషములు ఎన్నో చెప్పవలసినవి ఉన్నవి. అవి మాని అవసాన విశేషమే పేర్కొందును.

ఆయనకు జరావ్యాధి తప్ప వేరే జబ్బేమీ చేయ లేదు. మరణమే మానవుని మంచికి నిదర్శనమని పెద్దలు చెప్పుదురు. ఇంక మూడు నాలుగు రోజులకు తాము జీవయాత్ర చాలించెదరనగా తన కుమాళ్లను, కుమార్తెలను, అల్లుండ్రను, కోడండ్రను, మనుమలను మనుమరాండ్రను, మా మేనమామను పిలిపించుకొన్నారు. రెండు రోజులు నిరాహారులై ఉన్నారు. స్పృహతోనే ఉండి మా మేనమామగారి చేత ఉపనిషన్మంత్రములు, స్తోత్రములు వగైరాలు చదివించుకొన్నారు. మా మేనమామ గారిది మంచి గాత్రము. చక్కగా పాడేవాడు. మా నాయనగారు ఆయన చేత తన ఇష్టమైన ముక్తేవి వారి కీర్తనమిది పాడించుకొన్నారు.

"రామ పట్టాభిరామ రామా రామా
నే విన్నవించేది ఇకను ఎందాక
వద్దు వద్దనగానే వచ్చెనే ముదిమి
తద్దయు నాతాపత్రయము పోజిదిమి—"

చాలా ఆర్తితో కూడుకొని ఉంటుంది ఆ కీర్తన. అది పాడించుకొని ఆనందించారు. తన వారినందరినీ దగ్గరకు పిలిచి ఎవరికి చెప్పవలసినవి వారికి చెప్పినారు. ఇట్లా రెండు రోజులు సాగినది. మరునాడు మా మేనమామగారు 'బావా! నేను ఇంటికి వెళ్ళి మరల రేపు వచ్చెదను' అన్నారు. దానికి బదులుగా మా నాయనగారు "ఈ దినం మూడు గంటల వరకు చూచి వెళ్ళుదువుగానిలే" అన్నారు. అందరిని భోజనములు చేసిరమ్మన్నారు. రెండు గంటలకు "ప్రభాకరా!" అని మా రెండవ అన్నగారిని దగ్గరకు పిలిచి "భాగవతము తెచ్చి భీష్మస్తవమును చదివి వినిపించు" అని ఆజ్ఞ ఇచ్చినారు. మా చిన్నన్నగారు దగ్గర కూర్చుని పఠనం ఆరంభించారు.

'ఆలాపంబులుమాని చిత్తము మనీషాయత్తముంజేసి దృ
గ్జాలంబున్ హరిమోముపైఁ బఱపి తత్కారుణ్య దృష్టిన్ విని
ర్మూలీభూత శరవ్యథానిచయుఁడై మోదించి భీష్ముండు సం
శీలం బొప్పనుతించెఁ, గల్మషగజశ్రేణీహరిన్ శ్రీహరిన్
(భాగ—ప్రథమ స్కంధము)

అప్పుడు మా నాయనగారి ముఖంలో గోచరించిన ఏకాగ్రత ఇప్పటికీ నాకు కనులగట్టినట్లే ఉంటుంది. అంతకుమునుపు అటూ యిటూ పొర్లుతూ ఉండిన మనిషికాస్తా నిశ్చలులై తదేక మనస్కులైనారు. పఠనం పూర్తికాగానే ప్రశాంతితో కనులు తెరిచి మా చిన్నన్నగారిని దగ్గరకు తీసుకొని తలమీద వీపుమీద నిమురుతూ 'నీవు వంశోద్ధారకుడవురా నాయనా' అన్నారు. అప్పుడు నాకా మాటకు అర్థమేమిటో అంతగా తెలియలేదు. ఆ తరువాత కాలక్రమాన అర్థమైంది. ఆయన యెడ మా నాయనగారి దీవెన అక్షరాలా ఫలించింది. తరువాత ఉద్క్రాంతి సమయమున జరుపవలసిన విధులనన్నిటినీచెప్పి పెట్టెలో' కాగితము లుంచినాను. దరిమిలా చూచుకోండి" అని చెప్పి భూశయనము చేయించమన్నారు. అప్పుడే "దారేషణ పుత్రేషణ ధనేషణాన్ త్యక్త్వా మయా".. అంటూ ఇది ఆతురసన్యాసము. ఖననమే గాని దహనములేదు అన్నారు. అప్పుడు మా చిన్నన్నగారు "అట్టి ఆలోచన మీరేమీ పెట్టుకోవద్దు. యథావిధిగా జరుపగలము" అన్నారు. 'సరే మీ యిష్టము' అన్నారు. చివరకు తమ చెవిన ఏడుపువినరా దన్నారు. ఆనాడు వ్యాస పూర్ణిమ. సరిగా మూడు గంటలవేళ దిగవంతులయినారు. అట్లా జరిగినది వారి అవసానము. శ్రీ ప్రభాకరశాస్త్రిగారి యెడ వారి ఆశీర్వవచనము అక్షరాల ఫలించినదనుట అతిశయోక్తి కాదు.

మరియొకనాటి సంఘటన గుర్తుకి వస్తున్నది. నేనప్పుడు ముక్త్యాలలో ఉన్నాను. వేసవికాలపు సెలవల లోను ఇతర సమయములలోను మా చిన్నన్నగారు అప్పుడప్పుడు ముక్త్యాలకు వస్తూ పోతూ ఉండేవారు. అట్టి సందర్భములలో ఒకనాటి సంఘటన ఇది. వేసవి కావడంచేత ఇంటి వసారాలో పరుండినారు. తెల్లవారు ఝామున నాల్గు గంటలైనది. రాజాగారి గుమస్తా ఒకడు వచ్చి నన్ను లేపినాడు. తన భార్యకు సుస్తీగా ఉన్నది, రక్తస్రావమగుచున్నది, వచ్చి చూడమని నన్ను కోరినాడు.

'సరే ముఖము కడుక్కొని వస్తాను. ఈలోగా ఆమెకు కాస్త కాఫీ ఇవ్వు' అన్నాను.

'కాఫీపొడి లేదు. కాస్త ఇప్పించండి' అన్నాడతను. అప్పుడు "వెనకటికి వేడి నీళ్లతో మందు అరగదీసి యియ్యవయ్యా అంటే ఆ వేడినీళ్ళు కూడా నీ సంచిలో ఉన్నాయేమో చూడమన్నాట్ట నీ బోటివాడే" అంటూ ముఖ మార్జనము ముగించుకొంటున్నాను. మా 'యహా

సంభాషణమంతా మా చిన్నన్నగారు మంచము మీద నుంచి వింటున్నారు. ఈలోగా, నేను ముఖ మార్జనము చేయుచుండగా, నా వెనుక నుంచే గ్లాసుతో పాలు, కాఫీపొడి పొట్లము తీసుకొని నా భార్య సీతమ్మ వచ్చి ఆ గుమాస్తాకి అందించినది. ఆమెకు నమస్కరించి ఆయన వెళ్లిపోయినాడు. నేను వెంటనే వెళ్ళి రోగిని చూచి వచ్చి, ప్రమాద స్థితిలో నుండుటను గుర్తించి, తగిన చికిత్స చేసినాను కాని ఫలించలేదు. ఆ దినము మా అన్నగారికి నాకు జరిగిన సంభాషణలోని సారాంశం ఇది.

అన్నగారు : "ఆర్తుల యెడ ఇంత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తే ఎట్లాగురా?"

నేను : "నేను నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించిన దేముంది? వెళ్ళి చూచి మందిచ్చి వచ్చాను. సీతమ్మ పాలు, కాఫీ పొడి ఇచ్చి పంపింది. ఇంతకంటే మన మేమి చేయగలము?"

అన్నగారు : 'విధి నిర్వహణగా కాక కారుణ్య భావంతో చేసే ఆర్తజన సేవ సత్ఫలితాన్ని ఇస్తుంది. మనకూ తృప్తి కలుగుతుంది.'

నేను : "నవైద్యః ప్రభురాయుషః" అనలేదా భావ ప్రకాశికాకారుడు. నా డ్యూటీ చేయడమే గానీ వ్యాధి గ్రస్తుడితోపాటు నేనూ బాధపడుతూ కూచుంటే ఎట్లా కుదురుతుంది?"

అన్నగారు : 'అనుభవం మీద గానీ అది నీకర్థంకాదు. పోనీ దీనికి హేతువు చెప్పు, నువ్విట్లా మట్లాడడానికీ, నీభార్య కాఫీపొడి పాలుఇచ్చి పంపడానికికారణమేమిటి? మీ యిద్దరి ప్రవృత్తుల్లోనూ ఉన్నతేడా ఏమిటి?

నేను : '....ఆవిడది అమ్మగారి తర్ఫీదు. అట్లా తీర్చి దిద్దింది. అమ్మ సంగతి నీకు తెలియనిదేముంది?"
భిషగ్వ్యాతు రాన్సర్వాన్ స్వసుతానివ యత్నవాన్!
అబాధేభ్యోహి సంరక్షే దిచ్ఛం సువిమలం యశః"
అని చరకంలో ఉంది'.

అన్నగారు : 'ఆ మాటే నేను నీకు చెప్పేది. నీ భార్య దగ్గిర తర్ఫీదు పొందాల్సిన స్థితి నీకుంది. "ఆహేతుః పక్షపాతో యస్తస్యనాస్తి ప్రతిక్రియా। సహి స్నేహాత్మకస్తన్తు రన్తర్మర్మాణి సీవ్యతి." భవ భూతిని మరొకసారి మననం చేసుకో.'

నేను: "హేతువులేని అట్టి మైత్రి ఏదో స్వతస్సిద్ధంగా కలగాలి గానీ నేర్చుకుంటే వచ్చేది కాదు గదా!"
అన్నగారు: 'నిజమే. కాని అందుకు ప్రయత్నమన్నా చేయాలికదా'

ఇదీ నాటి సన్నివేశము. నేను ఆనాడట్లా వితండ వాదము చేసినా ఆయన నాలో కలిగించిన ప్రేరణ ఆ తరువాత ఎన్నో సన్నివేశాల్లో నన్ను సన్మార్గమున నడిపిస్తూనే వచ్చింది.

మరొక సందర్భంలో—జయంతిపురానికి బండిలో ప్రయాణం చేస్తున్నాము. సంభాషణలో గాంధీజీ ఆవు దూడని చంపించిన ప్రస్తావన వచ్చింది. 'ఆయనగారి అహింసా పరమార్థం అదేనా?' అని నేను అడిగాను. నా చిత్తవృత్తిని గ్రహించి 'అహింస తన ఆదర్శం అన్నాడేగానీ ఆయన దాని చరమావస్థను చేరుకొన్నట్లుగా చెప్పలేదు. అయినా అహింస అంటే ఏమిటి? అవతలి ప్రాణిలోని బాధను సహించలేక ఆబాధ నుండి దానికి విముక్తిని కల్గించే యత్నం చేయడంలోనే దాని పరమార్థం ఉంటుంది. సాధారణ పరిస్థితుల్లో అది నువ్వు మందుతో చేస్తావు. నేను ప్రార్థనతో చేస్తాను. మరొకరు మరొక మార్గాన్ని అనుసరిస్తారు. కారుణ్యం అంటే యేమిటో అనుభవించ గలిగిన నాడు గానీ దాని ఆంతర్యం అందరికీ అవగాహనకి రాదు' అన్నారు. అప్పట్లో ఆ మాటలు నిజంగానే నాకు అనుభవానికి రాలేదు. అర్థమూ కాలేదు-ఇంకా ఏదో వాదన పెంచబోతే కాస్త కోపంగానే గట్టిగానే చెప్పారు. 'అనుభవం మీద గానీ ఇవి అర్థంకావు అని.' అట్లాగే జరిగింది. చరకంలో చెప్పినట్లు అరిష్టలక్షణా లేర్పడి చికిత్స

చేయనక్కరలేని దశలో త్యజించడమే కర్తవ్యమన్న భావన కలిగిన క్షణంలో అప్పుడైన వాళ్ళెందరో బాధ పడుతుండగా చూచి 'అయ్యో! ఈ ప్రాణం త్వరగా అవతలపడితేనే బాగుండునుగదా' అనిపించడం తరువాత నా అనుభవంలోనిదే. మరి నాకే ఇట్లా తోచినప్పుడు కారుణ్యమూర్తి సాధకుడు అయిన గాంధీమహాత్మునికి అట్లా తోచడంలో తప్పులేదనిపించింది తరువాత నాకు.

ఇంకో సన్నివేశం. అది 1910 సం॥. హాలీస్ కామెట్ వచ్చిన సంవత్సరం. నాకప్పుడు ఎనిమిదేళ్ళు. మా చిన్నచెల్లెలు భువనేశ్వరికి ఆరేళ్ళుంటాయి. జబ్బు పడింది. అందరూ వచ్చి ఉన్నారు దానికి జబ్బుగా ఉందంటే. మాఅమ్మ 'తోకచుక్క వచ్చింది. అరిష్టం. పిల్లకేమవుతుందో' అని ఆందోళనపడేది. చిన్నన్నయ్య ఆదుస్థితి చూచి బెంగపడి పోయేవాడు. రెండు రోజులు ఇదే ధ్యాసతో ఉండి చెల్లెలికి నయమైతేగానీ తాను భోంచేయనని పట్టు పట్టి కూచున్నాడు, ఇంట్లోకనపడే వాడు కాదు. స్నేహితుల ఇళ్ళల్లో ఉన్నాడేమో అనుకొనేవాడు నాన్న 'వాడి మనసు మెత్తనిది. కష్టం చూడలేడు. అందుకని ఎక్కడైనా వెళ్లి ఉంటాడు' అనేది అమ్మ. చిరరికొక రోజున ఆందోళన మరీ అధికమయింది. ఆరోజున చల్లపల్లి ముసలాయన మల్లికార్జున ప్రసాదు ఊళ్లో ఉన్నాడు. ఆయన దగ్గర మంచి మంచి మందులు "బదికించే మందులు" ఉండేవని వాడుక. ఆయనని అడిగి ఏదైనా మందుతెస్తే బాగుండునని అమ్మ అన్నది. ఆశ్రయింపుకి వెళ్ళాలంటే మా నాయనకి గిట్టేదికాదు. చివరకి తప్పలేదు. ఆయన అటు వెళ్ళేసు, ఇంట్లో ముంచుకొచ్చింది. నాన్నని పిలుచుకు రావడానికి నన్ను పంపారు-ఆయన తిరిగి వచ్చేలోగానే అంతా అయిపోయింది. చిన్నన్నయ్య గోపాలస్వామిగుళ్లో ఉన్నాడని తెలుసుకొని సాయంత్రం నాన్నే వెళ్ళి ఇంటికి తీసుకు వచ్చారు.

మా చిన్నన్నయ్య జబ్బుపడినపుడు విశ్రాంతి కోసం కొన్నాళ్ళు కళ్ళేపల్లిలో ఉన్నాడు. ఆ రోజులలో తెంజెర్ల పురుషోత్తం నిర్వచనోత్తర రామాయణం పాఠం చెప్పమంటే ఆ పనివల్ల తనకూ కాస్త మానసికంగా ఉత్సాహం కలగుతుందని తలచి ఒప్పుకొన్నారు. అట్లాగే భట్లపెనుమర్రునుంచి ఒక భట్రాజు కోరితే శృంగార నైషధ పాఠం చెప్పేవారు. పొద్దున ఒకళ్ళకి సాయంత్రం ఒకళ్ళకి పాఠం జరిగేది. అప్పుడు నన్నూ మా మూడో అన్నగారిని కూడా కూచుని పాఠం వినమంటే మేమూ వినేవాళ్ళం. వాటిల్లో ఎన్నో పద్యాలు మాకు ఇప్పటికీ నోటికి వచ్చును. ఇట్లాగే మరొక సందర్భంలో ప్రేరణ కలిగించి మాచేత బుద్ధ చరిత్ర చదివించారు. మా నాయనగారికీ మాకూ కూడా చదివి వినిపించారు. రోజూ అందులోని కొన్ని పద్యాలు వర్ణించి అప్పచెప్పే వాళ్ళము. బుద్ధ చరిత్రని గురించే మరో సందర్భం గుర్తుకొస్తోంది. తిరుపతి శాస్త్రిగారు పోయినప్పుడు చిన్నన్నయ్య ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో కొన్ని పద్యాలు ప్రకటించారు-

"బుద్ధ చరిత్రమునన్ మనసు పుట్ట పంతిచుచునుందు,
నందు జ్ఞా
నోద్ధతుఁడల్లి బుద్ధుఁడొక యుక్తినిఁ బుత్ర వినాశ
దుఃఖితన్
వృద్ధనుదేర్చు పట్టునః స్రవించిన తిర్పతిశాస్త్రి సత్కవి
త్వోద్ధతి బుద్ధిఁ బాఱి యిపుడూఱటనాఱటమున్ ఘటిం
చెడున్"

(1921 ఏప్రెల్)

ఆ పద్యాలు చదివి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు మా చిన్నన్నగారికి ఉత్తరం వ్రాశారు. బుద్ధ చరిత్ర తానే వ్రాసినట్లు. అప్పుడు బదులు వ్రాయకుండా దరిమిలా ముక్త్యాలలో కలుసుకొన్నప్పుడు చిన్నన్నయ్య వెంకటశాస్త్రిగారితో ఇట్లా అన్నారు. "నేనే కాదు లోకమంతా బుద్ధ చరిత్ర తిరుపతిశాస్త్రిగారి రచనే అను

కొంటున్నది. కొన్ని పద్యాలు మీరూ రాశారేమో కాని తిరుపతిశాస్త్రిగారు వ్రాస్తుండగా దగ్గరున్న విషయం నాకు జ్ఞాపకముంది. ఆయన ఉన్నప్పుడు ఇద్దరి పేర్ల తోనూ వేసుకొనేవారు. ఆయన పోయిన తర్వాత మీరిట్లా పృథగ్భావం చూపడం బాగాలేదు" అని. అందుకు వెంకటశాస్త్రిగారు "అట్లా పృథగ్భావం చూపడం నా పొరపాటే నని ఒప్పుకుంటానుగాని అందులో ఎక్కువపద్యాలు మాత్రం నేనే వ్రాశాను" అన్నారు. చిన్నన్నయ్య తామెరిగినవీ తిరుపతిశాస్త్రిగారు వ్రాసినవీ కొన్ని పద్యాలుచదివి వినిపించారు. "అవును-అవి తిరుపతిశాస్త్రివే' అని వెంకటశాస్త్రిగారు అంగీకరించారు. ఈ సందర్భం నాకు బాగాగుర్తు. అది రౌద్రినామ సంవత్సరం. పండిత గోపాలాచార్లుగారు, తిరుపతి శాస్త్రిగారు ఇద్దరూ అప్పుడే పోయారు. ఇటు వైద్య రత్నమును అటు విద్యారత్నమును ఆంధ్రలోకాలంకారములైనవారినిట్లా "గడన్ గడిపితేలా రౌద్రి దుర్వర్షమా" అని చిన్నన్నగారు పద్యాలు వ్రాశారప్పుడు.

చిన్నన్నగారు జబ్బుపడి కళ్ళేపల్లిలో ఉన్నప్పుడే మా నాయనగారు పోపూరి దాసయ్యగారనే ఒక మంత్రశాస్త్రవేత్తని సంప్రదించారు. గ్రహం పట్టిందని జపం చేయించాలని అంటే నాయనగారు ఆ యేర్పాటు చేయించారు. అది యెవరికీ ఇష్టం లేదు. చిన్నన్నయ్యకి అట్లాటి జపాలమీద అసలే నమ్మకం లేదు. ఆ జపం నలభై రోజులపాటు జరగవలసి ఉంది. రోజూ దాసయ్యగారు వచ్చేవారు. జపంచేస్తూ కునికిపాట్లు పడుతూ చొంగ కారుస్తూ ఉండగా ఒక రోజున చిన్నన్నయ్య వెళ్ళి నాయనగారిని పిలుచుకువచ్చి "చూడు ఆ జపమూ ఆ పద్ధతీను-రేపటినుంచి ఇది మాన్పించు" అన్నాడు. తొందరపడకుండా నాయనగారిచ్చిన తీర్పు ఇది. 'ఆయన మంత్రవేత్తఅని అందరూ అంటారు. ఆయన మంత్రవేత్తే. దీనివల్ల నీకు శ్రేయస్సు కలుగుతుందన్న నమ్మకంతోనే దీన్ని నేను చేయిస్తున్నాను. నువ్వేమో ఆయన్ని నిశితంగా పరీక్షించి మాన్పించమంటున్నావు. ఆయన కునికిపాట్లు పడుతున్నమాట వాస్తవమే కానీ అ పాపపుణ్యాలు ఆయనవి. నలభై రోజులూ ఆయిన తర్వాత ఆయన డబ్బు ఆయనకిచ్చి పంపిద్దాము." మా చిన్నాన్నగారు ఊరుకున్నారు.

కుంభకోణం యోగా సొసైటీలో చేరక మునుపు చిన్నన్నయ్య జబ్బుపడి కళ్ళేపల్లిలో ఉన్నప్పుడే పోతే పెద్ది వెంకట్రామయ్యగారు అవనిగడ్డలో ఉండేవాడు. ఆరోజుల్లో అయిన ప్రతి శనివారమూ, ఏకాదశినాడూ అవనిగడ్డలో భజనకూటాలు నిర్వహించేవాడు. ప్రతి శనివారం కళ్ళేపల్లినుండి అవనిగడ్డకు సాయంత్రం నాలుగు గంటలకల్లా బయలుదేరి నడిచివెళ్ళి చిన్నన్నయ్య అ కీర్తనలో పాల్గొంటూ ఉండేవాడు. "తరముగాని ఎండవేళ కల్పతరునీడ దొరకినట్లాయె ఈ వేళ" అంటూ మా చిన్నన్నయ్య తరచు ఆ పాటను తలచుకొంటూ ఉండేవారుకూడా. ఆ కీర్తనకారుల భక్తి పారవశ్యానికి పరవశిస్తూ ఉండేవారు ఆరోజుల్లోనే మంగళగిరికి వెళ్ళి స్వామికి పానకం అదీ పోసి ఒక వారం ఉన్నారక్కడ-మంత్రం పెడుతుందంటే మంగళగిరి బాలాంబగారిదగ్గరికివెళ్ళారు-ఆవిడేదో రక్షరేకూ అదీ ఇచ్చి 'సర్వగ్రహం బందు సర్వవ్యాధి నివారణ' అని మంత్రంకూడా జపించమన్నది. కాని ఏమిచేసినా ఎక్కడ తిరిగినా అయనకి ప్రశాంతి లభించలేదు. అప్పటి అయన ప్రవృత్తి అంతా ఒక్కటే. "ఈ జబ్బు ఎట్లా కుదురుతుందా దీన్ని ఎవరు కుదురుస్తారా" అనే. చివరికి అన్వేషణకంతా లక్ష్యం, జీవితపరమావధి మాస్టర్‌యోగంగా పరిణమించింది. దానివల్ల ఆయన ఎంతో శాంతిని పొంది తనచుట్టూ ఉన్నవాళ్ళకీ అట్టిశాంతిని అనుగ్రహించగలిగారు. అయన జన్మకారణం జీవిత పరమార్థం అందులోనే దర్శించి చరితార్థులైనారు. *

# పర్భాకరశాస్త్రిగారి జనకులైన

# వేటూరి సుందరశాస్త్రిగారి రచనలు



అత్త అల్లుండు అప్పులా డాలి అతిథి
పంచపైశాచములు సుమ్మ బట్టి విడువ,
రెట్టి వారైన చిక్కులఁగట్టు వడరె
బ్రతికి యున్నంత కాలంబు భావమందె!

**తత్త్వము :—**

అయ్యో! జీవున కెప్పు డమితా కష్టమెగాని సుఖ మెన్నాటికి లేదుగా పరికింపా!

మును జేసిన కర్మమూల మ్మాశ్రయించి పురుషూ పొట్ట జేరుగా మూణ్ణెలలూ॥

సతిపతులు మరుకేళి సల్పాగను గోత్ర స్ఖలనా మె నివసించుగా శుక్లంబు॥

శుక్ల ౹గకూ్కనాగలుసుకా వకా్క కరుడై యొప్పెగా కొన్నాళ్ళు॥

అయిదు మాసములాకు అంగాములేర్పాడి ఆరోనెల జీవయ్యెగా గర్భానగ॥

కదలాకుండా మావిచేగట్టుబడి యుండి గతిగాన కుండెగాదా కొన్నాళ్లు॥

తల్లీ దిన్నా ఉప్పు కారాము చేతాను తాపమొంది త్వక్కూగా కొన్నాళ్ళు॥

గర్భనరకామూన కనలూచు కంజాక్షు ఘనతా గొనియాడు గాదా మనసూనా॥

దైవా వశముచేత దల్లి గర్భమునుంచి ధరకేగూ తరి కల్గెగా కష్టమున॥

చెప్పారా నటువంటి చెడుమార్గమూనుంచి జన నాము నొందెగదా యేడ్చుచునూ॥

మంత్రసాని నాభిక్రుంతానా మొనరించి తలయంటి తడి యొత్తగా తత్క్షణమె

పాత గుడ్డలు పక్కాబరచి పండబెట్టి బలసి రక్షిం చిరిగా పదినాళ్ళు॥

మలమూత్రామిశితామై నలిగీనా పొత్తిళ్ళా మెలగా వలసి- వచ్చెగా కొన్నాళ్ళు॥

అమ్మా రొమ్ము పాలాధారముగా గ్రోలి ఆర్నెలలూ జీవించుగా కష్టమునా॥

ఆరో మాసమునం దన్నప్రాశనజేయ నఖిలా రుచులా దెలిసెగా హరి కృపను॥

ఈడు వారితోడ గూడియాడుట నేర్చి దుడుకు ఖాదనబరగెగా చెడుపనులా॥

బాల్యావస్థాచేత బాలురతో గూడి వలుగాకి యన బరగెగా బహుగతులా॥

నూనూగు మీసాలు రాగా పొగరెక్కూవై యెగిరి పడుటా గల్గెగా మదిలోన॥

పరకాంతాలను జూచి పగలాబా టెక్కువై పాడు పనులు నేర్చుగా పలుగతులా॥

తల్లి దండ్రుల మాట తలకెక్కాకెక్కువ టక్క రుల గలుసు గదా మిక్కిలిగ॥

తండ్రి యెన్నో గతుల దారాకై యారసి తన్వి దెచ్చి గట్టుగదా తహతహనూ॥

దారా పుత్రాది దంపడిజిక్కి మిక్కిలి తగని పనులు జేసుగా ద్రవ్యముకై॥

దారా పుత్రాది మోహాంబుధి దల మునిగి తన్ను కొనుచు సుండుగా తరి మరచి॥

పరుల ద్రవ్యాదుల బహువిధంబుల గొంచు బలిసి చరించునుగా తల మునిగి॥

దారా పుత్రామలకూ తాజెప్పహిత వెల్ల తగని విసుగు దోచుగా సరిపడక॥

ఆశా బహుయెక్కువై అతిధికభ్యాగతుల కన్నా ఘనగ మండుగా దనయింటా॥

పొట్టాకైనా దినక దిట్టాపరచిన సొమ్ము పుత్రుల కిచ్చు గదా కష్టమున॥

తలుపూ దగ్గర జేరి బలిభిక్షముల వార్ని తగిలి కొట్టుచు నుండుగా కాంక్షెక్కువై॥

తల తెల్లనై దంతములూడి చేతితో కోలాబట్టుక తిరుగుగా ముదిమీని॥

కాళ్ళు నడుపరాకా కర్ణముల్ వినరాక కనులా మందము గప్పగా ముదిమీని॥

గడనాయుడిగి యిల్లు గదలకుండుట జూచి కసర గొట్టుదు రందారు దన్గనినా॥

ఆర్జించినదుడ్డు ఆలూబిడ్డలకిచ్చి అధమాధము డౌనగా పడియున్న॥

చీమా దోమల దోల చెయ్యాడకయుండ చేరి తోలుదురోకదా! దయకల్గి॥

కర్మ పరిపక్వమై కలిబాసి సద్గతికి గ్రక్కున చేరుగదా నిముసమున॥

జీవుడనుభవించు చెడు కష్టములన్ని జెప్పనలవి గాదుగా ఆరయగా॥

వేటూరి సుందరుడు వెతలెన్నెన్నో గుడిచి చాటి చెప్పెను వినుడీ సత్యముగా॥

చాటి చెప్పెను వినుడీ!



ఉపన్యాసము:

# శ్రీ త్యాగ బ్రహ్మోత్సవ మండప ప్రవేశోపన్యాసము

వేటూరి ప్రభాకరశాస్త్రి

స్థలము : తిరుపతి
తేదీ : 13-4-1949

శ్రీ వేంకటేశ్వరస్వామీ! త్యాగరాజస్వామీ! ప్రహ్లాద గాంధీ ప్రముఖ పరమభాగవతాగ్రేసరులారా! తుంబురు నారదాన్నమార్య దీక్షిత పురందరదాస రామదాస నర్సింహదాసాది భగవత్సంకీర్తన పరాయణులారా! మీరందఱు నీ త్యాగరాజోత్సవ దినములలో నీ యున్నత వేదిక మీఁదను సభాంగణమునను సభ్యుల హృదయాంగణమునను సుప్రతిష్ఠితులై యానందమయులు గండు! శ్రోతల కానందమయత ననుగ్రహింపుఁడు. త్యాగరాయలవారి సంగీత విద్యావంశమున పౌత్ర ప్రపౌత్ర పరంపరా సంజనితులై స్వామికి సంగీత కైంకర్యము జరుపుటకై సముత్సాహపడి విచ్చేసిన గాయక వర్యుల హృదయ తంత్రులలో మీరు దివ్యగానము దైవాఱఁజేయుఁడు! మీకందఱకు స్వాగతము!

ఈ స్వాగతోక్తులు గాలికిఁ గొట్టుకొనిపోవు కల్లబొల్లు మాటలు కాకుండుఁగాక! గాలిదుమారములు రేగుచున్న హృదయములతో అందదుకుల పందిటిలో మమ్మాహ్వానించుచున్నారా యనకుఁడు. క్షమింపుఁడు. అట్టి యపచారమింక నాచరింపము. ఇఁక దృఢముగా మిమ్ము హృదయమునఁ బ్రతిష్ఠించుకొందుము. గట్టి కట్టడము కట్టుటకు నడుము కట్టుకొందుము. అనుగ్రహింపుఁడు! ఆశీర్వదింపుఁడు!

అన్నమాచార్య సంకీర్తన గంగయు, త్యాగరాజ కృతి యమునయు,నిచ్చోట సంగమము చెందనున్నవి. ఈ రెండిటినడుమ సంగీత సరస్వతి యంతర్వాహినిగా నున్నది. ఇక నీ పుణ్యస్థలము ప్రయాగాఖ్యతోఁ ప్రఖ్యాతి గాంచఁగలదుగాక !

త్యాగరాజస్వామీ! మీయద్వైతానుభూతి మాకానందము గొల్పుచున్నది. మీరు శివ, దేవీ, రామకృష్ణ, లక్ష్మీ, సరస్వ త్యాది దేవతలను ఆయా పుణ్యస్థలముల యర్చా మూర్తులను స్తుతించుచు కృతులను రచించితిరి గాని, అన్నింటను ఈశ్వరాద్వైతానుభూతినే భగవంతుని సచ్చిదానందాత్మకతనే వ్యక్తపఱిచితిరి !

మీకృతులలో భావరాగతాళములు పరస్పరము సమేళమై యానుకూల్యముతో ఐక్యముతో ప్రసారము చెంది చెంది యాహ్లాద వినోదము లలరార్చి ముక్తాయింపు ముగింపులో మూడును చరమానందమున సమన్వితములగు తీరులు మామనసు తలఁపును, నోటి పలుకును, మేని చెయిదమును నైక్య వరిపాకమునకు దార్చి, మా జీవితములనే దివ్య సంగీతములఁగావించి మమ్ముఁగూడ సుకృతులఁగా వెలయించుఁగాక!

బండుదుండగములాడువాడు "పలుకు తేనెలతల్లి" పాటలఁ బాడఁజాలడు. కట్టెలు గొట్టువాడు వీణ మీటఁజాలడు. సంగీతము సుకుమారకళ! ఇది భక్తి జ్ఞానపరమగుచో సుకుమారాతి సుకుమారము, మధురాతి మధురము నయిన యాత్మానుభూతికి త్రోవ త్రొక్కిం

చుననుట మీ యనుభవము. శ్రుతిస్థాయితప్పని గానము నేర్పినట్టే మీరు భగవత్పరమేయయిన రచనను గూడ నేర్పితిరి. మీ గేయరచనా గాన విధానములు మానవ లోకోద్ధారకములు, దివ్య ప్రజ్ఞాస్ఫోరకములు.

మిత్రులారా! సభ్యులారా! భగవంతుని కభిముఖముగా మన జీవయాత్ర సాగించుచు నాయనతో నన్వయము చెందునట్లు చేయుట గానమునకు పరమార్థము ఈ జీవశ్రుతి స్థాయిని సదా హృదయమునఁ గుదుర్చుకొని మనము గానానందము ననుభవింతముగాక!

ఈ యర్థమునకుఁ దార్కాణగా త్యాగరాజ ప్రసక్తమగు నొక కథ మీరు వినగోరుచున్నాను.

త్యాగరాజుగారి తాతలకాలమున తెల్గు దేశమున భయంకర క్షామపీడ కల్గెనట. ఒక పల్లెటూర వీరితాతగారు భగవత్సంకీర్తనము జరుపుకొనుచు పలువురనాకట్టుకొని పూజ్యులుగా ఉండేవారట. ఆయన యాయూర నాహారపదార్థముల గొందఱిండ్ల నున్నవాని నందఱకు బంచిపెట్టించి నేటి రేషన్ విధానమున కొన్నాళ్ళు తక్కువ తిండితో ఊరివారి ప్రాణములు నిలిపెనట. ఏ యింటను చిట్టెడు గింజలుకూడ లేని దుస్థితి వచ్చెను. ఎండలు మండుచున్నవి. మరణయాతన వచ్చినది. ఈ ముసలి బాప డీశ్వరుడున్నాడు రక్షించును అని సంకీర్తనము చేయుచుండెను. ఆ యూరి కైదాఱు మైళ్ల దూరమున నీరులేని యిసుక యెడారి యేఱును, దాని కావలిగట్టున నొక గ్రామమును, నాయూరి రెడ్డి యింట జాల నిలువధాన్యము నుండుట వినవచ్చెను. వానలు లేకున్నను నా యేటి చలువకు బావులలో నీళ్లుండుటచే నాయూరఁ గొంత పంట పండెను. ఈ భక్త బ్రాహ్మణుని ననుసరించి యూరివా రయిదుగు రారెడ్డిని యాచింప బయనమైరి. ఈ బ్రాహ్మణుడును పయనమయ్యెనుగాని రక్షకుఁడు భగవంతుడనుచు బాటలోఁబాటలు సాగించెను. ఇసుక యేటిలో నడక. మట్టమధ్యాహ్నము మండుటెండ. ప్రాణాపాయ స్థితిలో నందఱునుండిరి. చింపిరిబట్టలు కాళ్లకు జుట్టుకొనికూడ నిలువను నడుగు సాగింపను జాలకుండిరి. నోళ్లు పిడుచకట్టుకొని పోవుచుండెను. ఇట్టిచో కొన్ని గజముల దూరమున, జీబుకొన్న చిగురాకుజొంపములతో నిండారిన నీడతో నొక గొప్ప వృక్షము గానవచ్చెను. భక్తబ్రాహ్మణుడు దానిని జూచి తనిసి యటు చేరబోవుదమనెను. అందొకడు మన కనులుతిరిగి మతిచెడి యట్టు చెట్టు గానవచ్చినది. నే నెఱుగుదును. ఇక్కడ చెట్టెన్నడును లేదు. చావో బ్రదుకో నేను మీదియూరికే యడుగు సాగించెదనని బండతనముతో నడువసాగెను. కడమ వారు కళవళపడసాగిరి. భక్తుడు 'నేను ముందు చేరబోయి నిజమయినచో మిమ్ము కేకవేసి పిలుతును రండని చెట్టును జేర నడచెను. చల్లనినీడచెట్టాతని కుల్లాసము గొల్పెను. కడమవారు ముగ్గురు నాయన పిలుపునఁ జేరఁజనిరి. అందొకడు 'మాయో నిజమో చల్లని నీడ దొరికినది, నోరు పిడుచకట్టుకొని పోవుచున్నది. స్వామీ! చెట్టునీడ నిప్పించినట్లు నీరుకూడ నిప్పింపుఁడు అనెను. భక్తుడు ప్రార్థించెను. అంత నాచెట్టు చిగురు జొంపములనుండి చల్లని తియ్యనీరు చెంబులతో బోసినట్లు ధారలుగా జారసాగెను. కనులు మొగము కడుగుకొని కడుపాఱ వాచాఱతో నీరుద్రావి తల యొడలు కాళ్ళు గడిగికొని హాయిహాయిమని యందఱు నానందించిరి. ఇదేమి వింతో అనిరి! ఒకడిట్లనెను. మండుటెండలలోను, పాడుగుళ్ళలోను, నీరులేని పాడునదులలోను దేవతలో పిశాచములో విహరించుచుందు రందురు. వారెన్ని వింతలయినఁ గొంతకాలము చేయగలరు. ఇదేదో అట్టివారిపని. ఏదైనా కానిండు. ఇది మాయము కాక ముందే మన మంచి జరుపుకోవలెను. అయ్యా! మీరు ప్రార్థించండి. వచ్చినది తిండిగింజలకై -ఇంట, ఊర, అందరు చస్తున్నారు. వారికి నేటికి వలసిన బియ్యము, పప్పువగైరా పదార్థాలు కావలెను" అనెను. ఫండ్లు రాలినట్లు బియ్యపు మూటలు, పప్పులు వగైరాల

మూటలు రాలెను. తనవంతుగై కొని, యూరివారిని బంపుడుససి కాళ్ళు కాలకుండుటకుఁ గూడఁ బ్రార్థింపు దని భక్తునివేడి, యాతడింటికిఁ బర్వెత్తెను.

మగ్గురున్నారు. ఒకడు: 'ఇదేదో ముసలిబ్రాహ్మణుని మంత్రమహిమ. మంత్రాలకు చింతకాయలు రాలునా యన్నమాట తలక్రిందైనది. ఉచ్ఛిష్ట గణపతి మంత్రమో అట్టిదింకేదో యాతడు జపించుచున్నాడు. అట్టి క్షుద్రదేవత లిట్టి ఫలములు కూర్పగలవు. మహామంత్రములు పరదేవతలు పరలోకమున ఫలప్రాప్తిని కలిగించునేకాని తుచ్ఛమైన యిహసుఖముల నీయవు. ఏమైనాకానీ, ఇప్పుడు చచ్చుచున్నాము గాన, కోరక తప్పదు. అయ్యా! మాయూరి కరవు తీరుదాక ఊర నందరికి కావలసిన యాహార మా యిండ్లనే వేయునట్లు మీ దేవతనో, దయ్యమునో ప్రార్థింపుడు' అనెను. భక్తుడు ప్రార్థించెను. ఆతడు మరల ననెను. 'ఏమో! యిండ్లకడ లభించియుండవచ్చును. నాకిక్కడ కడుపార మంచి పండ్లు పాలు తిండ్లు దొరకవలెను. అవితిని నేనింటికి వెళ్ళుదు' ననెను. వానికోరిక లభించెను. ఆరగించి వాడింటి కరిగెను.

ఇద్దఱున్నారు! ఒకడు: 'మీ భక్తికి మెచ్చి కల్పవృక్షమిక్కడ వెలసినట్టున్నది. ఏమికోరవలెనో తెలియజాల కున్నాను. నాకేమి కావలెనో వానినన్నిటినీ మీరే యీ కల్పవృక్షముచే నిప్పించండి' యనెను. భక్తుడు ప్రార్థించెను. కాని చెట్టునుండి యేవియు రాలవయ్యెను. ఏల రాలకున్నవో బదులు చెప్పుమని భక్తు డావృక్షమును వేడెను. చెట్టు గజగజ వణఁక సాగెను. కొంత కిట్లు చెట్టునుండి బదులువచ్చెను. 'ఇంత దాక నేను నన్ను గోరినవారికి వలసినవస్తువులనే యియ్యగల్గుచుంటినిగాని. ప్రశ్నములకు బదులెఱుగుట పలుకుట యెఱుఁగను. మీ ప్రార్థనవల్ల నాకొఱత తెలిసికొని, నాయంతర్యామిని పరమాత్ముని వేడి నేఁడా ప్రజ్ఞనుబడసి మీకు బదులు చెప్పగల్గుచున్నాను ఇది నాకు కావలెనని యడుగ నేరనివానికి, దాని లేవడివలని యిబ్బందిని గుర్తింపని వానికి, ఏదిగాని లభింపదు. అట్టివాని కేది యిచ్చినను దానిని వాడు సరిగా ననుభవింపఁ జాలఁడు. కాన యీతని కేదీ యియ్య వీలు లేదు. తన కొఱతల నాతఁడు గుర్తించి, యర్థించుఁగాక' యనెను. అతఁడు యోచించు చుండెను. భక్తుఁడు ప్రార్థించెను. 'నీ వెవరవమ్మా! కల్పవృక్షము నీవేనా?' 'నేను కల్పవృక్షమనే, నీ ప్రార్థనలాలకించి, నాయంతర్యామి సర్వాంతర్యామిని యీశ్వరుడు కోరికలు దీర్పఁబంపెను. కోరుము' అనెను. ఆనందపరవశుఁడై 'అమ్మా! ఇక నిన్ను విడువఁజాలను. మునుముందుగా ఈపని గావింపుము. నన్ను నమ్మక మీది గ్రామమునకు దూకిన వాడేమి సంకటములో నున్నాడో వానినిటకు దెప్పింపుము.

కల్పవృక్షము మీదియూరు చేరలేక స్మృతి దప్పి దోవలో పడియున్నవానిని రాల్చెను. 'స్మృతి లేదు. వానికిఁ బ్రాణము పోయు'మని భక్తుడువేడెను. 'అయ్యా ఇది నావల్లఁగాదే'యని వణకుచు నంతర్యామి నర్థించి దానిని గొనితెచ్చి వానికిచ్చెను. పాలలో పంచదార కలసి పోయినట్లు నీవు నాలో గలసిపోయి నా రూపముననే నెలకొనుము. కల్పవృక్షము అన్ని కోరికలను దీర్చునది యన్న ప్రసిద్ధి నిలుపుకొనుమాయని భక్తుడనెను. 'ఎన్నడు నెవ్వరును గోరని గోరికలు కోరుట జరుగు చున్నదే' యని యచ్చెరువుచెంది యది యంతర్యామి నడిగి యిట్లు బదులు చెప్పెను. "నేను నీలో నైక్యమందుదును గాని నీవు ప్రపంచ ప్రాణి

కోటితో నైక్యమందవలెను. మానవతలో నేప్రాణినిగాని నీవు వేఱుపఱుపరాదు. ఏ భాగమున నీవు వ్వేరాటు పాటింతువో ఆభాగమున నే నుండవీలుండదు". సర్వ పరిపూర్ణత గోచరించి భక్తుడు ఒల్లెయని పరమానంద భరితుడై చెట్టును గౌగిలించుకొనెను. చెట్టు మాయ మయ్యెను. చెట్టు మాయమగుట చూచి చావు దప్పించు కొన్న తొల్లిటివా 'డిదియంతా మాయయని నేనన్నట్టే యయ్యె'ననెను. కడమవారు కూడ వారు తొలుత నను కొన్నట్లే యనుకొనిరి గాఁబోలును! భక్తుని తర్వాత తీరెట్టుండఁబోలునో మీరే పర్యాలోచించి నిర్ణయించు కొందురుగాక! ఈ కథనో, ఆ చెట్టునో కడుపునఁ బెట్టుకొని త్యాగరాజుగా రీపాట పాడిరి!

'తరముగాని యెండవేళా కల్ప
తరునీడ దొరికినట్లాయె యీ వేళ
నన్ను విడిచి కదలకురా, రామ!"
నిన్నెడబాసి యరనిమిష మోర్వనురా!
నన్ను విడిచి కదలకురా!'

త్యాగరాజుగారి కీర్తనలన్నీ లోతు తఱచి చూచి నచో నిట్టి యనుభవముల నాద బ్రహ్మావతారములే!



స్వామీ! అంతర్నిలయా
స్వయం వ్యక్తమై వెలయ
నాయజ్ఞానావరణమును
నలిగులి చేయు మహాత్మా!

అద్దమువలె దేహం బిది
అమలినముగ జేసికొని
నిద్దవు నీ తేజము జగ
దుద్దీప్తము చేయగదే !"

వే॥ ప్ర॥

# సనత్సుజాతీయము

వేటూరి ప్రభాకరశాస్త్రి

అనుక్తం యదితే కించి ద్వాచా విదుర
తన్మే శుశ్రూషతో బ్రూహి విచిత్రాణీహ భాషసే
1

ఓ విదురా! నీవు విచిత్రములగు విషయములఁ జాల నెఱుంగుదువు. కావున నాకు కొన్ని చెప్పితివి. ఇంకను జెప్పఁదగిన విచిత్రము లున్నయెడల నాకుఁ దెల్పుము. నాకు వినవలయునని కోరిక గలదు. అని ధృతరాష్ట్రుఁడు విదురుని అడుగుచున్నాడు.

ఉ॥ తమ్ముఁడ! నీవెఱుంగుదువు ధర్మ విశేషము
లెన్నియేని చి
త్రమ్ముగఁ జెప్పనేర్తువు గదా! విదురా! మది
వేడ్క హెచ్చె నా
కిమ్మెయి నేవినందగిన వీవును జెప్పక యున్న
వింక ధ
ర్మమ్ములు గల్గినన్ దెలుపుమా యని కోరెడు
నాంబికేయునిన్.

శ్లో॥ ధృతరాష్ట్ర కుమారో వై యః పురాణస్స
నాతనః।
సనత్సుజాతః ప్రోవాచ మృత్యుర్నాస్తీతి
భారత!॥ 2
సతే గుహ్యాన్ ప్రకాశాంశ్చ సర్వాన్ హృదయ
సంశయాన్।
ప్రవక్ష్యతి మహారాజ! సర్వబుద్ధిమతాం
వరః॥ 3

ధృతరాష్ట్రుఁడా! చాల కాలమునుండి యున్నవాఁడును, ఎల్లప్పుడుండువాడు అయినను చిఱుప్రాయముగల వానివలె గనంబడు సనత్సుజాతుఁడు "మృత్యువనునది లేదు" అని నాకుఁ జెప్పెను. బుద్ధిమంతులలో శ్రేష్ఠుడగు ఆ మహామునియే నీకుఁ గల గూఢములగు సంశయములను సామాన్య సంశయములను చక్కగా దీర్పఁగలడు, అని విదురుడు పలికెను.

చ॥ విదురుడు గాంచి పల్కెఁ బృథివీవర!
యో ధృతరాష్ట్ర! నీమదిం
గదిరెడు సంశయమ్ములు ప్రకాశములున్
మఱి గూఢముల్ హరిం
పఁదగు సనత్సుజాతుఁడు, కుమారుఁడతఁడు
పురాణుఁడయ్యు నా
సదయుఁడె 'నాస్తి మృత్యు' వని చాటెననన్
ధృతరాష్ట్రుఁడిట్లనున్

శ్లో॥ కిం త్వం నవేద తద్భూయో యన్మే బ్రూయా
త్సనాతనః।
త్వమేవ విదుర! బ్రూహి ప్రజ్ఞాశేషోఽస్తి
చేత్తవ॥ 4

విదురా! సనత్సుజాతుఁడు నీకీవిషయమును ఉపదేశించెను గదా! ఆ మహాముని యుపదేశించిన తత్త్వమును మఱవకున్న యెడల నీవే ఆ విషయమును నాకు చెప్పుమని ధృతరాష్ట్రుఁడు విదురు నడిగెను.

గీ॥ నాకు నీవె యాసనత్సుజాతుఁడు మున్ను
దెల్పినట్టి దానిఁ దెల్పుమన్న!
విదుర! నీకు మఱపు గదురదయేనియు
నదియు నీవెఱింగినదియయేని.

శ్లో॥ శూద్రయోనా వహంజాతో నా తో న్య ద్వక్తు
ముత్సహే।
కుమారస్యతు యా బుద్ధి ర్వేద తాం శాశ్వతీ
మహమ్॥ 5

ధృతరాష్ట్రుఁడా! సనత్కుమారుఁడుపదేశించిన జ్ఞానము నేను ఎఱుంగుదును. మఱువలేదు. ఐనను నేను శూద్రజాతియందు పుట్టి యున్నాను. కావున నీకు ఆరహస్యార్థము నుపదేశించు అధికారము నాకు లేదు అని విదురుఁడు చెప్పెను.

గీ॥ విదురుఁ డను నిట్లు నేనెఱుంగుదు సనత్కు
మారువలని తత్త్వజ్ఞాన సారమెల్ల
అయిననేమి నాకది తెల్పనయితి గాదు
శూద్రకులమున నేజనించుటను జేసి.

శ్లో॥ బ్రాహ్మీం హి యోని మాపన్న స్సుగుహ్య
మపి యో వదేత్
నతేన గర్హ్యో దేవానాం తస్మాదేతద్బ్రవీమితే॥
6

బ్రాహ్మణుఁడెట్టిరహస్య విషయము నుపదేశించినను దేవతలు వాని యందు నిందను మోపరు. శూద్రుఁడు రహస్య విషయములను ఇతరుల కుపదేశించునేని వానిని నిందింతురు. కావున నీకు నేనా రహస్య విషయమును ఉపదేశింపఁజాలనని చెప్పితిని అని విదురుఁడు చెప్పెను.

గీ॥ బ్రాహ్మణుండైనచో నెట్టి వరమ గూఢ
తత్త్వమును నన్యులకు దెల్పదక్షుఁ డగును
దేవతలచేత నతఁడు నిందితుఁడు గాఁడు
దాన, నద్దాననే జెప్పదగను జూవె॥

శ్లో॥ బ్రవీహి విదుర! త్వం మే పురాణం తం సనాత
నమ్।
కథ మేతేన దేహేన స్యాదిహైవసమాగమః॥ 7

విదురుఁడా! రహస్య విషయముల నుపదేశించు సామర్థ్యముఁగల సనత్కుమారుఁడు నాకీజన్మమునందు ఇచ్చటనే ఆ విషయముల నుపదేశించునటుల నీవు వారితో చెప్పుమని ధృతరాష్ట్రుఁడనెను.

క॥ అనఁగా ధృతరాష్ట్రుండి
ట్లను, నాకిమ్మేనితోడ ననుఁగునే క
న్గొన నా సనత్కుమారున్
ఘను నా సంశయము లెల్లఁ గడముట్టుటకున్?

శ్లో॥ చింతయామాస విదర స్తమృషిం శంసిత
వ్రతమ్।
స చ తచ్చింతితం జ్ఞాత్వా దర్శయామాస
భారత!॥
స హైనం ప్రతి జగ్రాహ విధి దృష్టేన కర్మణా।
సుఖోపవిష్టం విశ్రాంత మథైనం విదురోఽ
బ్రవీత్॥
భగవన్ సంశయః కశ్చిద్ధృత రాష్ట్రస్య మానసః।
యో న శక్యోమయా వక్తుం త్వమస్మై వక్తు
మర్హసి॥ 10

విదురుఁడు ధృతరాష్ట్రుని వచనమాలకించి సనత్కుమారర్షిని మనస్సునందు తలంచెను. ఆ సనత్కుమారర్షి విదురుని తలంపును తపో మహిమచేత నెఱింగి వెంటనె అచ్చట ప్రత్యక్షమాయెనని వైశంపాయనుఁడు జనమేజయునితో చెప్పెను(8). ప్రత్యక్షమైన సనత్కుమారర్షికి ధృతరాష్ట్రుఁడు మధుపర్క-పూజాదికము సమర్పించి సత్కరించి కూర్చుండ బెట్టెను. ఆ మహర్షి సుఖముగా గూర్చుండి విశ్రమించిన తరువాత విదురుఁడు ఈవిధముగ నా మహర్షితోఁ బలికెను (9). 'ఓ మహర్షి వర్యా! ధృతరాష్ట్రుని మనస్సునందొక సందేహము గలదు. ఆ సందేహమును నేను తీర్పఁజాలను, ఆ సందేహము వీడునట్లు మీ రుపదేశింపుఁడు' అని విదురుఁడు మహర్షితో పలికెను( 0).

సీ॥ అంత నవ్విదురుండు చింతించె శంసిత
వ్రతుఁడౌ సనత్కుమారకు మహర్షి
నమ్మహర్షియు దాని నారసి వారికి
నాత్మరూపంబు ప్రత్యక్షపఱిచె

వారు సమ్మహనీయు నారాధనము చేసి
రక్షణ పాద్యాది సమర్హణముల
విశ్రమించి సుఖోపవిష్టుఁడైన మహర్షి
విభుఁ గెలుగవ మోడ్చి విదురుఁడడిగె
ఆర్య! యువధారు మా యన్న కాంబికేయు
నకును మానస సంశయంబొకటి గలదు
తీర్పఁగా రాదది నాకు దేవ! మీకుఁ
దెలుపుకొను నాతఁడది చక్కఁదీర్పుఁడయ్య

శ్లో॥ యం శ్రుత్వాఽయం మనుష్యేంద్రః సర్వదుః
ఖాతిగో భవేత్।
లాభా లాభౌ ప్రియద్వేష్యౌ యథైనం నజ
రాంతకౌ॥ 11
విషహిత మదోన్మాదౌ క్షుత్పిపాసే భయాభయే।
అరతించైవ తంద్రీంచ కామ క్రోధౌ క్షయో
దయౌ॥ 12

ఈ ధృతరాష్ట్రుఁడు దేనిని వినిన సకల దుఃఖము లను పోగొట్టుకొని లాభా లాభములు మున్నగువాని వలన ఇంచు కంతయేని చలింపక ఎట్లుండునో అట్టి యుపదేశమును చేయుఁడని విదురుఁడు సనత్కుమారు నితోఁ జెప్పెను.

ద్విపద:-జరయును మరణంబు సౌఖ్యంబు గష్ట
మరతి తంద్రియు మఱి యాఁకలి దప్పి
కామంబు క్రోధంబు క్షయ ముదయంబు
ప్రేమంబు ద్వేషంబు భీతి యభీతి
యను దుఃఖముల దాటి యానందపదము
కనుఁగొత మది విని క్ష్మాతలేశ్వరుఁడు

శ్లో॥ తతో రాజా ధృతరాష్ట్రో మనీషీ
సంపూజ్య వాక్యం విదురేరితం తత్।
సనత్సుజాతం రహితే మహాత్మా
పప్రచ్ఛ బుద్ధిం పరమాం బుభూషన్॥ 13

ధృతరాష్ట్రుఁడు విదురుఁడు చెప్పినమాట ప్రామాణికమై యుండుటచేత, అంగీకరించినవాఁడై జ్ఞానవిషయమగు రహస్యము నెఱుఁగుటకుఁగాను సనత్కుమారర్షిని పామరులు లేని సభయందు ప్రశ్న మొనర్చెను.

ఉ॥ అంత మనీషి భూమివిభుఁ డా ధృతరాష్ట్రుఁడు
తన్గుతించి యు
త్యంతపుఁ బేర్మితో విదురుఁ డాడినపల్కులు
గౌరవించి యే
కాంతము సంఘటించి పరమార్థపు బోధము
నుగ్రహింపుఁడం
చెంతయు వేడ్క వేడుకొనియెన్ దల
యొగ్గి సనత్సుజాతునిన్

శ్లో॥ సనత్సుజాత యదిదం శృణోమి
న మృత్యురస్తీతి తవోపదేశమ్।
దేవాసురా హ్యాచరన్ బ్రహ్మచర్య
మమృత్యవే తత్కతరన్ను సత్యమ్॥ 14

మృత్యువు లేదని నీవు శిష్యులకుపదేశించితివని విదురుఁడు నాతో చెప్పి యున్నవాఁడు. మృత్యువును తాము పొందకుండ నుండవలయునని దేవాసురులు బ్రహ్మచర్య మాచరించిరని ఉపనిషత్తులందుఁగనంబడు చున్నదే, ఈ రెండు పక్షములలో ఏయ్యది సత్యము? అని ధృతరాష్ట్రుఁడు సనత్కుమారుని ప్రశ్నించెను.

ఉ॥ మృత్యు ర్నాస్తియటంచుఁ బల్కుదురటే మీ
మీర లేవింటినో
యత్యగ్రేసర! బ్రహ్మ చర్యనియమంబా
నాఁడు దేవాసురుల్
మృత్యుధ్వంసముకై యొనర్చిర టదేమీ?
రెండు పక్షంబులన్
సత్యం బెయ్యది నాకుఁ దెల్పఁగదరే సర్వజ్ఞ!
ప్రార్థించెదన్.

